అధ్యేష్యతే చ య ఇమం, ధర్మ్యం సంవాద మావయోః,
జ్ఞానయజ్ఞేన తే నాహం, ఇష్టః స్యా మితి మే మతిః. 70

శ్రద్ధావా ననసూయశ్చ, శృణుయా దపి యో నరః,
సోఽపి ముక్త శ్శుభాన్లోకాన్, ప్రాప్నుయా
త్పుణ్యకర్మణామ్. 71

కచ్చి దేతచ్ఛ్రుతం పార్థ, త్వయైకాగ్రేణ చేతసా,
కచ్చి దజ్ఞాన సమ్మోహః, ప్రణష్టస్తే ధనంజయ. 72

అర్జున ఉవాచ :

నష్టో మోహః స్మృతి ర్లబ్ధా, త్వ త్ప్రసాదా న్మయాచ్యుత,
స్థితోఽస్మి గతసందేహః, కరిష్యే వచనం తవ. 73

సంజయ ఉవాచ :

ఇ త్యహం వాసుదేవస్య, పార్థస్య చ మహాత్మనః,
సంవాద మిమ మశ్రౌషం, అద్భుతం రోమహర్షణమ్. 74

వ్యాసప్రసాదా చ్ఛ్రుతవాన్, ఏత ద్గుహ్యతమం పరమ్,
యోగం యోగేశ్వరాత్కృష్ణాత్, సాక్షాత్కథయతస్స్వయం. 75

రాజన్ సంస్మృత్య సంస్మృత్య, సంవాదమిమమద్భుతమ్,
కేశవార్జునయోః పుణ్యం, హృష్యామి చ ముహుర్ముహుః, 76

త చ్చ సంస్మృత్య సంస్మృత్య, రూప మత్యద్భుతం హరేః,
విస్మయో మే మహాన్ రాజన్, హృష్యామి చ పునః పునః. 77

యత్ర యోగేశ్వరః కృష్ణః, యత్ర పార్థో ధనుర్ధరః,
తత్ర శ్రీ ర్విజయో భూతిః, ధ్రువా నీతి ర్మతి ర్మమ. 78

ఇతి శ్రీ మహాభారతే శతసాహస్రికాయాం
సంహితాయాం వైయాసిక్యాం శ్రీమద్భీష్మపర్వణి
ఇతి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
మోక్షసన్న్యాసయోగో నామ - అష్టాదశోఽధ్యాయః.
సంపూర్ణమ్ – ఓం తత్సత్.

ఓం నమోభగవతే వాసుదేవాయ,

వరాహపురాణోక్త

# శ్రీ గీతా మహాత్మ్యమ్

ధరోవాచ :

భగవన్పరమేశాన, భక్తి రవ్యభిచారిణీ,
ప్రారబ్ధం భుజ్యమానస్య, కథం భవతి హే ప్రభో. 1

శ్రీ విష్ణు రువాచ :

ప్రారబ్ధం భుజ్యమానోపి. గీతాభ్యాస రత స్సదా,
స ముక్త స్స సుఖీలోకే, కర్మణా నోపలిప్యతే. 2

మహాపాపాది పాపాని, గీతాధ్యానం కరోతిచేత్,
క్వచిత్స్పర్శం న కుర్వన్తి, నలినీదల మంభసా. 3

గీతాయాః పుస్తకం యత్ర యత్ర పాఠః ప్రవర్తతే,
తత్రసర్వాణి తీర్థాని, ప్రయాగాదీని తత్రవై. 4

సర్వేదేవాశ్చ ఋషయో, యోగినః పన్నగా శ్చయే
గోపాలా గోపికావాపి, నారదోద్ధవపార్షదైః,
సహాయో జాయతే శీఘ్రం, యత్ర గీతా ప్రవర్తతే. 5

యత్ర గీతావిచారశ్చ, పఠనం పాఠనం శ్రుతం,
తత్రాఽహం నిశ్చితం పృథ్వీ, నివసామి సదైవ హి. 6

గీతాశ్రయేఽహంతిష్ఠామి, గీతా మే చోత్తమం గృహం,
గీతాజ్ఞాన ముపాశ్రిత్య, త్రీన్ లోకా న్పాలయామ్యహం. 7

గీతా మే పరమా విద్యా, బ్రహ్మరూపా న సంశయః,
అర్ధమాత్రాక్షరా నిత్యా, స్వనిర్వాచ్య పదాత్మికా. 8

చిదానందేన కృష్ణేన, ప్రోక్తా స్వముఖతోఽర్జునం,
వేదత్రయీ పరానందా, తత్వార్థజ్ఞానసంయుతా. 9

యోఽష్టాదశ జపే న్నిత్యం, నరోనిశ్చలమానసః,
జ్ఞానసిద్ధిం స లభతే, తతోయాతి పరంపదమ్. 10

పాఠేఽసమర్థః, సంపూర్ణే, త దర్థం పాఠ మాచరేత్,
తదా గోదానజం పుణ్యం, లభతే నాత్ర సంశయః. 11

త్రిభాగం పఠమానస్తు, గంగాస్నానఫలం లభేత్,
షడంశం జపమానస్తు, సోమయాగఫలం లభేత్. 12

ఏకాధ్యాయం తు యో నిత్యం, పఠతే భక్తిసంయుతః,
రుద్రలోక మవాప్నోతి, గణో భూత్వా వసే చ్చిరమ్. 13

అధ్యాయ శ్లోకపాదం వా, నిత్యం యః పఠతే నరః,
స యాతి నరతాం యావత్ మనుకాలం వసుంధరే. 14

గీతాయాః శ్లోకదశకం, సప్తపంచ చతుష్టయమ్,
ద్వౌత్రీనేకం తదర్ధం వా, శ్లోకానాం యః పఠే న్నరః. 15

చంద్రలోక మవాప్నోతి, వర్షాణామయుతం ధ్రువమ్,
గీతాపాఠ సమాయుక్తః, మృతో మానుషతాం వ్రజేత్. 16

గీతాభ్యాసం పునః కృత్వా, లభతే ముక్తి ముత్తమామ్,
గీతేత్యుచ్చార సంయుక్తః, మ్రియమాణో గతిం లభేత్. 17

గీతార్థ శ్రవణాసక్తః, మహాపాపయుతోఽపి వా,
వైకుంఠం సమవాప్నోతి, విష్ణునా సహ మోదతే. 18

గీతార్థం ధ్యాయతే నిత్యం, కృత్వా కర్మాణి భూరిశః,
జీవన్ముక్తః స విజ్ఞేయః, దేహాంతే పరమంపదమ్. 19

గీతామాశ్రిత్య బహవః, భూభుజో జనకాదయః
నిర్ధూత కల్మషా లోకే, గీతా యాతాః పరంపదమ్. 20

గీతాయాః పఠనం కృత్వా, మాహాత్మ్యం నైవ యః పఠేత్,
వృథా పాఠో భవేత్తస్య, శ్రమ ఏవ హ్యుదాహృతః. 21

ఏత న్మాహాత్మ్య సంయుక్తం, గీతాభ్యాసం కరోతి యః,
స తత్ఫల మవాప్నోతి, దుర్లభాం గతి మాప్నుయాత్. 22

సూత ఉవాచ :

మాహాత్మ్య మేత ద్గీతాయాః, మయా ప్రోక్తం సనాతనమ్,
గీతాంతే చ పఠే ద్యస్తు, య దుక్తం తత్ఫలం లభేత్. 23

ఓం తత్సత్.

# శ్రీమద్భగవద్గీతా మననము



(ఏడవ అధ్యాయం—జ్ఞాన విజ్ఞానయోగం)

సర్వలోకమహేశ్వరుడే "నేను" గా ఎలా అయినాడు.

శ్రీ కృష్ణ భగవానుడు గీతలోని మొదటి ఆరధ్యాయాలలోవ్యక్తిని గురించి చెప్పినాడు. "నేను" అంటూ శరీరాల్లో ఉంటూ ఉండేదేదో అదేమానవుడు–వ్యక్తి. ఈవ్యక్తిసమాజంలో, ప్రపంచంలో, విశ్వంలో ఎలా భాగమై ఉన్నాడో చెప్పడం ఆరంభించి, ఈ విశ్వంలో జరుగు తున్న కర్మలలోని భాగాన్ని వ్యక్తి తప్పనిసరిగా ఎలా పంచుకొన్న వాడై చేస్తూ ఉంటున్నాడో విశదీకరించాడు. ఆకారణం చేత లోకంలో నడచేకర్మలు కొన్ని వ్యక్తికి కర్తవ్యాలై ఉంటున్నాయి. వాటిని వ్యక్తి చేస్తూనే ఉండాలో–అలా ఉంటూ, వ్యక్తి, సమాజం, ప్రపంచం, విశ్వం, ఈశ్వరుడు అనే ఈ నిచ్చెనమెట్లు ఎలా ఎక్కగలడో సూచిం చాడు. వ్యక్తి ఈశ్వరునివైపునకు పురోగమిస్తూ మార్గమధ్యములో ఉన్నప్టి తన సమాజం, ప్రపంచం, విశ్వములకు అనుకూలంగా ఉప క్రమించి శాంతిని పొందటమే అతడికయిన కర్మ అని బోధించి,దానికి తగిన జ్ఞానం సాధనంలను చెప్పారు.

మరి ఈ ఈశ్వరుడెవరు? అతడి ప్రభావం ఈవ్యక్తిలో విశ్వం లో ఎలాఉంటున్నది,అనే దానిని తెలియజెప్పడానికి ఈ అధ్యాయంలో ప్రారంభిస్తున్నారు. వ్యక్తిని కేంద్రంగాచేసి ఆరధ్యాయాలు వివరించి రెండవవైపునుంచి ఇప్పుడు ఆరంభించి. ఈశ్వరుణ్ణి కేంద్రంగాచేసి చెప్పటం గమనిస్తాము. 'త్వం'పదవివరణ మొదటి ఆరధ్యాయాలూ కాగా, 'తత్త్వమసి'అనే మహావాక్యంలోని తత్పదవివరణ ఈ అధ్యా యంలో మొదలవుతున్నది.'అహం బ్రహ్మాస్మి'అనేవాక్యంలోని బ్రహ్మ ఏదో ఆవివరణమిది అని అర్థం.

శ్రీకృష్ణుడు క్రిందటి అధ్యాయంలో 47వ శ్లోకంలో అందరి కంటె ఎవరు ఉత్తముడనేది చెప్తూ "నా" యందాసక్తుడై "న"న్ను

భజించేవాడు ఉత్తముడన్నాడు. "నా" యందు అన్నప్పుడు 'నాది' 'నాది' అనబడే వాటిని విడగొట్టి మిగిలిన 'నా' యందు అనేఅర్థము న్నది. బ్రహ్మమునందు పురుషోత్తముడైన భగవంతుని యందు అని కూడ సూచన ఉన్నది. ఆభగవంతు డెవరని తెలిస్తే అతడి మీద ఆసక్తి కలుగుతుంది. అతడిని ఆశ్రయించి కర్మయోగాభ్యాసంచేసి నప్పుడు సఫలత కలుగుతుంది,

1. శ్రీకృష్ణు డంటాడు—ఒక ప్రక్క కర్మయోగాభ్యాసం చేస్తూనే భగవంతునిగూర్చి తెలియడంలోమేలు ఉంది. అప్పుడు సమ గ్రంగా విషయంతెలియడం కలుగుతుంది. అలాగాక చేసేపనితో, అనుభవంతో సంబంధంలేకుండాజ్ఞానం తెలియడం పరిపూర్తిఅందదు. భగవంతుడు పూర్ణుడు. సర్వవిధాల వానిని ఎరిగినప్పుడే సమగ్రంగా తెలియడం జరిగేది. జ్ఞానం విజ్ఞానమై వెలిసేది.

2. అర్జునా నీకు శ్రేయోమార్గమయింది కర్మయోగమని చెప్పాను. దానిని అభ్యాసంచేయాలి, ఈమార్గంలో ఇప్పుడు అత్యంత ముఖ్యమైన సంగతులు చెప్పేస్తాను. ఆ జ్ఞానం నీకు సమకూర్చుతాను. దానిని అనుభవం చేసికొంటె విజ్ఞానం కలుగుతుంది. అప్పుడిక దేనికీ తడుముకొన వలసిన దుండదు.

3. ఈసంగతులు తెలియడమనేదే సత్కృతు.మనుష్యుల్లో వేయింట ఒక్కడు ఈ మార్గంలో సిద్ధి పొందాలని ప్రయత్నచేంస్తాడు. అలా ప్రయత్నించే వాళ్ళల్లో వేయికి ఒకడు 'నా' గురించి తత్త్వతః తెలిసి కొంటాడు. అందుకనిచెప్పవోయేదిజాగ్రతగవిను.ఊరకే బుద్ధితోతెలిసి కొంటూఆచరణలోమరిచిపోయేవాడు'న'న్నెరిగినవాడు కాజాలడనిధ్వని. 'నేను' ఉన్నాడు అనుకొంటూనే వాడుతనకంటెభిన్నుడనుకొంటూ ఉన్న వా డవుతాడు-అహంకారిగా సాధకుని స్థితిలో దానినికూడ దాటాలి.

యోగం ఎలా అభ్యాసం చేయాలో చెప్పాను. బుద్ధియందు

ఆత్మనుంచుమనీ,మనసును బుద్ధిలో లగ్నంచేయుమనీని. ఆత్మఅంటే అర్థం పరమేశ్వరుని అంశగా శరీరంలో ఉండి'నేను' అంటూఉండేది అని. శరీరంకాదు. ఆత్మకానిదంతా అనాత్మ అంటాము. కాని అత్మ అనేది లేనిచోటే లేదని అవగతం కాంగానే ఆత్మాఽనాత్మలు రెండూ 'బ్రహ్మము' అనే పేరుతో పిలువబడి సాక్షాత్కారమవుతుంది. అలా ప్రపంచంలో బ్రహ్మన్ని చూస్తూనే ప్రవర్తిస్తూఉన్నా అతడు పరమేశ్వరుడైన 'నా'యందే ఉన్నవాడవుతాడు. కనుక అలా నడుచుకొంటూ ఉండటంముఖ్యం. తెలిసికొని ఊరుకొనడం సరికాదు. ఒకటి తెలిసి మరొకటి నడిపించటం సరికాదన్నమాట.

4. నాయందుండటమంటే ఏమిటో''నా''సంగతేమిటో ఇప్పుడు చెప్తానుగాక.నీకు తెలిసింది ఈ ప్రకృతి గనక, దానిపరంగానేచెప్తాను. వినుఈ భూమి, ఈనీరు, అగ్ని వాయువుఆకాశం, మనసుబుద్ధి–ఇంతేకాదు అహంకారం ఈఎనిమిదీభగవంతుడైన నా ప్రకృతికి చెందినవి. 'నేనే' అలాపరిణామంచెంది అలారూపం మారుతున్నది. నీవే నీగోష్ఠా నీ జుత్తుగా కాలేదా? ఆ ఎనిమిదీ నా అవయవాలు అనుకొన్నా ఫరవా లేదు. అవి పనిచేయడానికి కారణం'నేను'. ఇది జ్ఞాపకముంచుకొను.

5. కాగా నాకు చెందిన శరీరం ఈ పైచెప్పిన ఎనిమిదేనని అనుకొనవద్దు. ఈ ఎనిమిదింటితో నీకు కళ్ళకు అగుపడే ప్రకృతి తయారయింది. ఇది అపరా ప్రకృతి మాత్రమే. ఇదిగాక జీవప్రధానమైన పరాప్రకృతి వేరేఉన్నది. దానిచేతనే—ద్వారానే—ఈజగత్తునాచే ధరింపబడుతున్నది.

గవ్వలు తెచ్చి అతికించి బొమ్మలుచేస్తావు. పెన్సిలుతో గీతలు గీచి అపూర్వమైన చిత్రాన్ని సృష్టిస్తావు. అలాగే నేను నాపరాప్రకృతినీ అపరాప్రకృతినీతెచ్చి కలిపి మిమ్ములను తయారుచేస్తుంటాను. ఇది

గమనించు. అలా కల్పితయారుచేసినప్పటి భగవంతుడైన నా ప్రేమ, దయ ఆరెంటికీమీతోగల సంబంధమే మీజీవితాలకు ఆధారం.

ఆ ఎనిమిదీ ఈ ప్రపంచవస్తువులు తయారుకావడానికి ఉపయోగింపబడే మూలపదార్థాలు. నీమనసూ బుద్ధీ కూడ భగవంతుడైన 'నా' ప్రకృతిలోనుండి వచ్చినవే. కాని ఈమనసూ బుద్ధులయితే ఇతర శరీర భాగాలకు సన్నిహితమై ఉండి, తాము భగవంతుడనుకొనకుండా (ఆ ఇతర శరీర భాగాలనూ భగవంతుడను కొనకుండా) శరీరంలో నున్న ఒకానొక 'తాను' అనుకొంటూఉండేటట్లు చేస్తున్నవి. 'నాది' 'నాది' అని ఎమపకుండా ఉన్నవాటిని ఆశించే అహంకారం కూడ నా ప్రకృతిలోదే. అదీ భగవంతుడిలో భాగమే. కాని, నేను అంటూనె అది, భగవంతుడన్నభావాన్ని విడగొట్టి మిగతాదానికి పరిమితం చేసికొని ప్రవర్తిస్తున్నది. ఈ పరిమితత్వమే 'అహం' అనేది. నేను 'అహం' మయిన ముహూర్తమిదే.

అలాగె పరాప్రకృతి సంగతి చెప్తానువిను. నీ శరీరంలో ఎల్లెడలా ప్రవహిస్తున్న జీవం కూడ (తత్) నా అంశమె. నా అనేదానికి అపరాప్రకృతిపై గల ప్రేమ, దయ, సంబంధం ఏదివుందో దాన్ని చూచి మనంజీవం అనుకొంటున్నాముఅనేది ఆలోచించి స్థిరపరచుకో. ఈపరాఽపరప్రకృతులుతత్‌లోనిభాగాలేననుకో 'నా'భాగాలేననితెలిసికో.

నీ భాగాలయితేనరెతత్. ఎవరోచెప్పు మంటావా! 'నే'నెవరో చెప్పుమంటావా? ఈసమస్త జగత్తునూ పై చెప్పిన విధంగా ఉత్పత్తి చేసేవాడనూ ఆజగత్తునూ కూడనేనే. అవయవాలునవీలేనప్పుడు కూడ "నేను" ఉంటున్నాను. ఈ అవయవాలన్నీ చేర్చిశరీరంలో పెట్టు కొన్నంతకాలం జగత్తుకూడ "నేనే" అవయవాలునావికావునేనులోవికావు అన్నంత తెలివితక్కువేముంటుంది! పర్యాయాన్ని కలిగించేవాడినినేనే సర్వానికీకారణమైనవాడిని. నీగోరుచూపించి అందులో నీవెక్కడఅంటే ఏంచెప్తావు? అలాగే భగవంతుడైన నన్ను అర్థంచేసికొను.

ఇక్కడ సాధనకు ఒక సూచన ఉంది. నీవు సాధన చేసేటప్పుడు యీపృథివ్యాప స్తేజోవాయు రాకాశాల సంయోగమే నీశరీర మనీ అలాగే యీ జగత్తు. అంతానూ అనీ–అందుకని నీవూ జగతూ కూడ పరమేశ్వరుడైన నాలోని అంశాలనీ అనుభూతి చెందాలి. నీశరీరాన్ని చూచుకొని అది మాత్రమె నీవు అనేభావం–కనీసం సాధన సమయం లో– మార్పుచేయాలి. అభ్యాస సమయంలో మొదలు పెట్టి ఎల్లప్పుడూ కూడ ఈ జగత్తు అంతా ఆ తత్ యొక్క భాగమే అనే భావం మనసం చేయాలని బోధ. "నేను" లో భాగమే అని అనుభూతి చెందాలి.

"నేను" అనేదేమిటి. నేనుగాలి పీలుస్తున్నాను. ఈగాలి ఎక్కడకు వెళ్తున్నది. ఊపిరి తిత్తుల్లోకి పోయే వరకూ తెలుస్తుంది. అక్కడ ఆగిపోతోంది. అక్కడ నేనుకు ద్వారం అనచ్చు సాధన ప్రకరణంలో. దానికి ఆకారం రూపం పదార్థం లేవుగనక ఒకబయలు ప్రదేశం అనుకోవచ్చు మొదట్లో. లేదా కేవలం 'నేను' అనేభావం మాత్రమే అనచ్చు. ఈ బయలు వేరు–దీని చుట్టూ వచ్చే పోయే ప్రాణాఽపాన వాయువులు వేరు. చుట్టూ ఉన్న రక్తం కండలూ గుండె అవివేరు, ఈ బయలు (నేను) వేరు. ఈ నేనుకూ మిగతా వాటికీమధ్య ఏదోసంబంధం ఉంటుందికతా– ఆసంబంధమె జీవం దానిని గురించి ఇప్పుడు యోచింపవద్దు. అ బయలును (నేనును) మాత్రమే భగవంతుడనే భావంతో కలిపి మిగతావన్నీ అనాత్మఅనేభావంతో కొన్నాళ్లు ధ్యానంచేస్తే–ఆతరువాత ఎప్పుడో అన్ని అణువుల్లో కూడ ఈ ఆత్మే, బయలే, ప్రచలితమై ఉంటోంది అనే భావం కలుగుతుంది. ఆ భావం మళ్ళీ అనుభూతి కావాలి. అప్పుడు ఈ పైచెప్పిన ప్రేమ దయ అనేది వ్యాప్తమై సర్వము నందున్నూ సర్వజగత్తు నందున్నూ ఈ జీవం వెలుగుతున్నట్లు స్పష్టం అవుతుంది. అదేభక్తి స్థూలంగా.

కాని బయలునుభావించేటప్పుడు కూడ రూపంగానే చూస్తాము– నిజానికి. అందుకే ఉపనిషత్తులలో – "ఉమాసహాయం పరమేశ్వరం

ప్రభుం" అని ఆయన్ను, ఆజడ ప్రకృతి అయిన ఉమ రూపంతోసహా అక్కడ చూచి ధ్యానింపుమనిబోధ. ఉమా మహేశ్వరుల మీన నమ్మకంలేనివారికి ఈ బయలును ధ్యానంచేయుమని చెప్పటం అవుతుంది. నమ్మినవారు ఇష్టదైవాన్ని-రూపముగానే ధ్యానిస్తూ జ్ఞాన విషయం మననం చేయాలి అని బోధ.

కనుక నీమనసునే చూడు.తలచు.నీబుద్ధినే తెలిసి తలచుకొను. అప్పుడు అహం కూడ తత్‌లోలయిస్తుంది. ఇదేభక్తిని ఎరిగే మార్గం. నేను సర్వలోక మహేశ్వరుడని తెలిసే మార్గం.

7. ఈ ప్రపంచానికి ఆ తత్ కంటె శ్రేష్ఠతరమైన కారణం వేరొకటి ఏదీలేదు. ఆ నేను నుంచే ఈ భౌతిక మైనవన్నీకలిగినయి. ఆ ప్రాతిపదిక మీద అనుసంధానం చెయ్యి. దేనిని చూచినా భగవంతుడయిన (తత్) నేనె జ్ఞాపకంరావాలి. మణులహారంలో ఉన్నదారంలా ఆధారమై అంతటా నేను న్నానని తెలిసికొను. కర్పూరహారం ఉంది. పటానికి వేశాను. కొన్నాళ్ళకు కర్పూరం హరించిపోవచ్చు. ఐనా అది హారం అనే మనం అలవాటుగా పరిగణిస్తాము. దారం అనితోచిన క్షణాన తీసివేస్తాముగాక. మారే కర్పూరం, మారనిదారం విడివిడిగా చూడనప్పుడు హారం అనేభావాన్నిఎలా అనుభవిస్తామో అలాగే యీ మారేజడమూ (జగత్తు) మారని ఈ మానవుడూ (నేను) కలిపిచూస్తూ భగవంతుడని తెలిసి అనుసంధానంచేయుమనిచెప్పటం అరెంటినీ చూచి ప్రపంచం అంటే అది మారిపోయిగనకన్నీమనసుకు స్థిరతరాదు.భగవంతుడంటె అస్థిరతవస్తుంది.

8. నీవుంది.అది నీవనీ నీఅవయవమని ఏలాఅనుసంధానంచేయడం అంటావేమో. నీ చేసే సేవ అని ఎలా తెలిసికొని ప్రవర్తిస్తున్నావో అలాతెలిసికోవాలి.అందులోని జీవం-రసం అనుకో-ద్రవం అనుకో-రుచిఅనుకో-దానిలో ఏది అంతరాంతరాల్లో ఉన్నదో అది అనుకోక. అదినేను-అక్కడను-అనుకొన్నట్లయితేఅదే నా అవయవంగాని ఏమన్న

తుంది! దానిలో సర్వత్రవ్యాపించి అనేను ఉండటం చూడుమని బోధ. ఏవస్తువు నయినా దాని ఆకారం కాదు- కేవలం గుణమూకాదు-చూడ వలసింది! ఇంక ఏ ఒక్క లక్షణమూకాదు. అది అలా ఉండటానికి కారణం ఏదో అదీ భగవంతుడు. అదే నేను. ఆకాశంలో శబ్దంనేను దాని అంతరాంత రాళాలలో ఉన్నదినేనే.మనుష్యుల్లో పురుషకారంనేను అంటే ప్రయత్నమన్నమాట. మనుష్యునికి కర్తవ్యం అనేది ఒకటుంది ఉదాహరణకు గాలి పీల్చటం అది చేయడమనేది అతడి ప్రయత్నం. అదేపురుషకారం బ్రతికి మిగిలిన ప్రపంచమనే భగవంతుడికి ధర్మాన్నను సరించి సేవలు చేయటం, అనగా తాను చేయ వలసిన కర్తవ్యం చేయటం-ఇదే అతడు మనుష్యుడనబడటానికికారణం ఆ కర్తవ్యం క్రమిటనేది తెలిసికొనకపోతె మనిషికావడం మానేస్తాడనిధ్వని. జంతువుకూ అతడికి తేడా అదే.

9. భూమిలో పుణ్యగంధాన్ని నేను.ఎండిన భూమిమీద వర్షం కురిస్తె చక్కని సుగంధంవస్తుంది. అది భూమి అంతరాంతరాల్లో నుంచి వస్తోంది అనుకొంటే అదే భగవంతుడని అనుభూతిచేయటం అభ్యాసంచేయటం, అంటున్నాడు భగవంతుడైన శ్రీకృష్ణుడు. కన్పడుతుండేభూమికీ, అది భగవంతుడనే అనుసంధానానికీ ఎంత పలుచని పలునైన తెరఉందో అది ముందుకనిపెట్టుమని చెప్తున్నాడు. అగ్నిలో తేజమేనేను. సర్వభూతాల్లో ప్రాణమేనేను. అందుకని వీటిని చూచి నన్ను జ్ఞాపకంతెచ్చుకొను. భగవంతుడయిన నన్నుదర్శించు. ఇదీనీవు అభ్యాసంచేయవలసిన యోగపద్ధతి.

10 పార్థా! సర్వభూతాలకూ నేనే బీజాన్ని, స్థావర జంగమాలన్నింటికీ నేనే ఆధారమైన వాడిని వివేకవంతులు అనే భావంలో వివేకము అనేది నేనే తేజస్వంపన్నులనే వారిలో తేజస్సు నేనే స్థావరమూజంగమమూ అనే వాటికి అందని ఈ భావాలలోని మూల భావం నేనే నన్నది జ్ఞాపకముంచుకొను. ఒక మనిషి ఆకారం చూసి-భావించి- అది మాత్రమే

నేను అని అనుకొనవద్దు కేవలం ఒక విగ్రహం చూచి అదే నేనను కోవద్దుసుమా! అదినేనే అది మాత్రమే నేననుకొనటంతప్పు.

11-12. బలవంతులలోని బలంనేనే అదంతా ఎందుకు! కోరిక అనేది కలగడానికి బీజమయిన శక్తినినేనే,అలా అన్నానని ధర్మ విరుద్ధమైన కామాన్ని చూపి అదీ భగవంతుడే నంటూ దానిని అను సరించు దామనే భ్రమకో పడిపోకు. నీవు వ్యక్తిగా కర్తవ్యమే చేయ వలసినవాడివి. మీకోరికలు అధర్మమయేకారణం శత్రువశమైన మీ మనసులు. శత్రువులంటే ఎవరోకాదు. ఎడమచెయ్యి కుడిచెయ్యాలాగా నాలోభానేగమై ఉన్న విడివిడి గుణాలూ,వాటితో కలిగిన క్రోధాలున్నూ. ఇవేమీమనసుకు శత్రువులు. మనసూ 'నా' లో నుంచే వచ్చిందిగాక. ఈ సత్వరజస్తమో గుణాలూ నానుండే కలిగిన వవుతవిగాక.కాని అవి వచ్చి మీమనసుల్ని ముంచివేయకుండామీరుచూసుకోవాలి. అవి 'న'న్ను ముంచలేవుగాక = ఇంత వివరంగా నీకు ఎందుకు చెపుతున్నానంటే చెడును చూచి దానిని భగవంతుడేననుకొన్నా ఫరవాలేదు-కాని భగ వంతుడేకదా అని చెడును ఆవహింపజేసికొనటంతగదు. అనేదితెలియ మనిచెప్తున్నాను. ఎక్కడపడితె అక్కడ చూచి నన్నుగుర్తించాలినువ్వు. యోగారూఢుడవుకావాలి ఆవిధంగా.

13. నాలోనుంచి వచ్చినవే అవుగాక ఈ త్రిగుణాలు-సత్వ- రజ-స్తమోగుణాలు. మీమనసూ బుద్ధులూ నాలోవే అవుగాక.మీ మనో బుద్ధులు.యీ త్రిగుణాలవల్ల మోహం పొందినవై "నన్ను" ఎక్కడ పడితె అక్కడున్న వాడిని తెలిసికొనలేక పోతున్నాయి. ఈ మనసూ బుద్ధిలకు విషయాలను తెలిసికోగలిగే లక్షణమున్నది గాక కాని త్రిగు ణాల నుంచి రాగం ద్వేషం మోహంలాటి-వికారాలు ఉద్భవిస్తు న్నాయి. ఈ వికారాల వల్లనే సర్వజగత్తూ మోహితమై పోతున్నది. పదార్థాలు కూడ ఆగుణాలనే పుక్కిలిస్తుంటున్నాయి. ఆవికారాలనె మన సుతో చెప్పకొనుపుంటున్నాయి; అందుకనె మనసూ బుద్ధిలు "నా"

సంగతిని పట్టించుకోకుండాసర్వత్ర ఉన్ననన్ను గుర్తెరగడం మానివేసి ఎదుటి అపరా ప్రకృతినిమాత్రం గుర్తించుతూ ఉంటున్నాయి. పరుడ నూఅవ్యయుడనూ అయిన నన్నుగుర్తించటంలేదు.

14. "అయ్యో! మరి ఇలా ఎందుకని అవుతోంది?" అంటా వుగాక. భౌతికంగా కారణంచెప్పనే చెప్పాను. గుణాలు, వికారాలు మీదృష్టికి అడ్డురావడమని. వాస్తవంగా చెప్పాలంటె అది "అవిద్య" అనిచెప్పాలి. "నా అవిద్య" 'నాది' అనడంలోగల అవిద్య 'మమ మాయె' దానికి కారణం. మమమాయ అంటె నాది నాది అని ఇష్టమైన దానిని చూచి అనుకోవడమనె "అవిద్య" "తెలియని తనం" అని అర్థం. సర్వత్రఉన్న నేను అనే భగవంతుడైన నన్ను"ఒక్కనినే అను సంధానంచేయవలసి ఉండగా, నాకు సంబంధించిన ఫలాన—నాదైన ఫలాన అంటూ అనిత్యమైనవస్తువులవెంటపడటమె తెలియని తనం. అవిద్య.మాయ.ఈభ్రమఅనబడుతున్నదాన్నివదులుకొంటె—వ్యవహారం ప్రపంచనడక నడిచేదెలా అనే సందేహ పడవద్దు. భగవంతుని తెలిసి కొనే సాధనకాలంలో ఈ ప్రపంచం ఏమవుతుందోననిభయపడుతుంటే అసలు సాధనే ఆరంభించలేదని అర్థం. సాధన మొదలు పెట్టాను అన్న తర్వాత ఇకవ్యవహారం అడ్డురాకూడదు. సాధన ఇంత వరకు చాలు అనుకొంటే ఇక నాప్రసక్తి తేవచ్చుగాక. మనం సాధనలో ఉన్నంతసేపూ ఈ ప్రపంచం ఏమీ అయిపోవదనే స్థిరతను ముందు పొందాలి. అలా ఎల్లప్పుడూ ఉన్నా ప్రపంచం ఏమీకాదు.చల్లగా వెళ్ళి పోతూఉంటుంది.

కాగా—మరి—ఈభ్రమనువదిలించుకొనిబయటపడేదెలా?విద్య ను ఎరుగవలె. అప్పుడే అవిద్యనశించేది.విద్యఅనేదె జ్ఞానం.నేను అనేది భగవంతుడేను అనేజ్ఞానం. భగవంతుడె ఆ జ్ఞానం అనేది. అందుకె.

"నన్ను" ఆశ్రయిస్తేగాని అన్నప్పుడు, భగవంతుడే అయిన "నేను" నుఆశ్రయిస్తేగాని అని అర్థం—అంటే సర్వత్రనున్నభగవంతునిఎఱుక చేస్తేగాని—ఈమమకారంపోదు, ఈ మాయవిడదు. ఈ అజ్ఞానం నశించదు. అందుకే"నేను"ను ప్రధానంచేసి బ్రతుకుమన్నది. వానినె శరణుపొందుతూ యోగాభ్యాసంచేయుమని చెప్పింది, 'నాది' అనేదివదలివేసి, నేను అనేతత్‌ను ఎల్లెడలా అనుభూతిచేస్తూ బ్రహ్మముఅనేదాన్నిదానితో కలిపివేసి చూడుమనటం. ఎల్లెడలా అతడు ఉన్నాడనే అనుభూతికలిగినప్పుడు ఇంకా నాదినాది అనేభ్రమకు తావుండదనిధ్వని.

సర్వత్ర నేనె అనే అనుభూతికలిగితె నేనూ—నీవూ అనేతేడా ఉండదు. నేను అనే పేరే జ్ఞాపకంరాదు. తత్ ఒక్కటె దర్శనమవుతుంది. అదె భగవంతుడు. పరమాత్మ. అహంకారమైన నేను అనే పరిమితిపోయి తత్ పదార్థమైనభగవంతునితో ఐక్యమవుతుంది. అహం అంటె పరిమితమైనది. అందుకె మమత్వమంటే పరిమితమైన తనం. అహం ఒకభావమె. ఆ భావం పోయి'భగవంతుడు లేదా తత్‌అనేభావం రావాలి, అప్పుడూసర్వమూ తత్ పదార్థమైన పరమాత్మ వైపునకు పయనించడం అయేది.

15, అలాగాక మమత్వం వల్ల మోహితులై నమూఢులు దుష్టులై పోయే అవకాశం వుంది, వారి జ్ఞానం మాయవల్లహరించిపోతుంది. అప్పుడు వారిమనోబుద్ధులనాసంగతేపట్టించుకొనకజగత్తుకే మాత్రమే వగబడినవై అసురభావాన్ని ఆశ్రయిస్తవి. సాధన సమయంలోనైనా ఆ జ్ఞానాన్ని అనుసంధానంచేయడం అనేది లేకపోతె, ఎల్లప్పుడూ కేవలం జగద్వస్తువులనే ఆశిస్తూవుంటే త్వరలో అసురభావం వారి మనోబుద్ధిలను ఆకట్టుకొంటుందనిధ్వని. అసురభావం రాంగానె పరపీడనంవస్తుంది.పాపం ఎక్కువయిపోతుంది.వారు నరాధములై పోతారు అంటున్నాడు శ్రీకృష్ణుడు.మానవులలో వాళ్లు పరమ అధములంటాడు.

ఇక వాళ్ల నన్ను, అంటే నేను ను తత్ ను స్మరించరు. పుణ్యవిషయం తలచడానికే వాళ్ళకుమనసు నిలువదు. అసురభావం అంటే అన్ని సుఖాలూ తనకే రావాలని, ఇతర్లకు రారాదనే భావం అనచ్చు స్థూలంగా. అలాటివాళ్లు నరాధములు. మానవత్వంలేని వాళ్ళన్నమాట.

16. అలా అసురభావంచేత ఆక్రమింపబడిన వాళ్ళనువదలి పేద్దాము. మిగతావాళ్ళ విషయం చెప్తానువిను. వారయితేఎప్పుడో ఒకప్పుడు "నన్ను" తత్‌నుభజిస్తారుగాక—ఎల్లప్పుడూభజించినాభజింపకపోయినా. వాళ్ళ నాల్గురకాలు అనచ్చు. ఆర్తులు, అర్థార్థులూ, జిజ్ఞాసువులూ. జ్ఞానులూ. నిజానికి సర్వులకూ తమ తమ పనులు చేసికొనడానికి, తమఉనికికి శక్తినిస్తున్నది ఈ నేనే. ఇలా శక్తినివ్వడానికి కారణమైన వాడిని నేను అనే విషయం ఈ నాల్గురకాల వారికీ ఎప్పుడో ఒకసారైనా తెలుస్తుంది. కాని నరాధములకు మాత్రం ఇది తెలియనే తెలియదనిధ్వని. ఈ విభాగం మనుష్యుల్లో విభాగాలు తేవడానికి నేను చెప్పటంలేదు. తత్ పదార్థమే తమకు కావలసినశక్తిని ఉనికిని ఇంకా దేన్నయినా ఇస్తున్నదనె విషయం తెలిసికొనటంలోగల డిగ్రీనిబట్టి, స్థాయిని బట్టి వేరు వేరుగా చెప్తున్నాను. వీళ్ళందరిలో జ్ఞాని ఉత్తముడు ఆదృష్ట్యా. "నా" శక్తి అతడికి ఏలాచేరుతున్నదో అతడికి ఎల్లప్పుడూ సర్వకాల సర్వావస్థల్లో తెలుస్తూనె ఉంటుంది. శ్రీరామకృష్ణపరమహంస అందుకుతార్కాణం అనచ్చు.

"ఆర్తి" పొందట మంటే ఫలానివ్యాపారంలోనష్టం వచ్చేట్లుంది; దాని నుండినన్ను రక్షిస్తేపాతిక కెంకాయలు గుళ్ళో అందిస్తాను —అనెవానిఆర్తికాదు, "తత్"(నా) వెపుతెరుచుకొనిఉండేఒకేదోవలోపడి శరీర-మనో—బుద్ధుల సంయోగంతో కలిగించే ఆర్తిసంగతిచెప్తున్నది: పసివాడుంటాడు, అతడి బుద్ధికి కార్యకారణబంధం ఇంకా తగుల్కొని ఉండదు. ఎత్తుమీదనుంచిపడతాడు, దెబ్బతగులుతుంది, ఏడుప్తుఇంకారాదు

అప్పుడే. అతడికి ఇంకో పరిష్కారం తెలీదు. ఆ ఆర్తితో శరీరంలోని సర్వఅణువులనూమర్చిపోతాడు. "ఆ" అంటూ గుక్కపట్టుతాడు. మనం వాడిచెవులూ కళ్లూమూస్తాము. అతడిమనసూ (ఉంటే) బుద్ధీలు వెళ్ళి ఆత్మలో ఐక్యం అవుతయి, అప్పుడు ఆత్మయే అయిన "నేను"లోని శక్తి వరుసగా బుద్ధి మనసు దేహములలోకి ప్రసరిస్తుంది. ఆశక్తి కోసమె అతడు అలమటించిపోతున్నది. కనీనం గాలిపీల్చుకొనడు, ఆసమయంలో అదీ ఆర్తి. సర్వద్వారాలూ మూసుకుపోయి ఒకేఒక 'నా' ద్వారం తెరుచుకొన్నప్పుడు మనిషికి తెలుస్తుంది నాశక్తి—అదె—ఆత్మ శక్తి—ఎలా తన శరీరంలోని ప్రతి అణువుకూ ప్రసరిస్తుందో!

ఈ అర్తులు అని విభాగం చేయడంలో శరీరంతో తాదాత్మ్యం పొందిన వారిని చెప్పడానికి అనేభావం కనిపిస్తున్నది.

అర్థార్థి అనేవాడు మనసునకు సంబంధించిన ఆర్తికలవాడు. బహూశ ధ్రువుణ్ణిదృష్టాంతంగా తీసికొనవచ్చు. సర్వద్వారాలూ మూసివేసి తత్ వైపు ద్వారం మాత్రమే తెరచినవాడీయన. అప్పుడే 'నా' శక్తి తనవైపునకు ప్రసరించినట్లు తెలిసింది. మనసు తీవ్రతద్వారా తత్ ను తెలిసేస్థితి. సునీతచెప్పింది—నారదుడుబలపరిచాడు. బుద్ధియింకా పూర్తిగా కార్యకారణసంబంధంలో తగుల్కొలేదుగనక నమ్మకంకుదిరింది. అందుకని బుద్ధి అడ్డురాలేదు. దర్శనమయే సమయంలో మెట్టునెక్కి— నాకు ఇంకేధనాలూ వద్దు. నీవేకావాలిఅనే జ్ఞానస్థితికి వెళ్ళినవాడీయన.

ఇక "జిజ్ఞాసువు" బుద్ధితో తాదాత్మ్యంచెందిన మనలాంటి వాడీయన. గజేంద్రుడు. ఇతడికి పెద్దబుద్ధిఉంది. అది అడ్డురావటంవల్లనె వేయిసంవత్సరాలు ఒంటరిగా మొసలితో యుద్ధంచేశాడు—కార్యకారణ సంబంధంతెగడానికి అన్ని ఏండ్లు పట్టిందనిధ్వని. అప్పటికి ఆభగవంతుడు తప్ప ఇంకొకరు రక్షించేవాళ్లులేరన్న ఊహకలిగింది. ఈ తత్ ఎవరో తతఃపూర్వం నమ్మకంలోకి రాలేదు. అప్పుడు కూడ "కలడు

కలండనెడు వాడు కలడో లేడో'' అని గొడవపెట్టేశాడు, అప్పటికి బుద్ధిద్వారాకలిగిన అడ్డంకి కొద్దిగావదిలిందని అర్థం–అంతట–అస్థాయిలో శరీరం మనసూ బుద్ధీలు తత్ పదార్థంవైపునకు తెరుచుకొన్న త్రోవలో అడుగుపెట్టినవి. బుద్ధితీవ్రతద్వారా తత్ ను తెలిసికొంటున్నదోవఅది. ద్రౌపదికి ఈదోవ రెండు నిముషాల్లో దొరికింది–గజేంద్రుడికివేయేండ్లుపట్టినా! ఆ తేడా సంస్కారాన్ని బట్టిఉంటుంది.

17. వీళ్లుముగ్గురూ ఎప్పుడో ఒకప్పుడు ఈ స్థాయికి వచ్చేవారే. జ్ఞాని మాత్రం అలాకాదు. ఇతడికి – శారీరిక మానసిక ధీసంబంధమైన కారణాలేవీ అక్కర్లేదు–ఈ స్థితికి రావడానికి. అతడు ఎల్లప్పుడూనన్నుచూస్తూఉంటాడు. అది అలవాటు. 'నేను' సర్వత్ర అవుపడుతుంటాను అతడిజ్ఞాననేత్రానికి. ఇక నన్ను ఎలాభజించకుండా ఉండగలడు? అంటే అతడుఎల్లప్పుడూనన్ను 'తత్' ను అనుసంధానంచేస్తూ ఉంటాడు అనటం.

18. కాగా ఈ నలుగురిలో జ్ఞాని నా కత్యంతసన్నిహితుడు. తత్‌నకు సన్నిహితుడంటున్నాను. దూరం జరగడుకదా మరి. నిత్యయుక్తుడై ఏకభక్తితోనన్ను సేవిస్తాడు. 'నా' ప్రియుడు. శ్రేష్ఠుడైన ప్రియుడు వీరందరిలో శ్రేష్ఠుడెందుకనంటె, శరీర, మానస బుద్ధులను దాటి నన్ను చేరినవాడవటంచేత. అతడిబుద్ధి కార్యకారణాలనే జంజాటంలోపడి తత్ విషయం ప్రక్కకు నెట్టివేయదుగనక అతడు శ్రేష్ఠుడు. అలా అన్నానని మిగతావాళ్లు వ్యర్థులనికాదు. నరాధముల కంటె గొప్పవారె అదృష్ట్యా. కాని జ్ఞానియొక్క అనుభూతి, నిత్యానుభూతి వారికి లేదు. భగవదనుగ్రహం కలిగినప్పుడు సత్‌స్థితిని పొంద వలసినవారె. అందుకని వారికంటెజ్ఞానిగొప్పవాడు. వారికోసమె భగవచ్చింతనం నిరంతరం చేయుమనెసాధనం చెప్పడం. అప్పుడు వారు కూడ జ్ఞానులు జ్ఞానభక్తి కల్గవారు అవగలుగుతారు,

19. జ్ఞానికి ఆస్థితి బహుజన్మలుదాటిన మీదటగాని ప్రాప్త ముకాలేదు. అప్పటికిగాని సర్వమూ వాసుదేవ మయం అనీ ఈశావాస్యమనీ తెలియటం జరుగలేదు. అనేక స్థితులను దాటుకొంటూ ఈ స్థితికి వచ్చాడు.ఇది ఎంతో కష్టంకూడాను.

'బహు జన్మలు దాటిన మీదట' అంటే స్థూలశరీరం యొక్క పుట్టుకలు దాని చావులు సంగతినె శ్రీ కృష్ణుడు చెప్పాడనుకోవటంసరి కాదు. మూడు శరీరాలంటారు మనకు. స్థూల శరీరమే కాకుండా సూక్ష్మ శరీరం కారణ శరీరం కూడవున్నవట. జన్మలు మూడింటికీ ఉన్నాయి. చావులూ ఉన్నాయి. మనసులో మార్పువచ్చినప్పుడల్లామరొకజన్మె. బుద్ధిలో మార్పుకలిగినప్పుడల్లా అది మరోజన్మె ఆలాసూక్ష్మశరీరంలో ఉన్న మనోబుద్ధులమూలంగా సూక్ష్మ శరీరానికి లక్షజన్మలు రోజుకి, ఈ జన్మలుఅనేకస్థితులనుఅనుభూతులనుఅనొచ్చుతెచ్చిపెట్టివెళ్ళిపోతున్నాయి మానవుడికి.వీటిని దాటి జ్ఞాని స్థాయికి ఎక్కాలి అని శ్రీ కృష్ణుని ఆంతర్యం. గుళ్ళోనున్న విగ్రహం దేవుడంటే-అంతే-ఇంకేదీకాదనె అడుగు స్థాయిలోనే ఉంటక,అలాగే ప్రతి విగ్రహంలో, ప్రతిమూర్తిలో, ప్రతివ్యక్తికో ప్రతి వస్తువులోనూ ఉన్నది దేవుడనే స్థాయిని అనుభూతి చేయడానికి బహుజన్మలెత్తడమనె అర్థం. ఇలాపురోగమించాలి. అలాగాక నాయీ శరీరం ఒక్కటే దేవుడు. మిగతావాళ్ళంతా నాశరీరానికే ఆడుగులకుమడుగులొత్తాలి అనటంవల్లహిరణ్యకశిపుడిలా భస్మాసురుడిలా దోవతప్పి సంద్రంగా తిరిగి నశిస్తూ ఉండాల్సిందే. బుద్ధికి మాత్రం ఈ జ్ఞానవిషయం తెలిసిన హిరణ్యకశిపుడు కూడ తప్పుదారిపడిపోయినాడంటే ఇతర్ల విషయం ఒకలెక్కా?

నిచ్చెనసెక్కాలి.మెట్లను ఎక్కినట్లుగాఎక్కాలిశరీరస్థాయిలో. భగవాన్‌!నాయీ శరీరబాధనుపోగొట్టు అన్నవాడు, మానసికస్థాయిలో ధనానిభోగభాగ్యాలు ప్రసాదించు అన్నవాడు.బుద్ధిస్థాయిలో ఈకోరికల్ను

అంతమయేవికావు-నాకుమోక్షం (వీటినుంచి) ఈయవలసింది అన్న వాడు యోగాభ్యాసంచేసి, - సరియైనబుద్ధితో కర్తవ్యకర్మచేసి, అని అర్థం-భగవత్సాక్షాత్కారం పొందటం అనగా మోక్షకాంక్షకూడవద్దని జీవన్ముక్తుడు కావటమే మెట్లులనెక్కటం.

20. మొదటి మూడు రకాల భక్తులూ శారీరిక మానసిక ధీ సంబంధ కామాలు ప్రేరేపించడంతో వాటి నిష్కృతి కోసం భగవంతుడై ననన్ను సేవించటం అవుతున్నది. కానీ యథా తథంగా వీరు "నాకోసం"నన్ను తెలిసిభజించటల్లేదు.శరీరబాధనులేదామానసికవ్యధను మాత్రమే పోగొట్టుకోవాలని సంకుచితమైన శక్తినె"నా" నుండి ఆవాహనచేస్తున్నారు. ఉచ్చాటనంచేస్తున్నారు. మోక్షకా... లైనవారు కూడ తాముభగవంతుడికి వేరై దూరంగా ఉండి అతడి చేతులోంచి తమకేదో కొబ్బరిముక్కల ప్రసాదం అందుకొన్నట్లు అందుకోవాలని ఆరాటపడుతుంటారు. జ్ఞాని తానే నేనైనవాడు. సూటిగా నన్నుచేరినవాడు. ఇదీతేడా.

డొంక తిరుగుడు సేవలైన మొదటి మూటి విషయంకూడ త్రోసివేయవలసిందికాదు, కాని జ్ఞానియొక్క స్థితికి ఎక్కడానికి వీరు క్యూలో ఎక్కడో ఉన్నవారనాలి. వీళ్ళకువిసుగెత్తితపస్సంపన్నులయి కూడ భస్మాసురుడిలాగా క్యూ వదలి వెళ్ళిపోయి నరాధముల్లో కలిస్తే తప్ప ఎప్పుడో ఒకప్పుడు గమ్యాన్ని చేరగలిగినవారె.విసుగెత్తి అనడమెందుకంటె-శరీర బాధలకు వైద్యుడ్నో,మానసిక బాధలకు మద్యాది పానీయాలనో ఆశ్రయిస్తున్నమనలాటి మనుషులకు అన్నిత్రోవలూ మూసివేసి ఒకేదోవలో భగవంతుడిని ధ్యానంచేయటం, పరిసరాలు దాటి పయనించడంగదా! ఎప్పుడైనా బుద్ధిలో ఏదో జిజ్ఞాస బయలుదేరినా (మోక్షమంటే ఏమిటని) వెంటనెమర్చిపోయే మనకు, బుద్ధికి

తరణినిచ్చే జ్ఞానికావటమే వీలుమార్గం—అనిపిస్తుంది. అందుకే ఈ భగవద్గీతలోనిసాధనలుఆచరించాలని అను కొనడం—మనలాటివారు! ఈ మార్గం వల్ల మనబుద్ధే మనకు అడ్డురావటం మానివేస్తే, అప్పుడు భగవంతుడి పై ప్రేమతో భక్తి పెంపొందించి తరించవచ్చు.

21. ఇప్పుడొక సందేహంవచ్చే అవకాశం ఉంది. అందుకు సమాధానం శ్రీ కృష్ణుడు చెప్తున్నాడు. "అయితె వీరి విషయంలో భగవంతుడిపైన నీవేంచేస్తున్నావయ్యా!" అని అనబోతావుగాక. ఏం చేస్తానంటే— "ఏఏ భక్తుడు ఏఏదేవతామూర్తిని ఏఏ శక్తిని శ్రద్ధతో ఆరాధించడానికి ఆరంభిస్తాడో ఆయా భక్తుడికి ఆయా మూర్తులయందే శక్తులయందె అచలమైన భక్తిని కలుగ జేస్తూ ఉంటాను." అన్నాడు. ఇదేమిటి! వారు ప్రార్థించేది ఒకందుకయితె ఆ విషయం వదలి ఈ ప్రార్థించడంలో భక్తిని ఎక్కువ చేస్తానంటాడేమిటి! అనిపిస్తుంది. కాని "వాళ్ళధ్యేయం తమ శారీరిక మానసిక బాధలు తీరడమె కావచ్చు. కాని నా ఉద్యమమంటూ ఒకటున్నది కదా! అతడు పూర్ణ భక్తుడై సర్వత్రన్నున "న" న్ను దర్శించినిజాన్ని ఎరుగాలి. నీ మనసు ఎంత చాకచక్యంగా పరువెత్తుతోందోదానికి తగ్గట్టుగానీశరీరం ఉండాలని నీవనుకోవటల్లేదా? అలాగే నాభక్తులు నాకయిన పూర్ణ భక్తులుకావాలని నా ఊహ. అందుకని అతడు కోరిన కోరిక తీరడం ఎలాగున్నా భక్తివృద్ధిఆయేఅవకాశాలన్నీ మాత్ర నేనుచూస్తుంటాను. ఆ అవకాశాల్లో అతడికోరిక తీరటం కూడ ఒకటి కావచ్చు" అని చమత్కారంగా అన్నాడనిపిస్తుంది శ్రీ కృష్ణుడు. "మంచిజరగటం" అలాగు అనిచెప్పటానికి బదులు "నేనలా చేస్తాననటం" చమత్కారం.

22. నేను చేస్తున్న పనేమిటంటే — ఏ అధిదేవతను అతడు శ్రద్ధగా ఆరాధించాడో ఆయధి దేవత ద్వారానె — నేను ఎంత మేర అతడి కోరికలను సఫలం చేయదలచానో అంత మేర—ఫలాన్ని ప్రసాదిస్తూ ఉంటాను. నిజానికె ఎంత మేర ప్రసాదిస్తాడంటే అది సాధకుడి

శ్రద్ధా ప్రయత్నాలమీద ఆధారపడే ఉంటుంది గాక. అతడి శరీర మనో బుద్ధ్యహంకారాల ఏకాగ్రతపై ఆధారపడి ఉంటుంది. 'భగవంతుడు భగవంతు' డంటె ఎక్కడో పాడు పడిన దేవాలయాల్లో కూర్చొని అర్చకు డాలస్యంచేస్తే కోపం చేసేవాడనుకోరాదు. భగవంతుడికి కూడ భక్తుల నందరిని తరింప చెయ్యాలనే ఒక ఈహ ఉన్నదనుకొంటె ఎలా భగవంతుడు చేయాలను కొనేవాడో అలాగే జరుగుతుందని బోధ. అల్ప మేధస్కు లేమనుకొంటే ఏమిగాక! చీమల బారు నుంచి తప్పిపోయినచీమ ఎలామళ్ళి ఆబారుచేరుతుందో గమనిస్తూ కాలంగడుపుతాం ఒకొక్కప్పుడు. ఆచీమను తీసికొని పోయి ఆబారులో పెట్టకూడదా అలాచూస్తూ ఉండకపోతె అనే మాటకు అర్థమేమిటి!! భగవంతుడి ఈహకూడ అలాటిదె. ఆచీమలోని తనశక్తిని ప్రతిఫలింపచేసి ఆపని ఎలా అది చేస్తోందో చూడటమె జరిగేపని.

23. అధిదేవతలద్వారా ఇవ్వగలిగేఫలాలు చాల చిట్టి చిట్టివి. అంతమయి పోయేవి. కాని నన్నుతెలిసి భజించేవారు—జ్ఞానులు, జ్ఞానభక్తులు- అంతం లేని నన్నే గ్రహించిన వారై అలంకారికంగా చెప్పాలంటే జేబులో పెట్టుకొన గలిగే స్థితిని పొందవచ్చు. "న" న్నుతెలిసికొనటమంటె ఏమిటను కొన్నావు!యథార్థాన్నితెలిసికొనటమె. 'నిజం' తెలియకుండా ఎలా ఉంటుంది? దాని గమ్యంతెలియటమె.నన్ను తెలియటం. నేను తెలిసికోను అంటూ ఆవలిమొగం పెట్టిన వాడి విషయంవేరు. అందుకె భక్తినివృద్ధిచేసి దోవసరిచేసి చూపించటం.

చిత్రమైన విషయంఏమిటంటే—ఈ ప్రాపంచిక కర్మలలోనే విజయంకావాలనికోరినా భగవంతుని శక్తిని ఉచ్చాటనం చేయడంవల్ల ఆవిజయాలు లభిస్తవి. దానివల్ల శ్రద్ధ భక్తి మీదకు పోవాలి. అలా పోతే ఫరవాలేదు. అలాగాక ఆవిజయాల మీదకే పోతె తిరోగమనం అయిపోతుంది. ఆశ్రద్ధ భక్తిమీదనె కలిగితె సంపూర్ణంగా—అతడు జ్ఞాని—అనగా పూర్ణభక్తుడుకాగలడు—అనేది గమనీయం. అటుతిరగడం

ఆరంభించినాక ఆపై పే శ్రద్ధ వృద్ధిఅయిఐక్యత దొరికేఅవకాశంఉంది. భక్తి పెగాక. కేవలం ఫలితం అయిన విజయంపై ఆ శ్రద్ధమళ్ళితే గతి తిరోగతి అవుననిధ్వని.

24. అర్జునా! ఇదియథార్థం. నిజం.భగవంతుడైన "నేను" అక్షయమైనవాడిని. ఉత్కృష్టమైనవాడిని. పరమయినవాడిని. శ్రేష్ఠ మయినవాడిని. ఈభావాన్ని అవివేకులు తెలిసికోలేకుండా ఉన్నారు. పైగా వారేం చేస్తున్నారో చూశావా! "నేనే" నా పంచతన్మాత్రలతో వారి దేహాలుగా మనసులుగా అయి యుండంగా ఆమూర్తులనూ మన స్వమానమయిన అధిదేవతలనూచూచి భగవంతుడని భ్రమపడుతున్నారు. నేను. వారికి ప్రకాశం కావటల్లేదు. దానికి కారణం వారికీ నాకూ మధ్య యోగమాయ అనేది సమావృతమై ఉంది. దానిను చితెముల్చుకొని బయటకు రాలేకుండా ఉన్నారు వాళ్ళు. దాని నుండి తప్పించుకొని రావాల్సిన వాళ్లు వాళ్లు! వారిలో ఉన్న జ్ఞానం [అజ్ఞానం తత్ అయిననేనే] మరుగుపడి పోతోంది.వివేకం ఉండటల్లేదని ధ్వని. (ఈ వివేకం లేకనే భక్తి అనేది వ్యక్తిమనసులో నిలవటల్లేదు. వివేకం కలగడానికే వెనుకటి అధ్యాయాలూచెప్పడం అయింది.)

25. అందుచేత నా ప్రకాశం వారికి కనపడదు. సూర్యుడు ఒకచోట ఎండను ఇస్తూ ఇంకొకచోట నీడను ఇస్తూ ఎలా ఉంటాడో అలాగే ఉంటాను నేనున్నూ. నీడలోనున్నవాళ్ళకు సూర్యుడెలాగో పరంకావో, యోగమాయ పరివృతమయి యున్నందువల్ల, వాళ్ళకునేను గోచరం కావటల్లేదు. అందుకని వారికి అసలువిషయం తెలియటల్లేదు. వారిలాగా పుట్టటం అనేసంఘటన 'నా' కు లేదన్న సంగతి ఎరగలేక పోతున్నారు. నశించడమనేది 'నా' కు లేదన్న సంగతి వారికి నిశ్చయమయి తెలియటల్లేదు.

26. పుట్టిని, చావని, యోగమాయా పరివృతం అయి కనపడని యీస్థాణువు వంటి భగవంతుడేమిటి? కథేమిటి అని చుల్కన

చేయనక్కర్లేదు. నాకు ఈ విశ్వంలో జరుగుతున్న దంతా తెలుసు. జరిగి పోయిందంతా తెలుసు, అంతేకాదు. జరుగబోయేదంతా కూడ తెలుసు. నీకు తెలీదు. "అర్జునుడు" అనే గిరిగీసి దానిలో ఇరుక్కొని పోయిన నీకు తెలీదు. జ్ఞానులైన వారికి భక్తులకు కొంచరకు తెలుసు. మిగతా ఎవరికీతెలీదు. ఇంతమందికి తెలీయంది, 'నా' కుఎలాతెలిసిందంటావేమొ. "నేను" యథార్థమైనది కనుక.అంతా "నేనే" కనుక. అంతా "నా"కు తెలిసిందేకనుక. "నా"తో మాత్రమే నేనుతాదాత్మ్యం చెంది అంతా చూస్తున్నాను కనక. చుట్టూ ఎలాటి గిరిని గాని గీసి ఇరుక్కుపోలేదు కనక. గిరి గీసి కొంటే ఆ"నేను" అహం అయి పోతుంది. ఆ గిరిపోతెగాని నేనుతోతాదాత్మ్యం చెందటం జరగదు. అలాతాదాత్మ్యం చెందినక్షణాన అహం నశించిపోతుంది. ఉండేది—నేనే—పరుడను!

మరి జిజ్ఞాసువులకు"తత్"నుతెలిసికోవాలన్న తహతహ ఉంటున్నదిగదా! వాళ్ళకు దోవఏమిటి? కర్మయోగమన్నారు—భగవంతునియందే సర్వమూలగ్నంచేసి చూడమన్నారు. కాని భగవంతునే తెలిసికోలేకపోతున్నామె. లగ్నంచేసేదెలా మనసునువానిపై? పరిష్కారమేమిటి? అనే శంకలు కలుగుతయి.

27. శ్రీకృష్ణులు వీటికి సమాధానం చెప్తున్నారు—భారతా! మానవుడు పుట్టిన నాటి నుంచీ కూడ ఇచ్ఛాద్వేషాలతో ఉంటున్నాడు. వీటివల్ల ఇదిసుఖమనీ ఇది దుఃఖమనీ—ఆ భావాలలో మునిగి ఉండటం తటస్థిస్తున్నది. ఈవాసనలు ఈ ద్వేషాలు, ద్వంద్వ భావాలు, బుద్ధికి అడుగున నాటుకొనిపోయికలుపుమొక్కల్లావేచి మానవునిసమ్మోహపరుస్తున్నయి. ఇచ్ఛ,ద్వేషం, ఈసడింపు ప్రీతి ఇవన్నీ శరీరంతోపాటు పుట్టినవె. సూక్ష్మ శరీరంలో ఉంటూ ఉన్నవె. భగవంతుడిని సమగ్రంగా తెలిసికొనే అవకాశమేదీ? ఎల్లప్పుడూ సుఖమో దుఃఖమో ముంచుతూఉంటుంది, తటస్థసమయాలేకొద్ది. ఆసమయాల్లో కూడ భగవంతుడి

సంగతె జ్ఞాపకం వచ్చే అవకాశాలుండకపోవచ్చు. జ్ఞాపకం వచ్చినా వాస్తవ స్వరూపం గ్రహించగలిగే పరిస్థితిని తెలియ చెప్పేవారు తటస్థపడక పోవచ్చు. ఎదుట నున్న విగ్రహాన్నిచూసి అంత వరకే భగవంతుడను కొనటంతో సరిపోతున్నదాయె (అవిగ్రహానికి కనపడకుండా బీడీలుతాగచ్చు. తప్పుచేయచ్చునంటారు) ఏవస్తువునుచూచినా 'ఇది నాకెంత వరకుపయోగపడుతుంది' అనే యోచనతో తిలకించడమే గాని అదీభగవత్స్వరూపమేననే యోచన–భావన–కలిగినప్పుడుగదా సరియైనదోవలో మనసు మసలేది!

ఇది మనసు, బుద్ధిలు చేస్తున్నపొరపాటు. ఇచ్ఛాద్వేషాలను కలిగించుకొని వాటినె భగవంతుడనేమూలభావంమూసుకుపోయేటట్లు రుద్ధి,వాటినేస్థిరంచేసికొంటున్నారు అల్పులై. అది పాపమె అనాలి. అది అంతర్గతమైనపాపం. సూక్ష్మశరీరంతోమిశితమై ఉంటున్న పాపం. గిరి గీసికొన్న స్వార్థం కదా మరి.

28. ఈ పాపంపోయేదెలాగంటావేమొ. పుణ్యంచేయాలి. అంటె అర్థం స్వార్థకర్మగాకనిస్స్వార్థకర్మ చేయాలని అర్థం.కర్తవ్యమనే కర్మస్వార్థరహితమైనట్టి కర్మ చేయాలి. స్వధర్మకర్మ చేయాలి. స్వధర్మమంటె వ్యక్తిసమాజానికి చేయవలసిన సేవాకర్మ యేదో అది అని చెప్పటమయింది. ఈ ఇచ్ఛాద్వేషాల మృణ్మయ పీఠం హరించేందుకు కర్తవ్య కర్మను ఇచ్ఛాద్వేషాలతో నిమిత్తం లేకుండాచేస్తూ ఉండాలి. అలా చేస్తూవుంటే పాపం కడగబడి చిత్తశుద్ధి అవుతుంది. అంటే క్షణ క్షణానా నిష్కామత్వాన్ని అనుభూతి చేయటమె పాపాన్ని కడిగివేసేపుణ్యంచేయటమన్న మాట. ద్వంద్వాల నుంచి విముక్తి అప్పుడె. తానుచేసేపని తనకు సుఖదమైనా దుఃఖదమైనా అది ఇతర్ల కోసం తన కర్తవ్యమైనది గనుక దానిని చేస్తున్నప్పుడు సుఖదుఃఖాల తేడా మనసు నుంచి చెరిగి పోక ఏమవుతుంది?

అయితె మరి దానివల్ల కలిగె ఫలమేమిటి అంటావేమొ, భగవంతుడె ఏవస్తువుకోగాని భావంకోగాని నిబద్ధమై ఫలితం... వర్క

కాలాలలో భగవంతుని సేవించడమె ఫలితంవారు అప్పుడు "నన్ను" దృఢవ్రతులై భజిస్తారు. సరియైన దృష్టివారికి కలుగు తుందని ధ్వని. కనుక భక్తే ఫలితం! ఇంకేదీలేదు.

29. జరామరణాల నుంచి తప్పించు కొనేటట్లుగా సాధన చేయగలిగేవారు నన్ను ఎవరు ఆశ్రయిస్తారో వారు, వారు బ్రహ్మము, అధ్యాత్మము, కర్మ వీటిని గూర్చిన సర్వమూ తెలిసి కొనగలుగుతారు గదా. అందుకని ఆ సాధనువారు చేయగలుగుతారు.

ఈఎదుట ఉన్న దుర్యోధనాదులను, జరామరణాలనుంచి నీవేదో చేసి తప్పించెయ్యాలని కాదు చూడాల్సింది. ద్వంద్వాలను వదిలేశా మంటూ మంచీ చెడ్డలనూ మానాభిమానాలనూ వదిలేసే బద్ధుద్దాయీల సంగతి నీకక్కరలేదు. వీరు కేవలం శరీరంమవసులకోసం మాత్రమే బ్రతుకును లాగుతున్నవారు. వీరి విషయం లోకవిషయం. ఆధ్యాత్మి కమైనదేదీ వీరికి అక్కరలేదు. అధ్యాత్మ విషయం తెలిసికొని నీవు నీకు జరా మరణాలు లేవన్న సంగతి అనుభూతి చేయటం నీఆత్మో న్నతికి కర్తవ్యం.

ముదిమి చావులనుండి తప్పుకోడానికి పరమేశ్వరుడయిన నన్నే –తత్ పదార్థమునే–ఆశ్రయించి ఎవరు సాధనచేసారో వారు బ్రహ్మ ముఅధ్యాత్మ, కర్మలనుగూర్చి సమగ్రంగాతెలిసికొంటారు.–అన్నాడు శ్రీ కృష్ణుడు. జ్ఞేయము–అంటె తెలియబడేది–బ్రహ్మము. ఆత్మసం గతి అందులో మొదటి భాగం. దానికి కర్మ సాధనం. ఇవన్నీతెలిసి కొంటాడు సాధకుడు.

ఆత్మవిషయం రెండవ అధ్యాయంలోనూ, కర్మవిషయం మూడవ అధ్యాయంలోనూ, బ్రహ్మము విషయం ఐదవఅధ్యాయంలో నూ,చెప్పటం జరిగింది· అంతవరకూబుద్ధికి తెలియ జెప్పటమయింది. ఆపైన మనసునకూ శరీరానికి కావలసిన సాధన ఆరవ అధ్యాయంలో చెప్పడమయింది. ఇప్పుడీ అధ్యాయంలో భగవత్తత్వాన్ని మనోబుద్ధి శరీరాలకు ఇంకేటట్లుగా తెలియ చెప్పాలనె ప్రయత్నముంది. అను

భూతి కావాలన్నమాట. అది సంస్కారాన్ని బట్టి ఉంటుంది.ఆసంస్కారాన్ని విషయం మననం చేయటంద్వారా వృద్ధిచేసికొనవచ్చు.అంటె అర్థం అది అనుభవంచేస్తూ,తెలిసి, తర్కించి, ఆచరించాల్సిన విషయమన్నమాట.

కాగా ఒక ఊహ కలుగు తుంది. ఇచ్ఛాద్వేషాలనే ఈ పాపం, శరీరం పుట్టి నప్పటి నుంచి ఉంటున్నది గదా మనకు. క్రొత్తశరీరం పుట్టకముందె జాగ్రతపడినట్లయితె పాత శరీరంలో ఉండంగానే, పాప ప్రక్షాళనంచేసికొనే ఉపాయంలేదా? శరీరం చచ్చే సమయానికి ఈ యిచ్ఛాద్వేషాలనేద్వంద్వాలు పూర్తిగా వదిలేసి, సర్వసముడైన పరమేశ్వరుని గూర్చిన సమగ్రభావం తెచ్చుకొంటె అది చాలునా? అని పిస్తుంది.

30. "చాలు" నని శ్రీకృష్ణుడంటున్నాడు. "అభయమిచ్చినట్లు చెప్తున్నాడు. "ఎవరు నన్ను అధిభూత, అధిదైవ ఆధియజ్ఞముంతో సహా ఉపాసిస్తున్నారో—సమాహితచిత్తులై ఉపాసిస్తున్నారో వారు.వారి శరీరావసానకాలానకూడనన్ను విస్మరింపక తెలిసి ఉండటం సంభవమవుతుంది." అన్నాడు.

అధిభూత అధిదైవ ఆధియజ్ఞముల రూపంగా భగవంతుడు, సర్వత్ర ఎలా ఉంటున్నాడో తెలిసి, సమాహిత చిత్తతను పొందితే, అదే కావలసింది.

ప్రపంచంలోని ప్రతివస్తువూ, భావనా, కూడ ఆరుశీర్షికల క్రింద విభజించి దేనినిచూసినా ఈ ఆరింట్లోదేననేది మనసులో అనుసంధానంచేసి,ఈ ఆరూ అతత్ పదార్థమేనని గ్రహించేటట్లయితే, ఏది చూసినా తత్ అని గ్రహించటం,మరణకాలానకూడ జ్ఞాపకం ఉంటుందిట. ఆ ఆరుమాటలకు వివరణ ఏమిటని తరువాతి అధ్యాయంలో అర్జునుడు అడుగబోతాడు.

ఈ ఏడవ అధ్యాయంలో చెప్పిన విషయం మననం చేయాలంటే—మానవ సృష్టిరహస్యం చెప్పటానికి భగవంతుడు ఆరంభించా

డనిపిస్తుంది. సృష్టిఅంతా భగవంతునిలో నుంచి వచ్చింది. పైకికన పడేది అపరాప్రకృతి. జీవభాగం(ప్రాణంకాదు) పరాప్రకృతి. రెండూ కలిస్తె అది పూర్ణతత్వం. ఈఅపరా ప్రకృతిలో పరాప్రకృతి,చైతన్య రూపంగా ప్రవహిస్తూ ఉండటం అది పరమమైన విషయం, ఈ అపరా ప్రకృతిలో త్రిగుణాలున్నాయి. ఆవేయీ ప్రపంచపునడకకు కారణం. ఈ త్రిగుణాలులో ఉన్నపాళ్ళు మారు తుంటయి. మానవుడు కోరితె వాటి పాళ్ళలో మార్పులు తెచ్చుకోవచ్చు.

ఈ త్రిగుణాల సంయోగానికిపరాప్రకృతె కారణం.మానవుడిలో "నేను"గా నీటిలో రసంగా భగవంతుడు ఎక్కడపడితె అక్కడ(పరా ప్రకృతిగా) ప్రత్యక్షంకావటానికి సిద్ధంగా పూసల్లో దారంలాఉన్నాడు. అంటె భగవంతుడు, విశ్వము -జగత్తు-సమాజం-వ్యక్తి అతడిలోని జీవం-శరీర పదార్థం ఇలా అయి, తానె ఉద్భవించి వృద్ధిపొంది వికసి స్తున్నాడు. ఈ పదార్థాలు వస్తువులు మనుషులు తనకోసమేనని ఒక శరీరంతో తాదాత్మ్యం పొందినవ్యక్తి అనుకొంటే అది ఎంత అసం దర్భం!! తాను పుట్టాను అనుకొనే ముందు నుంచీవున్న వస్తువుల్ని చూచి"అవినావి" అనటం ఎంతహాస్యాస్పదం!భగవంతుడె తనకయిన కర్మను తాను ఇన్నిరూపాలద్వారా చేస్తుండగా అహంకారుడు తానూ భగవంతుడి అంశయేను అనే సంగతి మరిచిపోయి అవన్నీ గిరిగీచి కొన్ని తనపనులే ననుకోవటం ఎంత పొరపాటు! అజ్ఞానం!!

మరి ఈ వ్యతిరేకమయిన అభిప్రాయం ఈ అహంకారుడికి కలిగే కారణమేమిటి?-ఆకారణం బయటికీలోపలా-గోచరించే త్రిగుణా త్మక ప్రకృతె. ఈ భేదభావం దానివల్లనె. ఈశ్వరుడి పూర్ణ భావం యీ త్రిగుణాల వల్లనె శీర్ణాలు శీర్ణాలుగా చేయబడుతున్నది. ఏముక్క కాముక్క విడివిడిగా స్ఫురించి 'నేనింతవరకె'అనుకొంటున్నది. సము ద్రంలో ప్రతితరంగం ఇంకోతరంగం కంటె తాను గొప్పఅనుకొంటూ సముద్రం యొక్క ఔద్ధత్యాన్ని మర్చిపోతె ఎలాగో అలాగుంటున్నది

ఒక అహంకారుడు ఇంకో అహంకారునితో తన్నుపోల్చుకొనడమె సరిపోతుంటే భగవంతుని దర్శించే అవకాశమేది? యథార్థంగా భగవంతుడు ఈ అహంకారునితో సహా అన్నిచోట్లా నిండే ఉన్నాడు.

మరి యీ త్రిగుణాత్మక ప్రకృతినిమార్చటం ఎవరికీ చేతకాదా? ఒక్క భగవంతునకే చేతనవును. భగవంతుడంటే నాలుగునుంచి యేడు అధ్యాయాల్లో చెప్పినజ్ఞాన భావమె భగవంతుడు. అందుకే భక్తితో భగవంతుని ఉపాసించమనడం. ఆ భగవద్భావంఅనుసంధానంచేయమనటం. భగవంతుడు ఒక ప్రవాహంలో శరీరంలో—జడప్రకృతిలో సహా—ప్రవహిస్తున్నాడని తెలియమనడం. అలాచేస్తే మనసుతోపాటుశరీరం కూడ ఉత్తేజితమవుతుంది. బుద్ధికివ్యామోహంవిడిపోయిజ్ఞానం వెలుస్తుంది. అప్పుడు జరామరణాలు మానవుని బాధించవు. శరీరానికి అవి వచ్చినా రావచ్చుగాక. బాధించటం జరుగదు. ఆమాటకొస్తే అపరాప్రకృతి కూడ జ్ఞానం కారణంగా తన త్రిగుణాత్మక ప్రకృతిని కోల్పోయినట్లయితే—అసలు శరీరానికే ఆ జరామరణాలు రావేమొ. ఇంకా ఆంజనేయుడూ విభీషణుడూ ఉన్నారంటారు.

ఇంతకూ అధిభూత, అధిదైవ, అధియజ్ఞాలు ఆ భగవంతుడె. వాటినిగురించి ఎనిమిదవఅధ్యాయంలో చెప్పారు శ్రీకృష్ణులు.

ఇది ఎనిమిదవ అధ్యాయము

:——:——:



# శ్రీమద్భగవద్గీతా మననము



## ఎనిమిదవ అధ్యాయము — అక్షర పరబ్రహ్మయోగము

### పరబ్రహ్మ యీ విశ్వంగా ఎలా అయి ఉంటున్నాడు.

శ్రీ కృష్ణ భగవానులు బుద్ధియోగంతో ఆరంభించి ఇప్పటికి ఎన్నో సాధనలు చెప్పారు. [అ 2 శ్లో 49, 50; అ–3 శ్లో 19, 30 41, 43; అధ్యా 4 శ్లో 10, 11, 14, 18, 24; అ–5 శ్లో 10, 17 అ–6 శ్లో 5, 10 నుండి 32 వరకు; అ–7 శ్లో 14] ఇప్పుడు మరొక సాధన సూచించి [అ. 7. శ్లో 30] చెప్తున్నారు. అదేమిటంటె ఆరు పదాలున్నాయి. 1. బ్రహ్మ 2. అధ్యాత్మము 3. అధిదైవం 4. అధిభూతం 5. అధియజ్ఞం 6. కర అనేవి. వాటి అర్థమూ తత్త్వమూ అన్వయమూ గ్రహించటమనేది సాధన. అవి సాంఖ్య శాస్త్ర వివరణను తెలుపుతవి. వాటిని జీర్ణం చేసికొనటమె పరాకాష్ఠ. అలా చేస్తే చివరకు శరీరాన్ని వదలి వెళ్లె సమయాన కూడ పరమేశ్వర భావాన్ని వదలకుండా మనసులో నిలిపి ఉంచుకొనటం సులభం అని బోధ చేస్తున్నారు. (చూడు. అ. 7–శ్లో 30).

ఇంతకు పూర్వం చెప్పిన సాధనలు సాధారణ మానవుడు తన జీవిత చర్యను నడుపుకొంటూ ఒకానొక నియతితో బ్రతుకు నడుపుతూ పరమేశ్వర పరమైన ధ్యాస కలిగియుంటూ జ్ఞానం తెలిసికొంటూ మెట్టునెక్కడానికయిన పంథాలు. ఇప్పుడు చెప్పబోయేది ఆ జ్ఞానపూర్ణమైన విషయాలు. జ్ఞానం తెలియచెప్పడానికి భాషకావాలి. భాష నేర్వడమంటె ముందు పదాలు పదార్థం తెలియడం అవసరం. ఈ పరిభాష తెలిసి అవిపలుకుతూ ఈ సర్వప్రపంచాన్ని కూడ పరమేశ్వరుడే నని తెలియటం యీ అధ్యాయపు ఆశయం.

శ్లో 1_2, ఆ ఆరుపదాల అర్థమునూ చెప్పవలసిందని అర్జునుడు శ్రీ కృష్ణుని అడుగుతున్నాడు. అవసాన కాలంలో పరమేశ్వరుని జ్ఞాపకంలో ఉంచుకోవటం ఎలా అనికూడ అర్జునుడు ప్రశ్నించాడు.

అందుకు సమాధానంగా సర్వసృష్టి ఎలా అయిందో చెప్తూ శ్రీకృష్ణుడు సృష్టిమూలమైన విషయాలను అవగతం చేస్తున్నాడు.

3_4 అక్షరం బ్రహ్మపరమమ్.—ఈ సర్వ ప్రపంచమూ ఒకప్పుడు లయమైపోతే చూడటానికి వినడానికి స్పృశించడానికి, రుచి చూడడానికి వాసన చూడడానికి ఏదీ మిగలదుగాక. కాని బ్రహ్మమనేది మాత్రం క్షరం కాకుండా ఉంటూనే ఉంటుంది. దీనికి రూపం, శబ్దం, స్పర్శం, రసం, గంధం అనేవి ఉండవు. సత చిత్ ఆనందాలు మాత్రం ఆ అక్షరుని లక్షణాలై ఉన్నా, అవన్నీ ఏకమై ఉంటవి. ఆ స్థితి పరాత్పరస్థితి. ఇతడికి చైతన్యశక్తిఅయితె ఉంటున్నది గాని నిశ్చైతన్య స్థితిలో ఉంటున్నవాడవుతున్నాడు. ఇతడు బ్రహ్మము అంటె అతడి యందె తతః పూర్వమంటె ప్రపంచమంతా లయమైపోయిందనేది అనుసంధానంచేయాలి.

ఈ పరాత్పరుని నుంచే ఈ ప్రపంచమంతా ఎలాపుట్టిం, అనేదే జ్ఞానవిషయ మిప్పుడు. ఈ పరాత్పరుడె ముకుళించుకొని ఉండి ఉండి, వితతమయినాడు—వ్యాపించిన వాడయినాడు. ఈ సృష్టి అంతా తానే అయినాడు. ఎలా అయినాడంటె అతడి సత్ చిత్‌లు రెండై, ఒకటి రెండవ దానిలో ప్రతిఫలించింది. ఎవరు నేను అని మొదటిదైన సత్ (మేధ) అనుకొన్నది. నేను ఈ ఎదుట కన్పడే—అనుభూతి అయే—ప్రతిబింబమేను అనుకొన్నది. దీనితో ఆ సత్ పరిమితిని ఆపాదించు కొన్నవాడయినాడు. ఇప్పుడు రెండుగా అయిన బ్రహ్మము మూడుగా అయి ఊరుకొన్నాడు. పరాత్పరస్థితితో ఉంటూ తనలోని చిత్‌ను రెండవదిగా చేసికొని, తాను పరిమితివల్ల జీవుడై మూడవ వాడుగా

అయినాడు. ఈ పరిమితివల్ల పరిమితికి బయటనున్న దానిని తాను అనుకొంటున్న దానిని గమనించి అభిమానించడం ఆరంభించాడు. ఈ అభిమానం వల్ల శబ్దతన్మాత్రమనీ స్పర్శతన్మాత్రమనీ తేజోతన్మాత్రమని రసతన్మాత్రమనీ గంధతన్మాత్రమనీ ఈ భూతాలకు మూలమయిన తన్మాత్రలు ఆజీవుని ఆకర్షించినట్లు భావన అయింది. పరాత్పరుని చిత్ శక్తి ఆధారంగా జీవుడు భావించినట్లే శబ్దం స్పర్శం రూపం రసం గంధం ఇవి ఉద్భవించినట్లు జీవుడు అనుభూతి చేస్తుంటున్నాడు. కొంతకాలము అయేటప్పటికి—నిజానికి అప్పుడు కాలమనేది లేదు గాక—కాని ఈ అభిమానంస్థిరమైన క్షణాన పంచభూతాలు ఉన్నట్లు జీవుడు గమనించడం ఆరంభించాడు ఈ గమనింపు చేయటంలో తనకు శ్రోత్ర త్వక్ చక్షు జిహ్వాఘ్రాణాల ద్వారాచేసున్నట్లు అను కొంటున్నాడు. అంతె. ఇవన్నీ అలా అతడికి అనుభూతినిస్తూ ఉంటున్నాయి. కంటికి అవుపడటమేమిటి కాలికితగలటమేమిటి! ఇలా అనుభూతి అయిన వస్తువులన్నీనిజమైఉంటున్నవని మనసుతో అనుకొంటున్నాడు.

స్వప్నం కంటున్నాడు. అందులో పుత్రుల్ని మిత్రుల్ని శత్రుల్ని అనుభూతి చేసినట్లె. సృష్టిఅయే సమయంలో కూడ పరమేశ్వరుడు అలా అనుభూతి చేశాడు కూడ. పరాత్పరుడు నిశ్చైతన్య స్థితిలోనున్నవాడన్నాము గనుక. పరమేశ్వరుడు సమష్టి మనసు అని అనుకొంటె బాగా అర్థం అవడానికి అవకాశముంటుంది. ఇతడె మనం భగవంతుడని కొలిచేది. ఇతడికి కేవలం సత్ చిత్ లక్షణాలె ఉన్నవనటం కంటె—ఆలక్షణాలు పరాత్పరుని చెప్పేటప్పుడు చెప్పుకొని—పరమేశ్వరుని స్థితిలో చెప్పుకొనేటప్పుడు సత్త్వ రజస్తమోగుణాలుగా చెప్పటం అవసరం. ఆ స్థితిలో వాటికి.ఈ క్రింది స్థితిలో వీటికీ భేదం లేదుగాక.

ఈ సత్త్వ రజస్తమోగుణాలు ఆ సమష్టి మనసైన భగవంతుని స్థితిలో వాటి వాటి వికారాలతో సహా ఉన్నాడు అభిమాన కారణంగా

అనుభూతి చేస్తున్న పంచభూతాలుతో సహా ప్రకృతిఅయి వ్యక్తమవు తోంది. ఈ స్థితి అవ్యక్తస్థితి. ఆ సమష్టిమనసుకున్న సత్త్వంబుద్ధిగా నయింది జీవుడికి. చిత్ మనసయింది. ఆనందమె ఇంద్రియాలయింది. దాంతో జీవుడు తన పరిమితినె స్థిరం చేసికొని మిగతావన్ని తనకు వేరైనవని ఆలోచిస్తూ స్వప్నంలోనే తానుకూడ కల్పితుడై ఉన్న విషయాన్ని మరచి భ్రమతో స్వప్నంలో తాను వేరు ఇతర్లు వేరు అనుకొంటూన్నట్లె, నానా సుఖాలు, నానా దుఃఖాలూ, నానా అనుభవాలూ తన ఊహకు అందుతున్నవల్లా చూస్తూ అనుభూతిచేస్తూ ఉంటున్నాడు. ఇదీ ప్రపంచం. ఈ ప్రపంచానికీ ఆబ్రహ్మకూగల్ల సంబంధం ఇది. బ్రహ్మము అంటె అలా అర్థం చేసికొను. నీవే భగవంతుడై—నీవు కోరు— అదిజరుగుతుంది గాక. భగవంతుని ఇచ్ఛకువ్యతిరేకంగా మాత్రం నీఇచ్ఛ సంపూర్తికాదు.

బ్రహ్మంలో ఆత్మ అనాత్మ రెండూ ఉన్నయి. పరా ప్రకృతీ అపరాప్రకృతీ రెండూ ఉన్నయి. స్థితిమార్పు జీవుని బుద్ధి మనసూ ననుసరించిన్నీ సమష్టి మనసయిన భగవంతుడనబడే 'నియతి' వల్లనూ జరుగుతున్నది. భగవంతుడంటె ధర్మమేను, 'నియతి' యేను—అనేది అనుభూతిచేయ తగ్గది. ఆకాశం ఇలా ఆకాశంగానే ఉండటం— పంచ భూతాలూ అలాగే ఉంటూనే ఉండటం ఇదీ నియతి. ఈ నియతినిజీవుడు దాటలేడు తన ఊహ మాత్రంగా. దీనిని దాటాలంటె జీవుడు జీవునిస్థితిని వదలి సమష్టి మనసులో చేరి భగవంతుడు కావాలి. అంటే నియతికి పూర్వ స్థితిలో చేరాలి, అలాచేరిన వాళ్లే భగవంతునితోసమానులు. ఆపైన పరాత్పరస్థితి నందేటట్లయితె వాళ్లు ముక్తులు, జీవన్ముక్తులూ అవుతారు.

చనిపోతున్నవారి సంగతే మీరంటావేమొ. చనిపోతున్నది శరీరమె. శరీరం పోతె ఇంకా ఉంటున్నది సూక్ష్మశరీరం. దాన్ని అతివాహిక దేహమంటారు. ఆస్థితిలో పరమేశ్వరుడే అయిన జీవుని స్థితే

మిటంటే ఇష్టమైన అభిమానం, దాని వల్ల కలిగిన వాసనలు అజ్ఞానం ఇవి కూడుకొని ఉంటయి. ఈ వాసనల వల్ల అభిమానం వల్ల సమష్టి మనసయినట్టి, లేదా భగవంతుడైనట్టి నియతి వల్ల (లేదా ప్రకృతి వల్లనని క్రింది స్థాయిలో అనుకోవచ్చు) మరొక స్థూల శరీరం కలుగుతుంది. ఈస్థూలశరీరాన్ని జీవుడుఅభిమానంతో ప్రేమచేస్తూ ఉంటాడు. ఈప్రేమే ఆ వుని జీవం అని మనం అంటూ ఉంటాం.

ఏమవుతున్నాడీ జీవుడంటావేమొ. పితృడుగా పితృలోకంలో దేవతగా దేవలోకంలో ఉంటున్నాడు. వాసనలు నశించిన పక్షంలో సమష్టిమనసైన భగవంతుడుగా అవుతున్నాడు.

ఇది సాంఖ్య శాస్త్రం. ఇదంతా శ్రీ కృష్ణుడు తన అనుగ్రహం వల్ల అర్జునునకు స్ఫురింపజేస్తున్నాడు. ఈ ఆరు మాటల వివరణ ఊహంగా.

2. అధ్యాత్మమంటె పరాత్పరుడు, సమష్టిమనసు అంటే నియతిగానయి జీవుడుగా అనుభూతి చెంది ఉంటున్నా సత్స్థితిని అంటె ఎల్లప్పుడూ సత్యపదార్థమై ఉంటున్నట్టి పరాత్పర సంబంధాన్నిమాత్రం వదలటమనేది లేదు, ఇది ఆ పరాత్పరుని స్వభావము. ఆ స్వభావమె, పరాత్పరుడె యీ స్థితిలో ఆత్మ అని పిలువబడతాడు అధ్యాత్మ అని ఆ స్వభావాలయిన శ్రోత్రత్వక్ చక్షు జిహ్వాఘ్రాణాలను మనోబుద్ధి చిత్తాహంకారాలను వాక్పాణిపాద పాయూ పస్థలను అంటాము. అలాగే సర్వమూను. ఇవికలగటానికి కారణం అధిదైవాలూ అధిభూతాలున్నూ.

3. అధిదైవం:— సమష్టిమనసయిన భగవంతునికి కలిగిన తన్మాత్రల పైగల అభిమానంవల్ల భగవంతునిలో విడి విడి భాగాలుగా అవుపడే యీ ప్రకృతికి పైస్థాయిలో గల భావాలె, దేవతలు—దైవాలు, అధిదైవం అంటాము. ఆ అధిదైవమనె మంచి భావాల కారణంగానే శబ్దస్పర్శరూపరసగంధలు నియతిలో అవుపడుతున్నాయి.

4. అధిభూతం:— అలానియతిలోగల అధిదైవ భావంవల్ల పుట్టిన శబ్దస్పర్శరూప రస గంధాదులె అధిభూతాలు. ఈ అధిదైవాల వల్ల ఈ అధిభూతాల కారణంగా అధ్యాత్మలు కలుగుతున్నాయి. ఏమిటీ అధ్యాత్మలంటే? శ్రోత్రం, చక్షువు—ఇలాంటివన్నీ. ఏ అధ్యాత్మ ఏ అధిభూతం వల్ల ఏ అధిదైవం నుంచీ ఉద్భవించిందో చెప్తున్నారు.

| అధ్యాత్మ | అధిభూతం | అధిదైవం |
|---|---|---|
| శ్రోత్రము | శబ్దం | దిశలు |
| త్వక్కు | స్పర్శం | వాయువు |
| చక్షువు | రూపం | సూర్యుడు |
| జిహ్వ | రసం | జలం |
| ఆఘ్రాణం | గంధం | భూమి |
| మనసు | మంతవ్యం | చంద్రుడు |
| బుద్ధి | బోద్ధవ్యం | క్షేత్రజ్ఞుడు |
| అహం | అభిమానం | రుద్రుడు |
| చిత్తం | చైతన్యం | బ్రహ్మ |
| వాక్కు | వక్తవ్యం | అగ్ని |
| పాణి | కర్తవ్యం | ఇంద్రుడు |
| పాదం | గంతవ్యం | విష్ణు |
| పాయు | విసర్గం | మిత్రుడు |
| ఉపస్థ | ఆనందం | ప్రజాపతి |

5. అధియజ్ఞుడు:— ఈ అధియజ్ఞుడు నేను నేను అంటుండే వాడె. అంటే జీవుడా అని శంక. జీవుడేను అని తెలిసిం తరువాత అధియజ్ఞుడెవడంటె జీవుడేను అంటావుగాక. పరాత్పరుని స్థితివేరుగా పరమేశ్వర స్థితివేరుగా జీవుని స్థితివేరుగా అధియజ్ఞస్థితి వేరుగాచూడ

టం తెలిసివిశ్లేషించి చెప్పిన దాన్ని సమన్వయ పరచుకొనటం జ్ఞానం. అందాకానే ఈ పేర్ల విభాగం. ఆతరువాత శంకలురావు. ఈ నేను అనేది అహమా? నిజానికి సర్వముతానె—కాని ప్రపంచంలో మనం వినే "నేను"స్థూల శరీరంతో భ్రమపూర్వకంగాతాదాత్మ్యం చెందేనేను. ఒకానొక పరిమితితో ప్రపంచంలో ప్రవర్తిస్తున్న జీవస్వరూపమె నేను అదె అహం.

నేను అన్నప్పుడు జీవం, శరీరం. సంస్కృతి, వికారాలుసహా ఉద్దేశించి 'నేను' అంటున్నాము. నేనుతొడు క్కొన్నచొక్కా పట్టుకొంటే ఎవరన్నా—నన్నుపట్టు కొంటావేమి? అంటాము. చొక్కా కూడ నేను లోదె. ఛీ ఈ మురికి చొక్కావదలేస్తాను అన్నప్పుడు చొక్కావేరు నేను వేరు. తన చేయి చూపి ఈ చేయి నామాటవినటల్లేదంటాడు. తన చేయివేరూ తాను వేరూ అప్పుడు. ఈ చేయి వేరు—నేను వేరు అని తెలిసి కొన్నతరువాత కూడ చేతిని తట్టినవానితో నన్నెందుకు తట్టిపెల్చావు అనక తప్పదు. గిరి ఉన్నదని తెలిసి కూడ—శుద్ధుడై తాను ఉంటూ ఆత్మతోసమానుడై ఉండే "నేను" అధియజ్ఞుడని తెలిసికొ ఇతడుఈ జడ స్వరూపాలయిన బుద్ధిమనసు.ఇంద్రియాలకు పైస్థాయిలో ఉంటూసమష్టి మనసుకు తీసికొని పో గలిగిన ఒక శక్తివంటి వాడు. గురువు వంటి వాడనాలి. ఇతడినె శ్రీ కృష్ణుడు నాల్గొ అధ్యాయంలో తత్త్వదర్శిను డని, గురువని పేర్కొని, నీ అహంకారాన్ని ఈ గురువు ముందు ప్రణిపాతంచేయించి అనుభూతి చేయమని చెప్పాడు.కనక ఇతడె అధి యజ్ఞుడు. ఈ గురువుగాక యుద్ధారంభానికి పూర్వం ఇంకేగురువు దొరుకుతాడు: దొరికినా శ్రీ కృష్ణుని కంటె ఎక్కువ హృద్యమైన భాషలో తత్త్వబోధ చేయ కలడా? భాషలో చేప్పేగురువు కాదు అప్పుడు అర్జునునకు కావాల్సింది. అనుభూతి చేయించేగురువు.

ఇక శుద్ధాత్మకూ ఈ అధియజ్ఞుడికీ తేడా ఏమిటని శంక రావచ్చు. పరిస్థితి భేదమే తప్ప వేరు లేదు. ఆమాట కొస్తె అధి

భూతం. అధిదైవం అధ్యాత్మ కూడ బ్రహ్మమేకదా! ఈ స్థితిభేదాలు గమనించటం ద్వారా విజ్ఞానం పొందటమే ఇక్కడి లక్ష్యం. ఇన్ని రకాలయిన మాటలు చెప్పి భావాలు స్ఫురింపజేసి తెలియ చెప్పజూస్తున్నాడు దేవకీనందనుడు తనసఖుడైన అర్జునునకు. ఇన్నిచెప్పి ఆపైవాడు పరమాత్మ అనటం కంటే మరోమార్గంలేదు. ఎవరి సంస్కారాన్నిబట్టి వారి వారికైనవిధంగా ఎఱుకలోకి తెచ్చుకోవటమే సాధన. కేవలం శరీర సాధన చేసి ఊరుకొంటె కలిగే ఫలితం కాదిది. గీతాపారాయణం చేసినా విషయ విమర్శనం కూడ చేయాలనటం అందుకె.

బుద్ధిసాధన కావాలి. అహంలొంగ దీయబడాలి. బుద్ధి వికసించి ఆత్మలో తాదాత్మ్యంపొందాలి. అదియూ అధియజ్ఞునియొక్క—అంటే గురువుయొక్క అనుగ్రహంగా జరగాలి.

6. కర్మ:— "భూత భావోద్భవకరో విసర్గః కర్మ సంజ్ఞాతః" ఈ భూతాలు ఎలా ఉద్భవించాయో బ్రహ్మ సంగతి చెప్పినప్పుడు చెప్పారు. అలా తనె అన్నిగా వ్యాపించటంలోగల త్యాగమేదో అదె కర్మ అంటున్నాడు శ్రీకృష్ణ భగవానుడు. పువ్వుమారి కాయ అవుతోంది. తన వ్యక్తిత్వం త్యాగంచేసి, పువ్వుఅనేది కాయ కావటమనేది కర్మ. కాయ మారి మారి మళ్ళీ మట్టి అవుతోంది. క్షణక్షణాల యీత్యాగంనడుస్తూ ఉంటూ ఉండబట్టె ప్రపంచం నడుస్తూ ఉంటున్నది. లేకపోతె స్తంభించి ఊరుకోనుగాక. ఇదె సృష్టి. నెమ్మదిగానో అలస్యంగానో ఈ ప్రపంచ వస్తువులన్నీ మారిపోయేవె. ఈ ప్రపంచ కర్మను చేస్తున్నవాడు సమిష్టిమనసు అయిన పరమేశ్వరుడనేది ఇప్పటికి నీకు అర్థమయి ఉండాలి. కర్మ అంటే పరమేశ్వరుని కర్మ అనే అర్థం. మరి మనంచేసే పనులు కర్మలు కాదా? అనుచోకావు. అవి పరమేశ్వరుని కర్మలో అంతర్భాగాలే. అందుకని ముఖం కొట్టుకొని

'నాకర్మ' అన్నవాడు ఈ "నా" అనే అభిమానం వల్ల దుఃఖిస్తూ ఉంటున్నాడు-ఇది పరమేశ్వరుడి కర్మ అనుకున్నవాడు వచ్చినబాధను మర్చిపోకలుగుతున్నాడు. మనం ఏపనిచేస్తున్నా పరమేశ్వరుని కర్మగా నిశ్చయంచేసికోవలసిందని బోధఇది. ఆయన కర్మలో మనకు కేటాయించిన భాగాన్ని మనం ట్రస్టీలాగా చేస్తుండటమే కర్మ.పరమేశ్వరుని ఈ కర్మ "పరాత్పరుడు" చేస్తున్నదనిఅనక్కర్లేదు.ఎందుకంటె అతడి స్థితి నిశ్చైతన్య, నిర్గుణ, శుద్ధ బుద్ధస్థితికదా!

5 భగవానుడంటున్నాడు-ఎవడయితె అవసానకాలాన నన్నే స్మరిస్తూ దేహాన్ని వదలుతాడో అతడు నాస్థితిని పొందుతాడు. ఇందుకు సందేహంలేదు. ఈ భోగాత్మకమైన స్థూలశరీరాన్ని అంటే సుఖదుఃఖాలను అనుభవించడానికి ఏర్పడ్డ యీ స్థూల శరీరాన్ని వదలినట్లయితె అతడు నాలో ఐక్యమవుతాడు. స్థూలశరీరం పోయినా ఉంటాడు అని ఒకబోధ. మళ్ళీమరో స్థూల శరీరాన్ని ఏర్పాటు చేసికొనడనీ తనలో ఐక్యమవుతాడనీ రెండో బోధ.

శరీరాన్ని వదలటమంటే శరీరంలో తాదాత్మ్యతను వదలాలని అర్థం. జ్ఞానం'తెలిసింది' 'తెలిసింది' అనుకొన్న వాళ్లైతాను వేరని కళేబరం వేరని తెలిసినవాళ్లే వాసనలను పెంచుకొని మరొక శరీరం కోసం తపించటం వల్ల శరీరాన్నిత్యాగం చేసినారనటానికి వీల్లేదు. అలాంటి వారికి మళ్ళీ తమ వాసనకు తగిన శరీరమె వస్తుందిగాక.

కనుక, శరీరం అనే భోగ్యాధారమైన వస్తువుపై ప్రేమ, కాంక్ష లేదా వాసనపోవటం ముఖ్యం. అలాంటి వాసననశిస్తె అతడు ముక్తుడె. ఇంకాఅతడిశరీరం బ్రతికి ఉన్నదనుకొన్నా అతడు ముక్తుడై జీవన్ముక్తుడు; లేదా అది పడిపోయినట్లయితె అతడు విదేహముక్తుడు. క్షరమైనదేహం ఇక అతడికి రాదు.

మంగలి కత్తిరించే జుట్టు నాకక్కరలేనిది అని అను కొన్న వాడు జుట్టు తీసేయించుకోడానికి ఎలా బాధపడడో అలాగే ఈ తుచ్ఛమైన శరీరం నాకొద్దు అనిఅనుకొనే వాడికి తాదాత్మ్యాన్ని త్యజించటం కూడ బాధ అయినదికాదు. అలా తాదాత్మ్యత వదల కుండానే శరీర త్యాగం జరిగినా, తిరిగి వాసనలకు తగిన శరీరం పుట్టించుకొంటాడు మానవుడు లేదాజీవుడు అని బోధ. ఇందుకు తార్కాణంగా ఒక విషయం చెప్పవచ్చు. వాసనలయందు మక్కువతో కాంక్షలు పెంచుకొన్న వాళ్ల శరీరం కూడ ఈ జన్మలోనే ఎక్కువైన మార్పులకు లోనవటం మనకు తెలుస్తుంటుంది ఒకొక్కప్పుడు.

వాసనలు ఉద్ధృతంగాలేని చిన్నవయసులో శరీరం ఎంతోమృదువుగా సౌకుమార్యంగా ఆకర్షణీయంగా ఉంటున్నా, వానికి కాంక్షలు ఎక్కువౌతున్న కాలంలో మార్పులువచ్చి, ముఖం కర్కశంగా ఆకారం రాక్షసంగా తయారవటం సామాన్య విషయం. శిల్పిని మంచిభావాలు కలిగిన బొమ్మ గీయు మంటె, చక్కని కొలతలతో ముఖం అవయవాలు గీచి తయారు చేస్తాడు. ఒక దుర్మార్గుణ్ణి లేదా వాసనాప్లుతుడైన వానిని బొమ్మగీయాలంటే ఎన్నోకర్కశమైన గీతలు గీస్తాడు. అందు చేత బ్రతికినప్పుడూ చచ్చిన తరువాత వచ్చేశరీరమూ కూడ, సూక్ష్మ శరీరంలోనున్న కాంక్షలు భావాలు, వాసనలను బట్టి రూపొందుతుందని గ్రహించవచ్చు.

ఈ పైభావాన్ని స్పష్టంగా ఈ శ్లోకంలో చెప్తున్నారు. ఎవడేదే భావంతో ఉన్నవాడై శరీరాన్ని వదలివేస్తాడో అతడు ఆయా భావాల కనుగుణమైన ఉత్తర జన్మను మరణానంతరం—శరీర మరణానంతరం—పొందుతాడు అని అంటున్నారు. ఈ ఉత్తర జన్మ, స్థూలశరీరం మనసులో ఉంచుకొని మాత్రమె చెప్పిందికాదు. సూక్ష్మశరీర విషయం కూడ అంతె. వాసనలు సూక్ష్మ శరీరంలోనే ఉంటున్నవి అంటాం.

సూక్ష్మశరీరంలోఇంకా తన్మాత్రలు, వికారాలు కూడ ఉంటాయి. ఈ వికారాలయొక్క స్వభావం సత్త్వరజస్తమోగుణాల్లోఏదయినా కావచ్చు. అంటే ఆ మూడు ఉంటున్నా అందులోఏదోఒకటిప్రకోపించి ఉండవచ్చు నని అర్థం. మరి దాని స్వరూపమది.స్వరూపమంటె ఆకారమని కాదు. సంఘటనమనుకోవచ్చు. మరి యీ వికారసంఘటనలకు కారణమేమి టంటే జన్మలో తీరిన, తీరని, కోరికల, కాంక్షల, భావాల ఆశయాల అభిమానమయిన వాసనలె కారణం. ఈ అభిమానాల ఫలితమైనబీజమె ఈ స్థూల సూక్ష్మ శరీరాలకు కారణము. దానినె మనం కారణ శరీర మంటూఉంటాము.

ఈ వాసనల కనుగుణ్యంగానే తరువాతిజన్మ మనకొస్తుంది. భగవంతుడు మన్నూ నీళ్లు కుమ్మరిసారె పెట్టుకొని, ఇతడికి ఈ మనిషి శరీరంలేక ఆవు శరీరం లేదారాతిస్వరూపంఇవ్వాలని ఉత్తరువులు పాసు చేయడం అవసరం లేదనేది గమనీయం. మరయితే ఈ భగవంతుడు చేసేదేమిటి అంటావేమొ. నియతి ఒకానొక నియమం. ఆప్రకారమె యీ సృష్టి అవుతుండటం అదె భగవంతుడు. సమష్టిమనసు.

ఇదె సృష్టికీలకం. మన బుద్ధిని సరియైన మార్గంలో నడిపి మనకు మనసున్నూ, మనవికారాలను ఉద్ధరించటం వల్ల మన స్థూలసూక్ష్మ శరీరాలనె మనం అధిగమించి అంతర్దృష్టితోసమష్టిమనసైన భగవంతుని చేరడానికి పరిశ్రమిస్తున్నాము. దయమొదలైన మంచి గుణాలు పెంచుకొంటె ఈ శరీరాలు మంచి ఆదర్శవంతంగా వస్తాయి. లేకపోతె కర్కోటకంగా మారుతాయి. అలాగే భగవంతుని కూడ చేర్పటం విడదీయటంచేస్తాయి.

తమోగుణ ప్రధానుడె హాయిగా రాయిలా పడి ఉందామనె భావంతో — ఏ కోమాలోనో లేదా మత్తులోనో ఉన్నప్పుడనుకొందాం — అంటే అలాగే రాయిగా మరు జన్మలో పుట్టుతాడా అని శంక. కాదం

టాని కెలా వీలు? అహల్యవంటి శాపగ్రస్తులకు అప్పటికప్పుడా వాసన కలిగి శాపం అలా ఫలించలేదా?

ఆయ్యో! అయితే కఫవాత పైత్యాలు కసితో వచ్చిన క్షణంలో ఎలాటి భావాలు వస్తాయోనని భయం కలగటం తథ్యం. నీ ఇష్టం లేని భావాలురావుగదా! అందుకె మంచి భావాలనే నీకు ఇష్టమైన వానినిగా చేసికొని జీవిత మంతా మనవలసిందని బోధచేయటం!! వాటిని సంస్కరించి క్షణ క్షణాన మంచివైపునకు తీసికొని పోవటానికె బ్రతకాలని చెప్పటం మంచి బుద్ధిని సంతరించు మననటం.

శ్రీ కృష్ణుడు భగవంతునితో తాదాత్మ్యమైనవాడై తన వంటి మనః స్థితితో ఉండు మని కర్మయోగంలో చెప్పి ఉన్నాడు. అంటే "నమాం కర్మాణి లింపంతి నమేకర్మ ఫలేస్పృహా" ఇతి మాంయోఽభిజానాతి కర్మభిర్నస బధ్యతె. అలా అసక్తకర్మచేయాలి అనిబోధ. చిత్ శక్తి-సమష్టిమనసె భగవంతుడు. ఆయనతో తాదాత్మ్యమయినప్పుడు జీవునికున్న స్వార్థమైన లేదా పరిమితిగల మనః స్థితి ఉండదని తెలియాలి. అలాఉంటెముక్తిని పొందవచ్చు. ఇదీ సూత్రం.

7. అందుకని,-శ్రీకృష్ణభగవానుడు చెప్తున్నాడు, నాయనా! అన్ని సమయాల్లోనూ 'నాకు' చిత్ చైతన్యానికి అర్పితమైన మనసూ బుద్ధీలను కలిగి ఉండటం అభ్యాసంచేయి. అలా అవసాన కాలంలో కూడ (శరీర పతన మప్పుడని చెప్పటం) అత్యంత అనుసంధానస్థితిలో ఉంటె 'నా' లో చేరి పోవటం లేలిక. అమాట కొస్తె ఇప్పటికిప్పుడె – ఈ క్షణాన కూడ – అలా ఉంటే నా లో చేరిపోయినట్లె ఈ క్షణాన. నిజానికి అంతర్గతం చేయాల్సింది ఇప్పుడె. ముముక్షువులయినవారు ఆఉపాయంచేతనే భగవంతునెతలుచుకొంటూ కనీసం శరీర త్యాగ సమయాన్ని గడపాలని చూస్తారని అర్థం.

8. అలా అంత్యకాలాన ఈ విషయం జ్ఞాపకముంచుకొని అనుభవం చేయటానికి ఇప్పటి నుంచే ఎల్లప్పుడూ భగవదర్పితమైన

మనో బుద్ధుల్ని నిర్వహిస్తూ ఉండాలి. ఈ సుగమమార్గాన్నే భగవానుడు కార్యకారణసంబంధమైన ప్రవచనంలో పైనచెప్పాడు. ఇప్పటి నుండి అప్పటి వరకూ అభ్యాసం చేస్తూండటమే దానికి మందు అని అర్థం. ఈ అభ్యాసం ఎలా చేయాలో ఆరో అధ్యాయంలో చెప్పారు. "వాసుదేవమయ" మైన భావం చిత్ శక్తి నుండి సత్ శక్తి నుండి భగవంతుడు ప్రకృతి, తన మనసు తన బుద్ధి తన శరీరం సర్వమూ ఉదయించిన భావం జీవితంలో ప్రతిక్షణం అనుభవించేవరకూ ఆ అభ్యాసం చేయాలి.

రోజుకు మూడు సార్లు సంధ్యా వందనం చేయుమనీ గాయత్రిని అనుసంధానంచేయుమని చెప్పటం వేదస్తమనిపిస్తున్న మనకు ఈ పై వివరణం బుద్ధికి తెలిసిన క్షణానైనా — ఇన్నాళ్లు జరిగింది మన ప్రారబ్ధం అనిపించి వెంటనే ఆ ధ్యానాన్ని ఆరంభించటం జరిగిననాడు కృతకృత్యులవుతామనిపిస్తుంది. అదికూడ భగవంతుడికర్మేగా అని కొట్టి పారవేస్తే, ఇంత తెలిసిన జ్ఞానంకూడ వ్యర్థమై విజ్ఞానంగా తనకు పయోగించటం మానివేస్తుంది గాక. (గాయత్రీ మంత్రార్థం జ్ఞాన విషయమె.)

9–10 అంతిమకాలాన మననం చేయాల్సిం దేమిటంటే— ముందుగా భక్తియుక్తుడవుకావాలి. అంటే అంతర్దృష్టికలిగినవాడవై ఆ సమష్టిమనసును ప్రేమించి దరికి చేరడానికి ప్రయత్నించాలి. ఈ యోగబలంతోనేగాని బయటకు పరుగెత్తె మనసు నిలబడదుగాక. అప్పుడు గాలినిపీల్చి భ్రూమధ్యమంలో నిలిపి "నన్ను" తలవాలి.

ఎలాగంటె— కవిం = అంటే = అన్నీతెలిసిన సర్వజ్ఞునైన నన్ను సృష్టిని ఊహించిన స్థితిలోని వానిని; పురాణం = అనాది నుండి నాశం లేకుండా ఉంటున్నవానిని; అను శాసితారం = శాశించ కలిగిన వానిని; అతడి చిత్ శక్తే సృష్టిగా అవుతోందిగనక—అంటే—విశ్వాన్ని నియంతగా (నియతితో అని అర్థం) పాలింప గలిగిన భావం ఏదో

దానిని-అణోరణీయాంసమ్—సూక్ష్మాతి సూక్ష్మతరుని అచింత్యమైన ఆకారం కలిగినవాడిని; అసలు ఆకారమే లేని వాని ఆకారం ఎలా ఉంటుందో అది అను సంధానం చేయాలి. ఈ అనుసంధానంలో నీకై నీవు తప్ప మరోటి అవుపడని తెలుగుతుంది. అదె అచింత్యరూపం. అభ్యాసవశం చేత ఆసమష్టి చిత్ ఆ భాసుని ఎఱుగ వలసి ఉందని భావం.

ఏదో రూపంకన్పడితె. అది దేవుడనటం కాదని పిస్తుంది. అది అధ్యాత్మం, ఆదిభూతం, అధిదైవం, లలో ఏదో ఒకటి—ఒకస్థితి-కావచ్చు. అదిన్నీ బ్రహ్మము నుంచీ ఉద్భవించినదేనని అనుసంధానంచేయుటమె. అచింత్యరూపాన్ని ధ్యానించటం అనిపిస్తుంది.

సూర్య ప్రకాశం కలిగినవానిని జ్యోతిష్మంతుని, మోహాంధ కారాన్ని దాటింప జేయగలిగినట్టి. క్షేత్రజ్ఞ, అధియజ్ఞ, జీవాత్మ పర మాత్మగా అవుతున్న సమష్టి మనసును తలవాలి.

అలాతలుస్తూ శరీరంతో సంబంధం వదలినట్లయితె, అతదె లాంటి స్థితికి వెళ్తాడో చెప్తున్నారు.

11. వేదం తెలిసిన వాళ్లు అవినాశి అని దేనిని గూర్చిచెపుతున్నారో విషయాసక్తి శూన్యులూ యతులూ అయినవారు ఏపదవిని ప్రవేశింప గలుగుతున్నారో దేనిని ఇచ్ఛగించి బ్రహ్మచర్య వ్రతాన్ని నడుపుతారో అలాంటి పదంచేరగలుగుతారు.

12. ఇక ఏడవ ప్రశ్నకు సమాధానంగా చనిపోవడానికయిన ప్రకరణ మేదో అది చెప్తున్నారు. శరీరంలోని సర్వేంద్రియాలనూ సంయమనంచేసి, (6వ అధ్యాయంలో చెప్పినట్లుగా) మనసు హృదయంలో నిలిపి, ప్రాణాన్ని—గాలిని భ్రూమధ్యమంలో నిలిపి (కుంభకమన్నమాట) మనసూ బుద్ధీను ఏకంచేసి ఓం అనే అక్షరాన్ని (మానసికంగా) ఉచ్చరించాలి. అ, ఉ, మ లతో కలిసిన ఒకేశబ్ద

మది. అర్ధానుస్వారములో అంతమవుతుంది. ఈ అనుస్వారం పల కటం మానింతర్వాతకూడ వినపడుతుంటుంది. దానిని అనుసంధానం చేయాలి. శరీరం వదలినా ఆతివాహిక శరీరంతోతురీయమైన స్వరాన్ని వింటూనె ఉండగలిగే స్థితి అది. అప్పుడతడు ఉత్తమోత్తమమైన మోక్షం పొందుతాడు, శరీరం నశించినా పొందినవాడవుతాడునశించక పోయినా జీవన్ముక్తుడై మిగులుతాడని బోధ.

13-14 ఇది అభ్యాసం వల్ల సులభం కాదగిన ప్రక్రియేను. అలాటి తపసులు మహాత్ములు నన్నుచేరుతారు, వారు పునర్జన్మమనె దుఃఖాలయంలో మగ్గటం జరగదు. శరీర మనోబుద్ధుల మకిలలో మునుగడతడు. అతడి కంటువల్ల జన్మ అనీ మరణ మనీ ఉండదు.

15-16 అలాంటి మహాత్ములు తప్ప ఇక మిగతా ఎవరు గాని సృష్టి కర్తయైన బ్రహ్మతోసహా లోకంతోసహా అన్నీ—అందులోని వ్యక్తులందరూ మళ్ళీమళ్ళీ జన్మించాలనుకొంటూ సంసరణదోషాన్ని అనుభవించేవాళ్ళే.

17-19 బ్రహ్మగొప్ప వాడు కదా అనుకొంటున్నావేమో! అతడికి వేయియుగాలు ఒక పగలు నేయి యుగాలు ఒక రాత్రి, నూరేండ్లలా నిండితె అతడూ నశించేవాడే. అతడి పగటి కాలంలో భూతాలన్నీ కనపడుతూఉంటాయి. రాత్రి కాలంలో లయమై పోతూ ఉంటయి. పగలు రాగానే మళ్ళి ఉద్భవిస్తయి. మేము నశించం అనడానికీ మేము పుట్టము అనడానికీ వాటికి అవకాశం ఉండదు. అసలు పుట్టుక అనుకోనివారి సంగతిగదాయిది. వాసనల కారణంగా అనిపుట్టుతూనేఉంటయి. ప్రళయంలో నశిస్తవి.

20-21 అలాటి ప్రళయ సమయంలోకూడ వ్యక్తసమయంలోనూఅవ్యక్తసమయంలోనూ ఉంటుందే పరమేశ్వరుడు వసిస్తూనే ఉంటాడు. ఎల్లప్పుడూఉంటూనే ఉంటాడు. అతడే అక్షరుడు, పరమగతి అయినవాడు.

22 ఆ పరమ పురుషుని చేరటానికి ఒకే ఒక మార్గం. అదీ భక్తి. భక్తి వల్లనే అతడ్ని చేరగలుగుతారు. కర్మయోగంవల్ల చిత్త శుద్ధి మాత్రం కలిగితే, జ్ఞాన పూర్ణమైన భగవత్ప్రేమ వల్లనె భగవంతుని చేరటం గలుగుతుందనిబోధ ఆ జ్ఞానమేమిటంటే సాంఖ్య యోగపూర్వకమైన వాసుదేవ త్త్వ స్థితి అనే గమనీయం. భక్తికీ జ్ఞానానికీ ఇంతదగ్గర సంబంధమున్నది.

అలా పరమపురుషుని పొందిన పదము ఇంద్రియాగోచరము. వినాశరహితము. అది ఏదోచూపు మంటే చూపబడగలిగేదికాదు. ఈ జగత్తుస్వప్నంవంటిదని తెలిసిన క్షణాన ఆ జ్ఞానపూర్ణమైన స్థాయి కలుగుతుందిగాని అందాకా అది కలుగదు.

23–26 ఏకాలంలో మరణిస్తె తిరిగి జన్మించరో, ఎప్పుడుగతిస్తే తిరిగిలోకంలో పుట్టుతారో ఆకాలాన్ని గూర్చి చెప్పుదునా? ఒకమార్గం శుక్లమార్గమనీ, అగ్ని మార్గమనీ జ్యోతి మార్గమనీ ఉత్తరాయణ మార్గమనీ అంటారు. ఆ మార్గంలో ప్రయాణించేవాళ్ళు బ్రహ్మవిదులు. వాళ్లు తిరిగి పుట్టరు. రెండోది ధూమమార్గం, రాత్రి మార్గం దక్షిణాయనమార్గం. ఈ మార్గా ప్రయనించేయోగి తిరిగి జన్మించాల్సి ఉంటుంది. ఈ అర్థం తెలిసిన యోగి ఎప్పుడూ మోహంచెందని వాడై ఉంటాడు. అతడు అనన్యమైన భక్తితో ఉత్కృష్టమైన "వాసుదేవస్సర్వమితి" అనే జ్ఞానాన్ని ఎల్లప్పుడూ అనుసంధానంచేస్తూ ఉంటాడు.

28 సరియైన భావంతో నడుచుకొనేవ్యక్తి శుక్లమార్గంలో లేదా కాలంలో ఉంటున్నాడనీ; సరికాని భావాలతోఉండేవ్యక్తి కృష్ణమార్గంలో లేదా కాలంలో ఉంటున్నాడనీ తెలియటం అవసరం. ఈ చెప్పిన బుద్ధి యోగంలో జ్ఞాన పూర్వకమైన అంతర్దృష్టి అనె అనన్య భక్తి ఉన్నది. వేదాలు యజ్ఞాలుదానాలులో ఏపుణ్యం ఉందని శాస్త్రాలు చెపుతున్నాయో ఆఫలం కంటె ఎక్కువయిన ఫలాన్ని వ్యక్తి పొందుతాడు. ఎప్పుడంటే

ఈ అధ్యాయంలో ఇవ్వబడిన ఎనిమిది ప్రశ్నలకూ సమాధాన వివరం విశేషం గ్రహించిన మీదట ఆఫలితాన్ని పొందుతాడు. ఆ జగన్మూల భూతమూ శ్రేష్ఠమూ అయిన బ్రహ్మ పదాన్ని పొందగలడు.

ఈ అధ్యాయంలో విశ్లేషణాత్మకమైన సాంఖ్యయోగం వివరించారు. బాహ్యదృష్టినివదలి అంతర్దృష్టితో మనసు బుద్ధులద్వారా సమష్టి మనసు అయిన భగవంతుని తెలిసి ప్రేమించటం ద్వారా భక్తి చేసి పరమేశ్వరుని చేరటం అనే మార్గం సూచించారు. అంత్యకాలంలోనైనా ఈ విధంగా భావాన్ని పెట్టుకొన్నట్లయితే—ఇదేవాసనలకు ఫలితపూర్ణమైన వాసనగా ఉంటే—భగవంతునిలో ఐక్యం కావటం నిజమని శ్రీకృష్ణుడు నిరూపించి చెప్పాడు. అలా అంత్యకాలంలో అలాంటి వాసనను కలిగి ఉండటానికి జీవితమంతా ఆ చక్కని భావంతో మనటం అభ్యాసంచేయడమె మార్గం.

అలాచెప్పి శ్రీకృష్ణుడు "నీవు ఇక పురుషోత్తమస్థాయినుంచి జీవించటం ఆరంభించు" మంటాడనిపిస్తుంది. మృత్యు సమయంలోనైనాసరె ఆ స్థాయికి ఎలా వెళ్లాలో ముందు చెప్పేసి జీవించటానికి మార్గాన్నిదర్శింపచేశారు.

ఇది ఎనిమిదవ అధ్యాయం



# శ్రీమద్భగవద్గీతామననము

(తొమ్మిదవ అధ్యాయము)

రాజ విద్యా రాజగుహ్యయోగము.

భగవదనుభూతిని సర్వత్ర పొందే విధం అంతర్దృష్టితో విచారంచేయటమె

ఇంతవరకూ ఆత్మఅనాత్మల విషయమూ; పాపం అంటకుండా కర్మలు ఎలాచేయాలి అనేవిషయమూ, సర్వత్ర ఆత్మ ఉంటుంది అనీ, శరీర మనోబుద్ధులకు సహకరించేసాధనా, సర్వత్ర దర్శనమయే ఆత్మ అపరాప్రకృతి పరాప్రకృతిగా ఉన్నదనీ, విశ్వమంతా ఈశ్వర చిత్ సంకల్పం వల్లనె ఉద్భవించి, విలీనం అవుతున్నదనీ చెప్పారు. ఇంకా మృత్యువు నెలా ఆహ్వానించాలో, రాబోయే శరీర జన్మను ఎలా దిద్దుకోవచ్చునో ఇవన్నీ చెప్పారు.

ఈ జ్ఞానమంతా ఒకానొక పూర్వరంగం. అనుభవానికిగాను కావలసినట్టి పూర్వరంగం. చిత్రకారుడు ముందుగా క్యాన్‌వాస్ మీద తెల్లరంగు పూయటం వంటిది, ఈ జ్ఞానం మనసులో నిలిచి ఉండందే బ్రతుకులో అపూర్వమైన అనుభవాలను స్పృశింపలేము.

శ్లో 1. ఈ అధ్యాయంలో చెప్పేది అనుభవజ్ఞానం! అందుకనే గుహ్యతమ మైంది ఇది-అన్నారు. అంటే సునాయాసంగా లభించేది కాదని అర్థం. ఏం? చదివితె వింటె అర్థం కాదా? అనుకోవద్దు. పూర్వ రంగం అని చెప్పిన జ్ఞానం లేకపోతె ఈ అనుభవజ్ఞానం సమస్యలనే రేపుతుంది. భగవంతుడెవరో ఉన్నాడుట. అతడిని నమ్ముతున్నాం మూఢంగాను, అనేస్థితిరావచ్చు. ఆమూఢభక్తి అయినా వ్యక్తికిఎప్పుడూ నిలిస్తె ఫరవాలేదు. మూఢత్వం కాస్తతప్పుకొన్న క్షణాన సందేహాలు

వచ్చిపడుతవి. అందుకె ముందుగా మానసికంగానూ ధీయుతంగానూ శారీరికంగానూ జ్ఞానం తెలిసి ఆమీదట ఈ అనుభవజ్ఞానాన్ని పొందాలి. అది సాధన

2. ఇది రాజవిద్య. శ్రేష్ఠమైనది. పవిత్రమైనది. రహస్య. ఉత్తమమైనది. రహస్యమంటె మెట్టునెక్కితేగాని అటక ఎలా అందదో అలాంటిదని ధ్వని. ప్రత్యక్షావగమం, అంటె ఎవరో అనుభూతిచేసి చెప్పినందువల్ల అనుభూతి అయేది కాదన్నమాట. పైగా ఇది బ్రతుకు విషయికమైన అనుభవం. ఇంకొకరు అనుభవిస్తే తానుతృప్తిపడగలిగినట్టిదనలేము.

శ్రీ కృష్ణుడు చెప్పే యీ విజ్ఞానాన్ని బ్రతుకులో నడిపితె బ్రతు కష్టలునడిచే దెలాగ అని శంక చేయనక్కరలేదు. ఈ చెప్పేది—అసలు బ్రతుకుసంగతేను. ఇది ధర్మ్యం. అంటే ధర్మపూర్వకమయినది. సమాజంలోగల ధర్మప్రకారం ప్రవర్తించవలెననే చెప్పబోయేది కూడ. కర్తవ్యకర్మ చేస్తూనే ఈ చెప్పబోయే అనుభవంగడించాలి. ఇది సుఖకరమైనపని కూడాను. ఇది అవ్యయమైంది.—నాశములేనిదని అర్థం. ఫలాని కర్మ చేశాను అయిపోయింది అనటం కాదు. ఈ అనుభవాన్ని బ్రతికినంత కాలం, అన్ని కర్మల్లోనూ కలిపి పొందుతూ ఉండాలి. ఇది ప్రధానం!

3. ఇలా ప్రధానమని చెప్పినవిషయం మరచి ఈ ధర్మం అసలు మనసుకు పట్టించుకొనక అశ్రద్ధ చేసినవాడు దెబ్బతినిపోతాడు. ఎలా! ఎలాగంటె అతడికి సర్వజ్ఞుడూ సర్వేశ్వరుడూ సర్వాంతర్యామిఅయిన నన్నుపొందటం జరగదు. అంటే భగవంతుని ఎప్పుడో ఒకసారి అనుసంధానంచేసి, వదలివేసినట్లయితే మళ్ళీ అసంపూర్ణపు బ్రతుకె అతడికి తారసిల్లుతుంది అనిఅర్థం. మృత్యుసంసారమనె యంత్రంలో—తిరగలిలో గింజల్లా నలిగిపోవటం అవుతుంది. ఈ జ్ఞానవిజ్ఞానాలనుతెలిసి

అనుభవించేవాళ్లు తిరగలి మేకుచుట్టూ నిలిచినగింజల్లా సంసారచక్రంలో నలిగిపోకుండా ఉంటారు. అనుభవజ్ఞానం సంసార చక్రంలోని బాధను రానీయదని బోధ.

4. ఆ అనుభవం ఏమిటనేది అసలు విషయం. నేననేదే భగవంతుడనటం. ఈ సర్వజగత్తులోనూ నేనే అంతటావ్యాప్తమై ఉన్నాను. సర్వభూతాల్లూ నాయందే ఉంటున్నాయి అని ఇది నిరంతరం అనుభూతిచేయాలి. ఎలా? మనకు కనపడుతున్న ఈ ప్రపంచం అంతా మన సాధనకు ఉపయోగించటల్లేదు. ఈ జాగ్రతలోని ప్రపంచమే కాదు. స్వప్నంలో ఎన్నో ప్రపంచాలు చూస్తాం—అవీ ఉపయోగించటల్లేదు. స్వప్నం కంటున్నంతసేపూ అది నిజమేనని ఆరాటపడి పోతుంటాం. కాని అవన్నీ కేవలం మనసు ఒకానొకస్థితిలో ఊహిస్తున్న బొమ్మలు. స్వప్నంలో తన శరీరంకూడ ఉండటం చూస్తాడు. చూడటమేకాదు. దానితో తాదాత్మ్యం కూడ పొంది-పులివచ్చి పైన పడిందని భో భో మంటూ అరచి నిద్ర లేస్తాడు. అప్పుడది అబద్ధమని స్పష్టంగా తెలిసికొంటాడు. అలాగే ఇప్పుడీ కనపడే జాగ్రత్తులో కూడ తాను ఒకానొక-శరీరంతో తాదాత్మ్యం పొందుతున్నాడు- ప్రతి జీవుడున్నూ. అతడు ఎప్పుడో ఒకసారి ఇదంతా కూడ స్వప్నంలాంటి అబద్ధమేనని తెలిసి కొంటె ఈ జగత్తు, ఈ దృశ్యం అన్నీ కనపడవు, పోతవి. ఈ దృశ్యం పోవడ మెలాగనేదె సాధనచేయాల్సిన అవసరాన్ని కలిగిస్తోంది. జ్ఞానం తెలియడం అనుభూతి చేయడమె మార్గం. అంతర్దృష్టితో పయనించడమె దిక్కు.

ఈ కన్పడేదంతా నాసృష్టేను అని శ్రీ కృష్ణపరమాత్మబోధ చేశాడు. ఆదెలాగంటె పరాత్పరస్థితిలోనున్న వానికి సత్ చిత్ ఆనందాలు లక్షణాలు. చిత్ శక్తి కారణంగా మహత్ అనే అహంకారం ఉత్పన్నమయింది. దీనికి కూడ పరాత్పరునికి మల్లేనే శబ్దస్పర్శరూప రస గంధాలు వంటివిలేవు. ఆ అహంకారంలో బుద్ధికలిగింది. బుద్ధిలో శబ్ద తన్మాత్ర ఊహించబడింది, దానిన్నుంచి ఆకాశం వచ్చింది,

అలాగె స్పర్శతన్మాత్ర పుట్టి వాయువు పుట్టింది. పరమాత్మ ఈ తన్మాత్రలపై అభిమానం పెంచుకొని ఎక్కడికక్కడ తాను అనుకొంటూ, మిగతా "తాను" లతో వేఱనుకొంటూ అవ్యక్తస్థితిలో ఉండి అభిమానం పెంచుకొంటూ తనకు ఎక్కడి కక్కడ శబ్దాన్ని ప్రాణాన్ని సంతరించుకొన్నాడు. శబ్దం అంటె వేదం, ప్రాణం అంటె ఊపిరి. అలాగె రూపతన్మాత్ర, రసతన్మాత్ర, గంధ తన్మాత్రలు పుట్టి తద్ద్వారా అగ్ని జలం భూములు జనింపచేసికొన్నాడు. ఊహామాత్రమైన తన ఇచ్ఛవల్ల ఈ తన్మాత్రలతో ఈ భూతాలతో స్థూల దేహాన్ని సూక్ష్మ దేహాన్ని పొందినట్లు భ్రమించుతున్నాడు: ఇలా భ్రమించుతున్నది పరిమితిని ఆపాదించుకొన్న పరాత్పరుడె. అతడినిఇప్పుడుజీవుడు అంటాము. అందుకె ఈవిశ్వమంతా—తత్ అయిన 'నా' సృష్టేను అని ఇదివరకె నీబుద్ధికెక్కేటట్లుచెప్పాను-అంటున్నాడు భగవంతుడు. వ్యక్తమైన ఈ జగత్తు అవ్యక్త స్థితిలో ఉన్నప్పుడు కూడ అది నేనే. మట్టితో కుండ తయారయింది. దానికి రంగువేసి రంగుకుండ అంటూనే—అది మృణ్మయమైందనీ దేనికి తగిలినా పగిలి పోతుందనీ తెలిసి జాగ్రతతో మెలగమా? అలాగే ఈ ప్రపంచమనేది కూడ భగవంతుడినుంచి పుట్టిందేను, అనే అంతర్గతమైన భావంతో ఉదాత్తమైన భావంతో ప్రవర్తించవలెనని చెప్పటం.

5 అలా అని భగవంతుడంటూ ఒక బొమ్మను వేసి, ఇదేభగవంతుడని ఊరుకోమని కాదు. మనం అందుకోసం తయారుచేశాం కనక ఆవిగ్రహాన్ని భగవంతుడంటేసరిపోదు-మిగతావి కావన్నట్లుగా! దాని ప్రయోజనంభగవంతుడనేభావం మనసునకు రావటమె అవసరం. కనక తనవీలు ఏమిటి, తన ప్రయోజనమేమిటి అనే ప్రసక్తి వదలివేసి, దేనిని చూచినా-సర్వత్ర నన్నుమాట-భగవంతుడేనని ఎరుగవలెనన్న సూచనన్నేను కూడ ఆభగవంతుడేనని భావించి దానిని ప్రేమిం

చాలి. భగవంతుడనంగానే అంతర్దృష్టికలిగినవాడై పరాత్పరుని చిత్ శక్తిమీద మనసునిలపాలి.

ఈవస్తువులన్నిటినీచూస్తూ ఇవన్నీవస్తువులనీ వీటిలో ఎక్కడో భగవంతుడున్నాడనీ చూసై చాలదు. కలంలో సిరాలాగా భగవంతుడున్నాడనుకోవటం పొరపాటు. కలము సిరాకూడ నేనైన భగవంతుడే. అతడే యీ కలం యీ పాళీ యీసిరాలలాగా అయి అవుపిస్తున్నాడు. నేనే స్వప్నంలో ఎన్నో రూపాలై చూస్తున్నట్లు, అనేఅనుభవం రావాలి."పాళీయే భగవంతుడనటంకాదు.భగవంతుడే యీపాళీగా యీస్వామిగా ఉన్నాడ"నేఅనుభవంచెయ్యాలి నేను భగవంతుడనటం కంటె భగంతుడే ఈనేను అనే దృష్టికావాలి. నిజానికి చిత్ స్వరూపం తప్ప ఊహతప్ప—ఇంకేమున్నది? అంతర్దృష్టి ఇక్కడ ముఖ్యం.

నీ వ్రేలికి ఉంగరం ఉంది. దానిని ధరించింది ఎవరు? నీవా అవ్రేలా? వ్రేలుకాదు. నీవే. ఈ భేదం తెలిసి అనుభూతి చేయాలి. సర్వభూతాలూ నా స్వరూపాలే నేను అన్ని భూతాల స్వరూపమూ అనుకొంటే కాదు. భగవంతుడై — నన్నూ నువ్వుచూడాల్సింది సర్వత్ర! నాతత్వాన్ని అలా ఎరుగవలెనని అర్థం. నన్నువదలి యీ భూతాలతో వ్యవహరించి ఊరుకొనటం లాంటిదో చెప్పుదునా? పిచ్చివాడు ప్రక్కనున్న వాడి వీపుతో మాట్లాడుతున్నట్లై. నిజంగా మీ ఎదుట నుంటుందేవాడివి నేనై యుండగా నాలో కుడి ఎడమ అనే భాగాలు విడదీసి, కుడి భాగంతోనో ఎడమ భాగంతోనో మాట్లాడినట్లు మానవులతో వ్యవహరించి ఉరుకొనటం పెద్ద మోహంలో పడిపోయి ఉండటమే అవుతోంది. అందుకే మీరు ఒకరినొకరు ద్వేషించు కొనటం.నిజానికి మీ అందరూ కూడ నేనే. మీకు ప్రత్యేక ప్రతిపత్తి అక్కరనే లేదు. నాతోతాదాత్మ్యంపొందితేచాలు ప్రపంచవ్యవహారంకోసమే తప్ప. అంటేకర్తవ్య కర్మలను చేయడానికి మాత్రమేతప్ప!! వ్యవహారత

కోసం ప్రత్యేకవ్యక్తిత్వం ఆభాసచేసికొన్నా అది మోహంఅయి నిన్నే పీడించి దుఃఖిని చేయకుండా ఉండాలి. తత్ భావననెరిగి నన్ను దర్శించటం మానరాదనిబోధ.

6. ఆకాశం వాయువూ రెండూ ఎల్లెడలా ఏలావ్యాపించి ఉన్నాయో. అలానేనూ—ఈ జగత్తుగా కనిపించేదీకాద—ఒకేఒకటిగా అయిఎల్లెడలా ప్రవహించుతున్నాం. నీలో, నీ శరీరంలో పరాప్రకృతిగా జీవంగా ప్రవహించుతున్నది నేనేనని చెప్పాను జ్ఞాపకంతెచ్చుకొను.

"నీవె ఇలా ఇన్నిరకాలుగా అపుపడుతున్నావుగాక. అలాగే వీటన్నిటినీ ప్రత్యేక ప్రత్యేకాలుగా భావించి వ్యవహరిస్తాను ఏమవుతుంది" అనుకొంటున్నావేమొ! ఈ ప్రత్యేకంగా కనపడటం నీవు కర్తవ్యకర్మను చేయటానికి వీలుగా మాత్రమే! కర్తవ్య కర్మ అయిపోయిన తరువాత ఇంకా ఆ రూపాన్నే ప్రధానంచేసి, ప్రవర్తించటం తెలివి తక్కువ. ఎదుటివస్తువును—మనిషిని—చూడు. అది అతడు భగవంతుదేను అతడి అంశేను అని గ్రహించు. ఆ వస్తువుతో ఆమనిషితో కర్తవ్య కర్మకుగాను వ్యవహరించు; భగవత్పరమైన కర్మ అవుతుంది అప్పుడది. కేవలంవ్యవహారమెజరిపితె నీకు ఆత్మోన్నతికలిగే అవకాశంలేదు. కేవలం—భగవంతుడని తెలిసి వ్యవహారం చేయకపోతె కర్తవ్యకర్మను చేసినవాడవుకావు. భగవంతుడనె ఈ దృష్టి ఎప్పుడన్నా తప్పుకొంటె కర్తవ్య కర్మ చేయనివాడ వవుతావు. అందువల్ల చిత్తశుద్ధి లేనివాడవుతావుగదా!

కనుకఏవస్తువును చూచినా ఈ భగవదంశ అని గుర్తించాలి. చిత్ శక్తే (సమష్టిమనసే) ఇలా ప్రతి వస్తువుగా మారింది కదా. అది జ్ఞానం. అప్పుడు ఆ వస్తువుతో వ్యవహరించాలి. అది కర్మ. ఈ రెంటికీ సంబంధం ఉంటుంది అప్పుడు అదె ప్రపత్తి. ఇవన్నీ కలిసి బ్రతుకు. బ్రతక వలసిన తీరుగల బ్రతుకు. రూపాల మధ్య బ్రతక వలసినతీరు అది.

7 ఈ రూపాలు కల్పక్షయం వరకేననిఅన్నావని ఈ కాసిని సంవత్సరాలు పోనీ వ్యవహారమె చూసుకొని ఊరుకొందాం ఆతరువాత ఏలాగా అవ్యక్త పరబ్రహ్మమే కదా అనుకొంటావేమొ. కాని అవ్యక్తంలో ఉన్నంతసేపూ కూడ కారణ శరీరం కుంచించుకొని అలానె ఉండి పోతుంది. మళ్లీ ఎప్పుడయితె నేను ప్రకృతిని వదిలానో తిరిగి నీచుట్టూ క్రొత్త శరీరం అల్లి వేస్తుంది. మళ్ళీ అబద్ధపు బ్రతుకు మొదలు. కనక ఇక నీకు పరమమైన సుఖం లభించే అవకాశమే ఉండదు. ఈ లంపటాన్ని వదిలించుకోవాలంటె నన్నె ప్రధానంచేసి బ్రతికె అలవాటు నీవు చేయాలి.

8 అయితె ఈ రూపాలనెందుకు సృష్టిస్తావయ్యా! ఈ అహంకారాన్నెందుకు పుట్టిస్తావయ్యా నాశనంచెయ్యరాదా అనబోతావు. ఆ ప్రశ్నకు సమాధానం నీవు నాలో పూర్తిగా ఐక్యమయినప్పుడు ఇద్దరం ఒకరమై విచారణ చేద్దాం. ఇప్పుడది ఫలానా అని నేను చెప్పినా నీకు తెలియని పరిస్థితి, తెలిసినా మరొక్షణాన నమ్మకపొయేస్థితి, కనుక నాస్వభావమె అందుకు కారణం అన్నట్లయితె నీకేంతెలుస్తుంది? అసంగుడవై కర్తవ్యకర్మ చేయుమని నిన్ను నేనంటున్నానంటే నేనుకూడ నా కర్మలలో ఆధర్మాన్ని పాటిస్తూనే ఉన్నానని తెలుసుకో, తిరిగి సృష్టి చేసేటప్పుడు క్రిందటసారి ఇలా చేసేశానుగనక ఇప్పుడు అలా చేస్తాను అనే నియంత్ర దృష్టితో చేయనుగాక, ఆయా భూతాల కారణ ప్రకృతి ననుసరించి సూక్ష్మ స్థూల శరీరాలను అపరాప్రకృతిద్వారా ఇప్పిస్తాను. ఇంతకూ ఒకసారి సృష్టించిం తరువాత నాస్వంత ఆలోచనలు మీపై రుద్దటం లేదని నావాదం. ఈ కారణ శరీరాల ప్రకారం సృష్టి చేయటం ఎప్పైతె ఉందో అదే స్వభావం అంటున్నాను. నీవు అర్థం చేసికొను. ఇన్ని రూపాలుగా ఉద్భవించడానికి సూత్రధారుడిని మాత్రమేనేను. మీ మీనటనంతా మీమీచాతుర్యమే. మీ మీవికారాలే, జాగ్రతాజాగ్రతల ఫలాలే.

9 కనక నేనెప్పుడు ఎలా సృష్టిచేశానోననే శంకను వదలి, నీవు ఉన్న యథాతథమైనస్థితి నుండి ఉద్ధరింపబడటమెలాగో అదిచూసుకొను. నేనెలాటి ప్రమేయంలేకుండా ఉంటూ ఉంటాను కదా! అలాగే మీరూ అసక్తతతో ఉండాలి అనిధ్వని.

10 నేను చేసేకర్మలు నన్ను బంధించవు. ఎందుకనంటావేమొ. నేను అధ్యక్షునిలా తటస్థుడనై కూర్చుంటాను, వట్టిసాక్షిగా ఉంటాను. ప్రకృతె నా అధ్యక్షతక్రింద సకలచరాచరాలనూ సృష్టిస్తూ ఉంటుంది. పప్రికృతి త్రిగుణాత్మకము. మరి అది సృష్టించిన ఈ జగత్తు వివిధ రూపాల్లో పరివర్తన చెందుతూ ఉంటోంది అంటే ఆశ్చర్యమేముంది?

11–12 అర్జునా! నేను సర్వత్ర ఉన్నానని మూఢులు గమనించరు. రూపానికి ఒక్కదానికే ప్రాధాన్యత నిస్తారు. నన్నుచూపి తగిన విధంగా మెసలక రూపంచూసి, ఆరూపాన్ని వ్యక్తిత్వంగల దాన్నిగాచేసి, దానితో వ్యవహరిస్తూ ఉంటారు. తనువు నాశ్రయించి వ్యవహరిస్తారు. పరుడైన నన్నుతెలియలేరు. ఆవిధంగా ప్రవర్తించుట చేత వారు సతతం నన్ను అవమానిస్తూనె ఉంటారని తెలిసికొ. నేను భూతమహేశ్వరుడననీ ఏభూతంలో ఉండినవాడినేననీ ఈ పరాత్పరమైన భావం వదలి రూపప్రధానంగా వ్యవహరించటంనన్ను అవమత నొందింపజేయటమె.

అప్పుడేమయి పోతుందో తెలుసునా? అసలైంది వదలి కొసమాత్రం పట్టుకొన్నట్లు వ్యర్థమైన పనులేచేస్తూ ఉంటున్నారు. వ్యర్థమైన ఆశ పెట్టుకొన్నవాళ్ళవుతున్నారు. ఫలానిధనంకావాలనుకొని తపస్సుచేసి ఎవరోజ్యోతిష్కుడు మేనమామచెవులో బొచ్చుంటె ధనయోగమన్నాడని, మేనమామచెవిలో బొచ్చు ప్రసాదించుమని వరమడిగాడట! ఇలాటి వ్యర్థపుటాశలు వ్యర్థకర్మలు వ్యర్థజ్ఞానాలకు వెలనిస్తూ బుద్ధిలేనివాళ్ళయి విచేతసు లనిపించు కొంటారు. రాక్షస ప్రకృతినీ, ఆసురీ ప్రకృతినీ వృద్ధిచేసికొని, మోహంలో భ్రమలోపడి మునిగి పోతారు. వీరిని

మూఢులనచ్చు. అమాయకులని మీరనచ్చుబహుశ. అలాగే కానీ—అభ్యంతరంలేదు. విషయం గ్రహించు. చాలు.

ఇప్పుడు ఇక్కడ స్వార్థంకోసం మనంచేసే పనులన్నీ వ్యర్థమైనవని ఎందు కంటున్నాడు శ్రీ కృష్ణడనే శంకరావచ్చు. పరాత్పరుని చిత్ శక్తి (Total mind అదె భగవంతుడు) నిసేవించి ప్రపంచ సృష్టినెఱిగి తిరిగి ఆభగవంతునిద్వారా పరాత్పర స్థితిని పొందాల్సిన ఘనకార్యం చేయాల్సిన కర్తవ్యం ఉండగా— అంతర్దృష్టిని వహింపక బాహిరమైన మనోబుద్ధులతో బాహిరమైన కోరికలను పూరింపజేసికొనడానికి ప్రయత్నించుటం వ్యర్థంకదా!

13. మహాత్ములు సాత్వికస్వభావాన్ని ఆశ్రయించి అనన్యమనస్కులై, ఈ భూతాలకు కారణమూ, అవినాశియైన నేను సర్వత్ర ఉండటం ఎరిగినవారై భజించుతూ ఉంటారు. వారు ఎల్లప్పుడూనన్ను కీర్తిస్తూ, సడలనినిష్ఠతో ప్రయత్నశీలురై పరమప్రీతితో భగవంతుడైన నాకు నమస్కరిస్తూ, సర్వదా సమాహితచిత్తులై నన్ను ఉపాసిస్తారు. ఇదంతా వారు వారి మనసులను ఉంచుకొంటుండే పరిస్థితి,వారిశరీరాలు ఆస్థితికి తగ్గట్టు నడచుకొంటూ ఉంటవి.

ప్రాపంచక బ్రతుకు బ్రతుకుతూనే నిన్ను ఉపాసించడం ఎలా అనచ్చు. మహాత్మానులు ఎలాచింతిస్తారంటే—నేను ఈ కుర్చీమీద కూర్చున్నాను, అనే భావనకుబదులు, భగవత్స్వరూపమైన యీకుర్చీ యీశరీరమనేదానికి ఆధారమైంది, ఈ శరీరమనే భగవత్స్వరూపం నేననే ఆత్మకు నిధానమైంది. ఈ నేనూ పరమేశ్వరుడే (చిత్తే). ఈ శరీరానికి తగిలే యీగాలి—నేను పీల్చేయీగాలి, నాముందు వెనకపైన ప్రక్కన ఉన్నవాతావరణం అంతా భగవంతుడే—చిత్-శక్తే. నాలోని పరమాత్మ అయిన అహం (దాని నుంచి వచ్చిందే. అందుకని అది) ఆయనకు ప్రణామం చేస్తున్నది. ఇలా భగవంతుడూ, పరిమితుడైన తనూ, ఈ రెండే ఉన్నాయి. ఇంకేదీలేదన్న అనుభూతి చేస్తాడు. అలా ఆరంభించటం తేలికనిపిస్తుంది.

14. ఇక సర్వప్రపంచాన్ని భగవంతుడని అనుభూతిచేస్తూ, తాను ప్రణిపాతంచేయాలి ఆ భగవంతునికి. ఇదే బ్రతుకు. అనన్యమనస్కుడై అని అనటంలో అర్థం అదే యోగాభ్యాసంచేసేటప్పుడు తన అహాన్నికూడా- (ఇంద్రియ విషయాలను జయించిన ఆత్మను అహం అనక, ప్రత్యగాత్మ అనటం సబబు)-ఆ ప్రత్యగాత్మను కూడా భగవంతుడుగానే అనుభూతిచేయటంఅభ్యాసంచేయాలిగాక. ఆమెట్టునెక్కితే అది అద్వైతానుభూతి. మెట్టునెక్కే ప్రయత్నమే ఆయోగాభ్యాసం. ప్రణిపాతంచేసేది అహం. చేయబడేది (చిత్ స్వరూపం) భగవంతుడు. అహంభృత్యుడు భగవంతుడు యజమాని. ప్రపంచంలో అహం ఈ భావనతో మనవలెనని బోధ.

ఎదుటివారితో మాట్లాడుతూ ఉంటాడు. అతడు భగవంతుడై వచ్చి తనతో ఆరూపంలో మాట్లాడుతున్నాడని భావించాలి. దాని అర్థం అతడు మాట్లాడే అసందర్భాలన్నీ పాలించుమనికాదు. భగవంతుడు ఈ ఉపాధిలో ఉండి ఇలా ప్రవర్తిస్తున్నాడు అనే జ్ఞానాన్ని అనుసంధానం చేయాలి. అదీకోరదగింది. ఇక్కడ ప్రపంచవిషయాల్లో ఎలా ప్రవర్తించాలి అనేసంగతికాదు చెపుతున్నది. ప్రపంచంలో చేయవలసినకర్తవ్యకర్మను సరిగాచేస్తూనే పైచెప్పిన భగవదనుభూతిని అలానిర్వహిస్తూ ఉండాలి. బ్రతుకు అలా తిన్నగా నడపటమే ప్రధానం. కర్తవ్యకర్మ అంటే, ఏది విధిగా తాను తన పరిస్థితుల్లో చేయవలసిఉన్నదో అది.

అయితే కర్తవ్యకర్మ, ప్రపంచ విషయంపై అనుభూతి, అధ్యాత్మవిషయం అయింది. కనక బ్లాక్ మార్కెట్ నడుపుతూనే భగవదనుభూతి పొందవచ్చునా అని శంక. బ్లాక్ మార్కెట్ చేయటం కర్తవ్యమైనట్లయితే అలాచేసినా తప్పులేదని చెప్పవలసి ఉండేది. కాని బ్లాక్ మార్కెట్ చేయటం కర్తవ్యమెలా అవుతుంది? పరపీడనంద్వారా స్వార్థానికి ఉపయోగించాలని చేసేది కేవలం పాపకార్యం కదా! కర్తవ్యం అయ్యే అవకాశమేలేదు. కర్తవ్యం కామసంకల్పవర్జితమై ఉండే

టటువంటిది మాత్రమే. భగవతుని సర్వత్ర అనుభూతిని చేసేవారికి ఏది కర్తవ్యకర్మ ఏదికాదు అనేది తెలుస్తూనే ఉంటుంది ప్రపంచ విషయంలోకూడా. మనకు ఒకప్పుడు ఏదికర్తవ్యం ఏదికాదు అనే ప్రశ్న ఉదయిస్తూ ఉండటం కద్దు. దానికి సమాధానం భగవదనుభూతి కలిగిన వాడెలా ప్రవర్తించి ఉండేవాడో, అలా ప్రవర్తించటమే కర్తవ్యం అని చెప్పచ్చు. అలా ఆలోచించడంవల్ల కర్తవ్యం స్ఫురిస్తుంది.

మనశాస్త్రాలన్నీ అలాగే చెపుతవి.మన ప్రాపంచికమైన "లా" లోకూడ ఇంచు మించు అలాగే ఉన్నదనిపిస్తుంది. ట్రస్టీ కర్తవ్యం ఏమిటి అని నిర్వచించేటప్పుడు, వివేకవంతుడైన సాధారణమానవుడు ఎలా ప్రవర్తించాలో,అలా అతడు ప్రవర్తించాలి అని ఉంది.వివేకవంతుడుఅనే యీమాటకు అర్థం స్వార్థభూయిష్ఠుడు అయిన తెలివికలవాడు అని చెప్పినట్లయితే, అసలు ట్రస్టీయొక్క అర్థమే నాశనమైపోవును. అలాటి అర్థం ఏకోర్టుగానీచెప్పదు. అనిర్వచనం వెనకనున్నభావం భగవదనుభూతి లేదా భగవత్స్వరూపమయిన ప్రపంచానుభూతి కలిగిన తత్త్వమేనని గ్రహించాలి. భగవదనుభూతి అంటే ఈ సర్వసృష్టిని గలిగించిన వానిఊహను అనుభూతిచేయడం అనచ్చు. సుక్కారు ఎలా వాడాలో దానితోపాటు, దానినికొనేసమయాన మనకువచ్చిన నియమాల పత్రంలో ఎలాచెప్పారో ఆఊహను అనుభూతిచేయడం అనచ్చు.

మన రాజకీయ పరిపాలనకు ఏఒక్కమతమూ ప్రాతిపదిక కావటం జరగలేదు. కాని శాసనాలకు శాసనమైన సంవిధానంలోని ఆంతర్యం ఈ భగవదనుభూతి కలిగిన వానితత్త్వాన్నే కలిగియున్నదని తెలియాలి. సమష్టిమనసు కయిన అనుభూతిఅన్నమాట.మన సంవిధానాన్ని అన్వయించడంలో కూడ ఇదే ప్రాతిపదిక కలిగి ఉండాలి. భగవంతుడంటె సమష్టి మనసు అనే భావంలేక ఆయన పేరె తితె ఈ secular ం మనేవారు అపరి పడి పోవటం దురదృష్టం. లేదావారి ప్రారబ్ధం.

15. ప్రవర్తి పూర్ణమైన బ్రతుకు బ్రతికేవారిలో రకరకాల స్థితులవారు ఉంటారుగాక.కొందరు కేవలం దేవుని పూజనమే-భజనమే

చేస్తూ కాలం గడుపుతుంటారు. వారు భగవంతుని సర్వగుణాలనూ తలచి వాటినే ఆరాధిస్తూతాముచేసేపనులు ఎలాచేయాలో ఆభగవంతునే అడిగి అతడెలా సెలవిచ్చాడో అలాచేస్తారు. సమష్టిమనసు ఎలాఆలోచించిందో అలా వారిఆలోచనలుంటవన్నమాట. అందుకని ప్రాపంచిక విషయాలలో కూడ భగవంతుడె భజింపబడినవాడై వారిని ఉద్ధరిస్తూ ఉంటాడు. జగత్తు బ్రహ్మ అధ్యాత్మ— యీమూడే వారి భావాంతరాల్లో ఉంటుండేది, ఆల్వారులూ శ్రీ మద్రామానుజాచార్యులూ వారి పంథాఅనచ్చు. ఇంకా కొందరూ సర్వమూ—తనతోసహా-భగవంతుడనే తాదాత్మ్యతతో ఉండిపరమమైన అద్వైత స్థితికి చేరినవారై బ్రతుకుతూనే ఉంటారు ప్రపంచలో. రామకృష్ణపరమహంసలా-జనకమహారాజులా, శ్రీకృష్ణునిలా అనిఅనచ్చు. ఇంకాకొందరు ద్వైత భావంతో తమ అహమును పరమేశ్వరునికి ప్రణిపాతంచేయించి బ్రతుకుతుంటారు. ప్రపత్తి ఒకటె వీరందరికిముఖ్యమైనది. ప్రపత్తిలేని ద్వైతాద్వైత విశిష్టాద్వైతాలులేవు. భగవంతుడనే భావాను భూతి అందరికి ఉంటుందిగాక. ఈ భగవంతుడదే భావం Total mind సమష్టి మనసు మాత్రమేను అని 5వ అధ్యాయం నుంచి రకరకాల మాటల్లో తెలియజెప్పటమయింది. ఈ అధ్యాయంలో దానిని అనుభూతిచేస్తేపని వప్పచెప్తున్నారు.

16-19 ఇక్కడి వరకూ ప్రవచించిన దేవకీ నందనుడు తన ఉత్కృష్ట స్థితిని వెలికి మాటల్లో చెపుతూనె హఠాత్తుగ శరీరస్థితి గతులనధిగమించి భగవస్థితినితనశరీరం ప్రపంచం పైకూడ స్పందింపజేసినవైనం అవుపడుతుంది. అది ఆయనకే తెలియకుండా ఉద్రేకస్ఫూర్తి వలన పొంగిన రసావేశంమాత్రంకాదు. అలాచెప్పవలెననే ఉద్దేశంతోనే ఆయావేశాన్ని అర్జునునకు చూపినాడు. అంటున్నాడు— "నేను భగవంతుడే ఆచిత్ శక్తే నేనే యజ్ఞము. క్రతువు, శ్రాద్ధము. ఔషధము మంత్రము. ఆజ్యమున్నూ. హుతం కావటం కూడ నేనే"ఈ యజ్ఞమే

మిటి అనే సందేహంవద్దు. జీవితమె యజ్ఞంగా—త్యాగపూర్వకమైన బ్రతుకుగా—నడపాలని నాల్గవ అధ్యాయంలో చెప్పారు. అలాటి యజ్ఞం లోని—బ్రతుకులోని పరిస్థితిని ఇప్పుడు చెప్తున్నారు. "ఇలా ప్రతిజీవీ కూడ అనుభూతిచేసి, కర్తవ్య కర్మలను చేయాలి శ్రీకృష్ణునకు కలిగిన అనుభవమైయున్నఆ ఉత్కృష్టానుభూతిని—జ్ఞాపకంచేసికొని—పొందిఇలా అంటున్నాడు—"నేను ఈ జగత్తున కంతకూ తండ్రిని తల్లిని స్రష్టను. జ్ఞేయమును. ప్రాయశ్చిత్తాదులూ నేనే. ఓంకారమును. ఋగ్యజుస్సామాథర్వవేదములనునేనే ఎందుకంటె ఇవన్నీ కూడ నేను అయిన అచిత్ శక్తినుండి ఊహద్వారావచ్చినవే కదా! ఈ వర్షం నేను. దానిని ఇస్తున్నదినేనే. వేడిమిని ఇస్తున్నాను. అమృతం మృత్యువు కూడ నేనే సత్ అసత్ కూడనేనే. అలాతెలిసికొను. స్నేహితుడుగ బావగ ప్రవచనం మొదలు పెట్టిన దేవకీనందనుడు పురుషోత్తమస్థాయి వరకూ ఆక్షణాన అనుభూతిచేసి మాట్లాడి అర్జునుని తనతోపాటు ఆస్థాయికి లాక్కువెళుతున్నాడనిపిస్తుంది. ఇదే గురువుచేసే అనుగ్రహం. తాను ఉచ్చస్థితికి వెళ్ళి ఆ వెళ్ళడాన్ని శిష్యునికి అనుభూతిచేయించాలి. ఇంకా—

నేనే ఈ సమస్త ప్రపంచానికీ గతిని. భగవంతుడను. ఈ సమస్తాన్నీ ధరిస్తున్నది నేనే. దీనిని ఎలా నడపవలె నంటే అలా నడపగలను. అందుకని ప్రభువును అధ్యక్షుడనుఈ జగత్తు ఉండటానికి ఆధారమను. ఈ జగత్తు చివరకు నన్నే శరణు పొందాలి. అంటే నాలోనే ఐక్యంకావాలి—తెలిసి అయినాసరె తెలీక అయినాసరె, ఇలా ఈ ప్రపంచంకనపడినా అదినాలోదే అన్ని స్వరూపాలకూ నేను. సహృదయుడను, నన్నుహృదయంలోనే చూడగా మీరు అనుభూతిచేయాలి. స్నేహితునిగా సఖ్యంపొందాలి. ఈ సర్వానికీ ప్రభవస్థానాన్నినేను ప్రలయానికి నేనెస్థానము. స్థితికీ నేనెస్థానమును. అసలు బీజాన్నెనేను. నేను అవ్యయుడను చిత్ శక్తిచేసే ఊహే ఈ ప్రపంచమనె భ్రమకు స్వప్నమునకు కారణమయినప్పుడు చిత్శక్తి (భగవంతుడు) తలుచుకొంటె ప్రళయం కలిగించటమెంతపని?

20-21 తిరిగి వ్యవహారికంగా చెప్తున్నాడు శ్రీకృష్ణుడు.కాగా వేదాలను చదివినవారు కొందరు దానిలోని ప్రకారంగా క్రతువులుచేసి సోమపానంచేసి పాపాన్నిపోగొట్టుకొన్నవారై పుణ్యంవల్ల మనుష్యులుగా అనుభవింపలేని దివ్యభోగాలను దేవలోకాల్లో అనుభవిస్తుంటారు నిజమే. అది వారుకోరుకొని ఆకర్మలు చేసినందువల్ల కలిగే ఫలితం. అయితే వారుఆవిశాలమయిన స్వర్గలోకభోగాలను అనుభవించి సంపాదింపబడిన పుణ్యం ఖర్చయిపోంగానే—కోరికతీరంగానే—మోహం మొత్తంగానే అనచ్చునేమో-తిరిగి మర్త్యలోకాన్ని చేరటంజరుగుతుంది. మళ్ళీకొత్త కోరికలువస్తయి అవితీరటానికి మళ్ళీ కర్మలు చెయ్యటం-ఇలా వెళ్లటం తిరిగిరావటం అనే యీ సంసరణంలోనే ఉంటూ ఉంటారు.

22 కాగా"ఏజనులు అన్యచిత్తంలేకుండా ఆత్మభావంలో నన్ను చింతిస్తూ భజిస్తూ ఎప్పుడూ యోగయుక్తులై-ఉంటారో వారి యోగక్షేమాలను నేనువహిస్తాను"అన్నాడు శ్రీ కృష్ణుడు. ఈ శ్లోకంలో ప్రత్యేకమైన విషయం ఉపదేశించటం కన్పడుతుంది శ్రీ కృష్ణుడు ఇంతకు ముందె పురుషోత్తముడుగ అనుభూతిచేసి వెంటదే వ్యవహారికాన్నిచేరి అన్నమాటలివి.పురుషోత్తముడికీ,సామాన్యమానవునకూ గలసంబంధం విడకొట్టి చెప్పేశాడు-దాని అర్థం ఏమనంటే,-

"మానవుడు తన త్రిగుణాత్మకమయిన ప్రకృతి ప్రకారం ఈ ప్రపంచంలో భగవంతుడిచే సృష్టించబడిన భగవంతుడే తానై అలా మారిన ఈ వస్తువులనుతనవిగా వసూలుచేసికోవాలనీ తన అధీనంలో పెట్టుకోవాలనీ ఆసిస్తూఉంటాడు గదా! అది సరికాదు. ధర్మంకాదు. ఈ వస్తువులు భగవంతుడివి. వీటిని గ్రహించటం అనుభవించటం ఇంద్రియాలపని. మనిషి చేయవలసిందికాదు ఇది గ్రహించటం మొదటి సూత్రం.వాటిని వదలి పొమ్మనిచెప్పటంకాదు. కర్తవ్యంచేయుమనటం.

మరిమానవుడు—మనసుకలిగినవాడు—ఆమనసుతో ఏంచేయాలి? ఆ మనసుకూ (తనకూ)కారణమయినభగవంతుని, నన్నే ఉపాసించాలి,

అనగా వస్తుసంపాదనచింత కాదు ప్రధానం. ఉపాసన ప్రధానం. అయితే మరి నిన్నెలా ఉపాసించాలి అంటావుగాక, ఈ వస్తువులను చూచిన క్షణానే అవిగా అయియున్నది నేను అని, అవి భగవంతుడనైన నా వని అందులో సర్వాంతర్యామిగా నేనే ఉన్నానని మనసులో అనుసంధానం చేయాలి. అప్పుడు–"నీకేం కావాలో అవి కలిగించటానికి నీతోపాటు ఏవి ఉండాలో అవి నీతోచే ఉంచటానికి చిత్ శక్తినైన నేను ఉపక్రమిస్తాను. నీకేం కావాలో భగవంతుడనైన నాకు తెలుసు. నీకేమి నిల్పి ఉండాలో నేనూహిస్తే చాలు అవి కలుగుతయి నీకు. ఇదీ భగవంతుడైన నా కూ త్రిగుణాత్మకుడవైన నీకు గల ఒడంబడిక" అని వాగ్దానమిచ్చాడు శ్రీకృష్ణుడు. అందుకే అనన్యమైన పరమేశ్వరచింతన నీకుండాలనీ అప్పుడు తప్పిపోని యోగక్షేమాలను ప్రసాదించుతాననీ అన్నాడు శ్రీకృష్ణుడు.

ఈ వాగ్దానమే భగవంతునికీ మానవుడికీ మధ్యగల వంతెన. ఈ వంతెన నెక్కి సంసార సముద్రం తరించ వలసింది అంటుంటే అది వదలి, నీటిలో దూకి, నడిచి ఈది, ఆవలి గట్టు చేరటానికి ప్రయత్నించటం జరుపుతున్నాడు మానవుడు. అంతులేని ప్రవాహంలోపడి లోతుల్లోకి దిగిపోతున్నాడు మానవుడు. బ్రతకాల్సిన రీతి ఎలాటిదంటే భగవంతుడిని స్మరిస్తూ ఉండటమే. ఈ విషయం భగవద్గీతలోనున్న మణిపూసలాగ ఈ మధ్యభాగంలోని ఈ అధ్యాయంలో దానిలోని మధ్యభాగంలో స్పష్టంగా తెలియజెప్పటమయింది.—"గతి–ర్భర్తా–ప్రభుః సాక్షీ–నివాసః–శరణం–సుహృత్–ప్రభవః–ప్రలయ, స్థానం–నిధానం బీజ–మవ్యయమ్" అనే భావం భగవంతుడిపై అనుసంధానం చేయాలి. ఇదే పరమార్థం. ఇదే జ్ఞానం, ఇదే యోగం. ఇదే అనుసంధానం. వీటన్నిటికీ ప్రాతిపదికే ఇది. ప్రాతిపదికేగాదు. గమ్యమే ఇది. మూర్ఖభక్తి కాకుండా "భగవంతుడే" పరాత్పరుని చిత్ శక్తి అని Total mind అని భావించిన క్షణానే పంచతన్మాత్రలు పుట్టి జీవుని అభిమానం వాటిపై కలిగి పంచ భూతాలు కలిగి ప్రపంచాలూ, వాటిని అనుభవించేందుకయిన పంచేంద్రియాలూ సంకల్పరూపంగానయి పుట్టినయి అనేది తెలిస్తే ఆభక్తి నిలువ కలదనిపిస్తుంది.

23 అయితే ఈ అత్యద్భుతమైన భావానుభూతిని పొందకుండానె కొందరు భగవంతుడు అని పూజలు చేస్తుంటారు. ఇంద్రుడే భగవంతుడని, చంద్రుడే భగవంతుడని, ప్రకృతే భగవంతుడనీని, వారిలో అపరిమితమైన శ్రద్ధతో భజించేవారు కూడ ఉంటారు. వారు —సర్వాంతర్యామి భగవంతుడైన కారణంచేత—వానిలోగల ఒక ఆకృతినే భగవంతుడని వారు పూజించిన వారవుతున్నారు. అందులో సందేహం లేదు. కాని వారు ఒకానొక దేవత మాత్రమె భగవంతుడనే భావంలో నడుచుకొంటున్నవారు. వారు చేసే భజనము కూడ 'నా'కు చెందిననేగాని, అది చేయవలసిన తీరులో చేసినట్టిది కాదు. అవి త్యాగపూర్ణములై ఉన్నప్పుడు నాకు చెందుతవనేది వాస్తవమె. ఎందుకంటె అవీ నా ఊహ ఆధారంగా పుట్టినవేకదా!

24 ఈ అన్నియజ్ఞాలకూ నేనే భోక్తను. ప్రభువను. నిజమే. కాని నా పరిపూర్ణత సంగతి పాపం—ఆ భక్తులకు తెలీదు. శ్రద్ధఅపరిమితంగా ఉంటుంది గాక. అయినా వారు నన్నెరుగలేక చ్యుతి పొందుతున్నారు. ఈతెలియుట మనేదె జ్ఞానం. అనుభూతి, అంతేగాని intellectualగా తెలియటం మాత్రమెకాదు. ఈ జ్ఞానాన్ని అనుభూతి చేసిన మీదట కలిగిన భక్తిపరాకాష్ఠేగమ్యము. పట్టిగ భక్తి చేశాను అంటే చాలదు,

25 మరి అట్టి పరాకాష్ఠ చేరని భక్తి చేసినందుకు ఏమిటి ఫలితం—అన్నప్పుడు దేవోపాసకులు ఇంద్రాది దేవతలను పొందుతారు. శ్రాద్ధాది క్రియాపరులు సూర్యలోకాలు చేరుతారు. భూతోపాసకులు గణాలను చేరుతారు. పరాకాష్ఠతోనన్ను భజించేవారు నన్నెలా చేరుతారో అలాగే వారు. వారి వారిని భజించేవారు వారి వారిని చేరుతారు.

శంక:—దేవతలను పితరులను అమాయకులై పూజించేవారు క్రింది అంతస్థులకు మాత్రమే చేరి ఊరుకొనగా, భగవంతుడైననిన్ను భజించేవారు అత్యుత్కృష్టస్థితిని చేరుతున్నారు. ఆదేవతలు మొదలైన

వారు ఇంచుమించు మానవస్థాయిలోనే ఉండగా నీవుఎక్కడోచాల ఎత్తుమీద ఉన్నావని పిస్తున్నది. మరినిన్ను భజించటంకనీసం చేతనయే దెలా? మేము ఏమివ్వగలంనీకు?అనిసంశ. దీనికిస మాధానం తరువాతి శ్లోకంలో చెప్తారు.

26 నాభక్తికి ముఖ్యమైనవి-శ్రద్ధ-యజ్ఞకర్మ-ఆపైనసర్వజ్ఞ సర్వోత్కృష్ట సర్వాంతర్యామిత్వాలు కలిగిన నాస్థితి యొక్క అనుభూతిన్నీ. ఇవి భక్తి, కర్మ,జ్ఞానాల భూమికలు. ఇవి ఉండగా ఇక నాకివ్వబడేవి ఏవైనాసరె పరవాలేదు. పత్రం, పుష్పం, ఫలం, నీరు భక్తితోనాకు సమర్పించితేచాలు,అవే నేను ఆరగిస్తాను. ఎందుకనంటే ఆభక్తుడు, శుద్ధచిత్తుడూ నిష్కాముకుడూ కూడ అయి ఉంటున్నాడు గనక. అప్పుడతని పనులు ఎలాఉంటయి. పరాకాష్ఠచెంది ఉంటవి.

ఇక్కడ అత్యంతమైన పరమార్థ విషయం గమనించాలి. వెనక శ్లోకాల్లో వెనకటి అధ్యాయాల్లో కూడ సర్వత్ర, భగవంతుని ఎలాదర్శించవలసి ఉంటుందో చెప్పారు. ఏవస్తువును, రూపాన్ని చూసినా అందులో రెండు దృష్టులున్నాయి. ఒకటి అది భగవంతుడే నన్నదృష్టి. రెండవది వస్తుదృష్టి. అంటే ఆ వస్తువు తన కెంతవరకు ఉపయోగపడుతుంది అనే దృష్టిఅన్నమాట. మొదటిదృష్టివదలి సాధారణంగా ప్రజలురెండో దృష్టితో వ్యవహరిస్తారు. అది నన్ను(భగవంతుని) అవమానించటమే నన్నారు-(అధ్యా-9శ్లో॥) శ్రీకృష్ణులు. ఆ అర్థం ప్రసరించిన కాంతిలో ఇప్పుడీ శ్లోకం గమనిస్తే పత్రం-పుష్పం-ఫలం ఇవిసమర్పించే టప్పుడు అవన్నీకూడ భగవద్దృష్టిచేసి భగవంతుడికి ఇచ్చివేయటమె భక్త్యా సమర్పించటం. వాటిని పూవులుగానే కాయలుగానే దృష్టిచేసి, ఇచ్చినట్లయితె అవిఎంత స్వల్పమైనవో కదా అనిపించటం ఖాయం. భగవద్దృష్టి వదలి వేయటం చేత భగవంతుని అవమానించటం కూడ అవుతున్నది, కాని భక్త్యా-అంటే-ఆపూవులనే భగవత్స్వరూపాలను

ఇవ్వడంచేత భగవద్రూపం సంపూర్ణమయి సంతృప్తి ఆతడికికలుగు తుందనేది పరమ ముఖ్యమైన విషయం.

27 దేనిని నీవు ఆచరిస్తున్నావో దేనిని భుజిస్తున్నావో దేనిని హోమముచేస్తున్నావో, దేనిని దానంచేస్తున్నావో దేనిని తపంచేస్తున్నావో దానినినాకు అర్పించుతూ ఆపనిచేస్తావు. అంటే అది నేనే ననే అనుసంధానంతో భక్తిచేస్తున్నావని అర్థం. అప్పుడే ఇష్టానిష్టాల ఫలాలనిచ్చే కర్మనుండి—అంటే వాటిబంధాల నుండి అని అర్థం—విడివడి ముక్తుడవవుతావు. ఈ కర్మసమర్పణంకూడ పూర్తిచేసినవాడివై జీవకాలంలోనే నన్నుపొంది, ఈ దేహాంతానకూడ నన్నుపొందుతావు.

28. శుభం-అశుభం అనేవి లోకదృష్ట్యా చూసేవారికి. కార్యకారణాల విమర్శనం తర్జన భర్జనచేస్తూ ఉండేవారికి. లోకదృష్టికాక భగవద్దృష్టితో సర్వమూ ఆచరించేవానికి ఈ కార్యకారణ సంబంధం వదలిపోతుంది. గనక, ఆకర్మబంధంవారికి ఉండదు. శుభం—అశుభం-(లోకదష్ట్యా) ఏదిగాని కలిగినా అవి అతడినిబంధించదు. అట్టివారె సన్న్యాసయోగ యుక్తాత్ములు. భగవద్దృష్టితో యోగమందున్నవారు. బంధంలేనివారవుతారు. వారు అందుచేనె విముక్తులు. వారు నన్నేపొందినవారు,

ఇక్కడ సందేహమూ సమాధానమూ రెంటిలోగల ముఖ్యమైన తేడాగమనించాలి. భగవంతుడు చాలా ఎత్తుమీదవాడని అనుకొంటాము సందేహపరంగా, కాని అలాకాదు. "నన్నుభజించటమె అసలైన ఉత్కృష్టస్థితి, అలాటి భజించే అవకాశం కొరకే కర్మయోగ, భక్తి జ్ఞానయోగాలలోను పరిమోత్కృష్టమైన లక్షణాలను పొందుతాడు సాధకుడు. ఆ ఉత్కృష్టస్థితి కేవలం భగవంతుడనైన "నా"ది మాత్రమె అనుకొనకు. భక్తుడవైన నీవు కూడరావాలి అది. అప్పుడే నేనూగొప్పవాడినై భజింపబడేది. నీవుమెట్టునెక్కినపుడే నేనూ ఉత్కృష్టస్థితికి ఎక్కుతాననేది తెలిసికొను. అలాకాక, నీవుక్రిందిస్థాయిలోనే ఉంటే భజింపబడే నేనూ నీతోపాటె క్రిందిస్థాయిలో ఉంటూ నీయోగ

క్షేమాల సమాచారం అంతమేర చూస్తూఉంటాను. ఈ సందేహాపరిష్కారం 29వ శ్లోకంలో చెప్తారు.

29 నన్ను "న"న్నుగా భజించే వారిని ఒక విధంగానూ,విభక్తిభిన్నంగా భజించే వారిని ఇంకొక విధంగానూ నేను ఆదరిస్తున్నాననుకోవద్దు. అందరి యందూ నేను సముడనే. ప్రియుడుగాని అప్రియుడుగాని. నాకు లేడు. ఎవరునన్నుభక్తితో భజిస్తూ ఉంటారో వారు నాలోనూ, నేనువారిలోనూ ఉంటాము. "నేను" అంటేనే అర్థం అది. నేను సర్వత్ర ఉన్నవాడినని అనుభూతిచేయడమే కదా భక్తి "నేను"అక్కడ ఉన్నాను అనేభావంనీకు ఎక్కడ లేదోఆమేరనీవునన్నుఅనుభవించటం మానివేశావన్న మాట!అందుకె "నన్ను" కొంత కొంతగానె భావించి భజించితె నేను కొంత కొంతగానే వారిని ఆవేశించిసేవించిన వాడినవుతాను. నన్ను అనన్య భావంతో వారు భజించినపుడు సర్వాంతర్యామి, సర్వజ్ఞుడూ అయిన "నేను" సర్వమూ వారి యందె ఉండిపోవటంచేత నా ఈ శరీరమయిన సర్వప్రపంచమూ వారి ఆధీనమైపోతుంది. అందుచేత నేనె వారియోగక్షేమాలు చూస్తూ ఉంటున్న వాడినవుతాను. సర్వప్రపంచవస్తువులూ భగవంతుడేగనక, భగవంతుడే నీయందున్నాడని అనటం అందుకె. ఈ సర్వమూ నీయధీనమేననిఅనటం.ఇవివట్టి మాటలనుకొనేవారు ఆఉత్కృష్టస్థితికి ఎక్కనేలేరు. ఇవి ఏమిటో తెలిసి అనుభూతి చేయాలనే జిజ్ఞాసువులు జ్ఞాన కర్మయోగాలతో కలిపిన భగవదుపాసనాన్ని (భక్తిని) జరిపితె ఆస్థితికెక్కవచ్చు ననిపిస్తుంది.

భక్తిచేసేది భగవంతునిపట్ల భగవంతుడంటె ఎవరు? ఈ సర్వప్రపంచానికీ ఆధారమైన సమష్టిమనసు. పరాత్పరుని చిత్ శక్తి, మొదలుగా మహత్ అయి, బుద్ధిఅయి శబ్దాదితన్మాత్రలుపై అభిమానం కలిగించుకొని–స్థూలదేహాన్ని సృష్టించుకొని ఇంతవరకె నేననేభ్రమలో పడింది ఆ భగవంతుడె. అలాటి భ్రమాత్మకుని జీవుడని చెప్పి వేరుచేసి సమష్టిమనసు అయిన భగవంతునె భగవంతుడుగా ఎంచి భక్తి

చేసి అందుచేరజూడటమె భక్తి. అంతర్దృష్టితో మూలవిషయంచూచి చొరుచుకొనిపోయి భగవంతుని పొందుమనిబోధ. ఏదేవతను అరాధించేవారైనా మూలవిషయాన్ని అంతర్దృష్టితో అనుభవించేప్రయత్నం చేయడంవల్ల తన పద్దకు చేరగలరని సూచన.

30 మానవుల్లో సమాజంలోని అవసరాల ననుసరించి భిన్న భిన్నమైన ఆచారాలున్నాయి. ఎవరికి వారు వారి వారి వృత్తికి తగినట్లు ఆచారాలకు తగినట్లు కర్మలనుచేస్తుంటారు. అందుకని భిన్న భిన్నమైన కర్మలు ఉండటం సహజం. కొన్ని గౌరవనీయమైనవనీ కొన్ని తక్కువరకమనీ వీళ్ళలోవీళ్లేఅనుకొంటూ ఉంటారు.ఎవరుచేసేకర్మ-కర్తవ్యకర్మ-వారికిఆక్షణాన గొప్పదే.నిజానికి ఎక్కువ తక్కువలు సత్త్వరజస్తమో గుణాలచే పరవశమైనవారు చెప్పేవే.అందుకనివాటి తేడానేను" ఎప్పుడూపెట్టుకోను .తక్కువ అనబడుతున్నా గొప్పది అనబడుతున్నా కర్తవ్యకర్మ సాధకుడయినవాడు చేస్తూనన్ను భజించటం ఆరంభించాలి అన్నది ప్రధానమైన సూత్రం. అంటె సర్వత్ర నా ఉనికిని తెలిసి నడచుకోవాలి.వదార్థ దృష్టివదలి వాస్తవదృష్టితో బ్రతకాలి. ఏకాంత భక్తితో అలాభజించాలి. అలాంటివాడు—ఒకవేళ తక్కువ అని ఇతర్లచేపిలువబడే కర్మచేస్తున్నా-సాధువుతో సమానుడే.అతడు భగవద్భజన చేయడం నేర్చినవాడు.కృతార్థుడు.ధర్మవ్యాధులాడటివాడుకాదా?

31 అతడు అలాటి భజన ఆరంభించిన తరువాత త్వరలోనె ధర్మచిత్తుడవుతాడు. నిత్యమైన శాంతిని పొందుతాడు. కౌంతేయా! నా భక్తుడు వినష్టుడుగాడు.కృతార్థుడవుతాడు. ఇది నిశ్చయంగా తెలిసికొను బిల్వమంగళుడెలా తరించాడు? లీలాశుడై కుపోలేదా!

32 అతడేననేమిటి?నికృష్ట జన్మలు కూడ అలా భక్తికిమారిన వెంటనే పరాన్ని పొందటం తథ్యం. నికృష్ట జన్మలని అజ్ఞానులచేత పిలువబడేవారుకూడనని అర్థం. అందరూ భక్తి వల్ల తరిస్తున్నప్పుడు

లోని పరమోత్కృష్టమైన స్థితిని నేనే అన్నాడు భగవంతుడు. ఎనిమి దవ అధ్యాయంలో మానవుడు తన జన్మను తానే సరిదిద్దుకోగలిగి ఉన్నాడని అందుకుగాను అతడు ఎల్లప్పుడూ మనసును భగవంతుని మీదనే అనుసంధానంచేసి బ్రతకాలనీ చెప్పారు. అప్పుడె చిత్ స్వరూపుడైన భగవంతునిలో బ్రతకడం అతడికి సంభవిస్తుందనీ అన్నారు. నవమాధ్యాయంలో భగవంతునిపై ధ్యానంఎలా ఉంచాలో ఆసాధనవిషయంకూడ చెప్పారు. మన్మనాభవ-మద్భక్తోభవ.మద్యాజీ మాం నమస్కురు. మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః అన్నారు.

ఇంకా చెప్తున్నారు శ్రీకృష్ణులు-

1-3 అర్జునా! "నా" ఉత్పత్తి ఎలాగైనదో తెలిసికోవాలను కొంటున్నావు. దానిని దేవతలూ మహర్షులూకూడ ఎరుగలేరు. వారికంటె ముందే"నేను"(గ)ఉన్నాను. వాళ్ల "మేము"అనె పరిమితి నేర్పరచుకొన్నది నా చుట్టూ రనే గదా: నాఉత్పత్తి వాళ్ళ కెలా తెలుస్తుంది!! నిజానికి నా ఆశయం కూడ,పరిమితిలో ఉండిన మీరంతా నాపేకించి తెలియాలనె. మీరు మాత్రం నేను ఆశించినట్లు తెలిసి కొనట లేదు. నేను పుట్టటానికి కారణం ఏదీ లేదు. కార్య కారణసంబంధం నాకు అన్వయించదు, అసలు పుట్టుక అనెది"నా"కు ఉండేకదా! ఎల్లప్పుడూ శాశ్వతంగా ఉండే దునుకు మొదలేమిటి తుదేమిటి? నేను ఎల్లప్పుడూ సర్వలోకాలకూ మహేశ్వరుడుగా ఉన్నాను. ఇదితత్వత! తెలిసికొంటే మీరు పుణ్యపాపాలను అధిగమించిన వాళ్లవుతారు, మూఢత్వాన్ని దాటిన వాళ్ళవుతారు. అజ్ఞానాన్ని నాశనంచేసిన వాళ్ళవుతారు.

4-5 నేను ఎన్నోసాధనలు ఇంతవరకూ చెప్పుతూ వచ్చాను. మనసును బుద్ధిచేత నియమించాలన్నానుఆత్మానాత్మవివేకమే జ్ఞానానికి ప్రాతిపదిక అయిన సాధనమన్నాను. దుఃఖాన్నీ సహించటమే క్షమ

అన్నాను. ఇలాక్షమ, సత్యం, శమం,దమం, ఉత్పత్తి, స్థితి, వినాశం, భయం, నిర్భయం, అహింస, సమచిత్తత సంతోషం, మనోవాక్కాయ పూర్వకమైనతపస్సు, దానం, ధర్మం, కీర్తి, అపకీర్తి ఇవన్నీ భూతాలకు కలుగుతుండే భావాలు. వీటన్నిటికీ ఉత్పత్తి స్థానాన్నికూడ "నేనె" చిత్ శక్తిని కదానేను. ఈ భూతాలకు వాటి వాటి కర్మానుసారం ఈ భావాలు నానుండియే ప్రసాదింపబడుతున్నాయి. అంటే నేను చేస్తుండే ఈ విశ్వచంక్రమణంలో ఒకానొక భాగశమైన కర్మనే (నేనుకేటాయించిన దానినే) అనుసరించి వారు ఆయాభావాలు ఉద్భవించంగా అనుభవిస్తున్నారు, ఇది గమనించు.నేను "వారికర్మాను సారం" అన్నానంటె అర్థం, నాదైన ఈజగత్కార్మలో నేను వారికయికేటాయించి కర్తవ్యంగా ఉంచిన కర్మ అనుసారం అనేదిమరచిపోకు.

మొదట సనకసనందనాదులనూ సప్తమహాఋషులనూ సృష్టించాను. వారు నా మానసపుత్రులె. వారికి పూర్వకర్మ యేదీలేదు. నేను కోరటమె వారికి గల కర్మ అన్నమాట.వారిచిత్తమెప్పుడూ నా పైనే ఉండేది. అందుకని వారికి "నా" తో సమానమైన ప్రభావం ఉంది. మద్గతచిత్తుడవై నీవుకూడ ఉంటే, నీవుకూడ నాతోసమానమైన ప్రతిభావంతుడవవుతావు అనిధ్వని.

ఇంత వరకూ భగవంతుడెంతో ఎత్తుమీద వాడనీ, గొప్పవాడనీ, ఇంద్రియాతీతుడనీ, మహోత్కృష్టుడనీ ఈ సామాన్యలభావనె అర్జునుడికీ ఉంది.కాని అర్జునుడు శ్రీకృష్ణుని ప్రవచనంవిని కొన్నిమెట్లు ఎక్కినవాడయినట్లున్నాడు.భగవంతుడు తానెక్రిందికి దిగినట్లుస్ఫురింపచేస్తూ సనకసనంద నాదులూ సప్త మహర్షులూ నా సములేనని.అంటున్నాడు. నీవు నాయంత కావచ్చుననె ఊహనిస్తున్నాడు.

7. ఇంకో రహస్యం చెప్తున్నారు—"ఎవరయితే నామహిమనూ పై మనోభావాలకుగల సంబంధాన్ని యథార్థరూపంలో గ్రహిస్తారో వారు సమ్యగ్దర్శనంద్వారా నన్ను చేరుతారు." అంటే—1, భగ

వంతుని విభూతులను (అంటే ఐశ్వర్యాలు మహిమ గొప్పతనములు అనచ్చు)– తత్త్వతః గ్రహించటం. 2. ఏభావమైనా భగవంతునిలో నుంచి వస్తున్నదనే సంబంధవిషయం తెలియటం, ఈ రెండూ అవసరమన్నమాట. మొదటిది మాత్రమే గ్రహించినవాడు కేవలము మూఢభక్తుడు. రెంటినీ కలిగినవాడు యోగి. ఇది తెలియమంటున్నాడు భగవానుడు. అనుభూతి అయ్యేదాకా మననంచేసి తెలియాలని అర్థం.

8. ఇక వ్యక్తి, భగవంతుని యందు "భావసమన్వితుడు" కావాలనే మరో ముఖ్యవిషయం సాధనగా చెప్తున్నారు. ఈ 8వ శ్లోకంలో బుద్ధిమంతులూ భక్తిభావన సమన్వితులైనేను సమస్తజగత్తుకూ ఉత్పత్తిస్థానమనీ, సమస్తమూ నావల్లనే జరుగుతున్నదనీ, తెలిసి భజిస్తూఉంటారు, ఇంతవరకూ బుద్ధిచేత తెలిసికోవలసిన విషయాలన్నీ చెప్పేశాడు. ప్రపంచాన్నిచూస్తూ అది భగవంతుడే ననుకోవాలనే బుద్ధి విషయం విశదీకరించాడు. ఈ మాత్రం చాలదు. లెక్కలెలా బుద్ధినేర్చుకొంటుందో, అలాగే సృష్టివిషయంకూడా తెలిసికోవటమే చాలదని అర్థం. భావసమన్వితుడుకావాలి. అంటే భగవంతునిపై ప్రేమభావనతో ఆ జ్ఞానాన్ని అనుసంధానంచేయాలని అర్థం. ప్రేమపూర్వకమైన జ్ఞానం కలిగి ఉండటం సాధనగా చెప్పారన్నమాట. ఈ ప్రేమ అంతరంగంనుంచి బయటకు ప్రవహించే ప్రేమమాత్రమేకాదు. బయటి ప్రేమచూపుటమనేది అంతర్గతమైన భగవంతుని పట్ల ప్రసరించాలి అనేది జ్ఞాపకముంచుకోవాలి. (అంతరంగం అంటే మనస్సూలేదా బుద్ధి లేదా చిత్తం లేదా అహంకారం ఇవన్నీ స్థాయిలుగా కలిగిన చైతన్యమని జ్ఞాపకముంచుకొను.)

ప్రపంచంలోని ఏవస్తువును చూస్తున్నా అది భగవంతుడనే జ్ఞానాన్నితలచి, అందుచేత దానిని ప్రేమించటం చేయాలి, భగవంతుని అంతర్దృష్ట్యాచూచి చిన్మయునిగా చూడాలి. ఇదీ సాధన అనిపిస్తుంది. అలా ప్రీతితో "నా"తో యుక్తుడై ఉండే సాధకునికి నేను బుద్ధియో

గాన్ని ప్రసాదిస్తాను అన్నాడు శ్రీకృష్ణుడు, బుద్ధియోగం అంటే,బుద్ధిని అంతర్దృష్టియుతంచేసి ఆత్మతో లగింపచేయటమే.

9-11 బుద్ధియోగంవల్ల లాభం ఏమిటంటే ఆత్మరూపంలో సర్వత్రాఉన్న నన్ను తెలియడమే. భక్తులైనవారు — కేవలం భక్తులకు (వారిని కించిజ్ఞులమైన మనం మనతెలివి నుపయోగించి మూఢభక్తు లంటాం) మూఢులుకాకుండా బుద్ధియోగాన్నిచ్చి నేను తరింపచేస్తాను. వారిని అనుగ్రహించడానికి వారిహృదయంలో నేను ప్రత్యేకంగా ప్రవేశించి వివేకదీపం వెలిగించినట్లు సమ్యగ్దర్శనాన్నిచ్చి ప్రకాశాన్ని వెలిగించుతాను. వారిదృష్టిని అంతర్ముఖంచేసి, అజ్ఞానం వల్లపుట్టి నిల్చిఉన్న మోహాంధకారాన్ని నాశనంచేస్తాను. భక్తులైనవారికి నేను చేసేది ఇవి.

"అహం బ్రహ్మాస్మి" అనీ, తత్త్వమసి అనీ, అయమాత్మా బ్రహ్మ అనీ, చివరకు సర్వంఖల్విదంబ్రహ్మ అని తెలిసి జ్ఞానియై, దానిని భావసమన్వితత్వమును కలిపి, పరమేశ్వరుని తెలిసి మెట్టు నెక్కటం — ఇదీ సాధన.కాగా ముందుగానె పరమేశ్వరుని ప్రేమించి హృదయం స్పందించిన కేవలభక్తుడు ఎవరైనాఉంటే అదీచాలునంటు న్నాడు భగవానుడు. వానికి బుద్ధియోగాన్ని అనగా జ్ఞానాన్ని నేను ప్రసాదించుతానని అభయ మిస్తున్నాడు. వీరిద్దరికి గమ్యం మోక్షమే. కాని యీభక్తి-బుద్ధియోగాలు ఆతనితో కలిసే వరకూ వ్యావహారికం లోని నడకను ఆత్మపరంగానడుపుతూ జ్ఞానిన్నీ జీవన్ముక్తుడు కాక ముందు అలాచేయలేక భక్తుడున్నూ సతమత మవుతుంటారు.

12-15 ఇక్కడ అర్జునుని పరిస్థితిని గమనించటం అవసరం. అతడు యోగవిషయంతెలిసికొన్నాడు. ఇంకా అభ్యాసమయితే చేయ డం అదేది జరగలేదు. 7నుంచి 9 అధ్యాయాల్లో భగవంతుని విష యం భక్తివిషయం శ్రీకృష్ణుడు తెలియచెప్పాడు. మన్మనాభవ— మద్భక్తోభవ-మద్యాజీ-మాం నమస్కురు అని భక్తి తెలియచెప్పాడు.

భక్తి,హృదయ సంబంధమైన విషయం. భక్తినాస్వాదించగలిగే హృదయం ఉంటే, అభ్యాసంచేయాల్సిందేదీవుండదు. జ్ఞానంవిషయంమాత్రం అలాకాదు. అభ్యాసంచేసి యోగం ఆచరించాలి, అర్జునునకు తగిన హృదయం ఉంది, శ్రద్ధ ఉంది.

అందుకని దేవకీనందనుడైన శ్రీకృష్ణుని గూర్చి అప్పుడంటున్నాడు అర్జునుడు:-పరంబ్రహ్మ: పరంధామా!! నీవు పరమపావనుడవు, నిన్నుగూర్చి ఋషులందరూ నీవుచెప్పినట్లే చెప్పుతూవచ్చారు. దేవర్షియైన నారదుడు, అసితుడు, దేవలుడు, వ్యాసుడూ కూడ, నీవు సనాతనుడవని, జన్మరహితుడవని, సర్వవ్యాపివని చెప్తున్నారు. ఆ సంగతే నీవును చెప్పినావు. అదంతా యథార్థమనినేను నముతున్నాను, దేవతలకూ దానవులకూ కూడ నీ ఆవిర్భావం సంగతి తెలియదుగాక. ఈ ఋషులకు తెలుసు. నీకు తెలుసు అన్నాడు.

15, పురుషోత్తమా! భూతోత్పాదకా! భూతేశ! దేవదేవా! జగత్పతే! నీకై నీవే నిన్నుగురించి తెలియగలిగినట్టివాడవు. అందుకని నాకు చెప్పు—ఏయే విభూతులచేత నీవు ఈలోకాలలో వ్యాపించి ఉన్నావో. ఈబుద్ధితోనిన్ను ఈ ప్రపంచంలో సర్వదా చింతనచేస్తూ గమనిస్తూఉండేదెలాగో చెప్పు. ఏయే వస్తువులను చూచి ఎలా నిన్ను జ్ఞాపకంచేసికోనాలి? ఏయే భావాలతోనిన్ను ధ్యానించాలి? ఒకటో రెండో కాదు, నీ విభూతులన్నీ నాకుచెపాల్సింది. వాటిని నీవాక్యాల్లో—నీముఖతః వింటుంటే అమృతాన్ని ఆస్వాదించుతున్నట్లే ఉంది—తృప్తి అనేది లేకుండా.

అర్జునుడు కేవలం మహాభక్తుడయిన క్షణమిది. అతడి హృదయం పరిపూర్ణమైఉంది. భగవంతుని ఎదుటనే ఉంచుకొని "చెప్పు నాకు—నీసంగతి. నిన్ను వినాలని, నిన్నుచూడాలని నిరంతరం నిన్ను నాహృదయంలోనే ఉంచుకోవాలని అనిపిస్తోందిఅని అంటున్నాడు. ఇంకా బాహ్యభక్తిలోనే ఉన్నవాని స్థితియిది.

శ్రీకృష్ణుడెలా తప్పించుకొంటాడు చెప్పకుండా? చెప్పేతా- ఎలాగో నంటే-ఎలా? ఎన్నని చెప్పాలి? విభూతులకు అంతులేదుకదా అంతు వుంటే నిరంతరం భగవంతుడిలో బ్రతకట మనే దెలా జరుగు తుంది?

19. శ్రీకృష్ణు డప్పుడంటున్నాడు:-అబ్బో! ఈ ప్రపంచంలో నెక్కడెక్కడ ప్రత్యేక గా ఉంటున్నాననే విషయమా?అచోట్లు అంతు లేనివి. అవి చెప్పటం ఎప్పటికీ పూర్తికాదు. ఏలాంటి వాటిని చూచి నన్ను జ్ఞాపకం తెచ్చుకోవచ్చుననే విషయం మాత్రం సూచిస్తానుగాక.

20. అర్జునా! నేనే సర్వభూతాల్లోనూ ఉన్న వాడినే. అందరిలో ఆత్మగా ఉన్నదినేనే ఈభూతాలకు అది అంత మేకాకుండా, వాటిస్థితి వర్తమానంకూడానేనే. భగవంతుడు అనే భావం తెలిసి, ఆతడికి గల సర్వత్రస్థిత భావమే రావాలిగాని, ఆపైన అడ్డమేమున్నది? నేనప్పుడు కన్పడుతాను. అప్పుడిక ఒకటి విభూతి అయి ఇంకొకటి కాకపోవటం అంటూ ఉంటుందా?

వ్యక్తి "నేను"అన్నప్పుడు అతడి కాళ్లూ చేతులూ కళ్లూ వళ్లూ మనసూ మాట బుద్ధీ శ్రద్ధత సర్వమూకూడ తాననేది ఎలాతెలిసిమాట్లా డుతున్నాడో ఆలాగే. తనవాతావరణం ఆకాశం భూమిగాలి సర్వం కూడ తానే అయిన భగవంతుడుకూడాను అనేభావం పిచ్చిలి రావాలి. నా చొక్కా తాకినా నన్ను తాకినట్లే నని ఎలా అనుభూతిచేస్తున్నామో, నా యీ చుట్టూగలగాలి యీ ఇల్లు ఈ సర్వంకూడా నేనే అయిన భగ వంతుడని పూర్వులు అనుభూతిచేశారు. ఏది కనపడితే అదే దేవుడని అనుభూతిచేశారు. ఏది కనపడితే అదే దేవుడని అనుభూతిచేయటంజ్ఞాని అయినవాడికి పరిపాటి. నీవు నన్ను గుర్తించకలగాలి, కాదు. నిన్నునీవే గుర్తించకలగాలి. ఇదీ శ్రీకృష్ణుని సూచన.

నిన్ను నీవే గుర్తించటమెలాగ? ఈ వాతావరణం, ఈశరీరం, ఈ అవయవాలు, బయటకు వదలి, ఇంకాలోపలకువెళ్లాలి. ఇంద్రియాలు

మనసు కూడదాటి అంతర్గతంగా వెళ్ళితే స్మృతి ఉంటుంది. ఆస్మృతిని వదలటమే సాధించాల్సింది. ఈ స్మృతి ఈ శరీరానికి సంబంధించిన స్మృతి అయి ఉంటుందని మాత్రమే అనుకోవద్దు. అది ముందుగా తగి లేది మాత్రమే. ఆస్మృతినికూడ త్యాగంచేస్తే-అంటే వదలివేస్తే-ఇక అగపడేది "చిత్" యొక్క స్మృతి-చిదాభాసలోని స్మృతి. అది నీ ఒక్కడికి చెందినదే కాదు. అదే భగవంతుడు నీవైన భగవత్ స్థితి అదే తెలిసికొనాల్సింది. ఇది ఈ మార్గంలో ప్రయత్నంచేసి తెలి యాలి. ఇదే ధ్యానం అంటారు. అభ్యాసంచేయాలి ఈ గమనం. ఇదే జ్ఞానం. జ్ఞానం. అభ్యాసం, ధ్యానం కలిసిన యోగమిది. దీని ఫలితం భక్తే ఆ.భగవంతుని తలవడం భక్తికాదా? ఆ భగవంతుడెలా తెలియ బడుతున్నాడంటే "నీ"వెవరో తెలిసికోవడానికి ప్రయత్నించడం అనే సాధనద్వారానే నన్నే సంగతి ముఖ్యమైన విషయం.

21. ఇక బయటనుంచి లోపలి దృష్టిలో ఎలాపయనించా లనేది సూచిస్తునా? విష్ణువు ఆదిత్యులలో గొప్ప. అతడు నేనుగా నీవు తెలిసికొనటానికి ప్రయత్నించు. ఐశ్వర్య కారణంచేత ఆదేవునియందు (నాయందు-లేదా-నీయందు) భావసమన్వితుడవుకావటానికే ఈ విభూ తులను ఉపయోగించుకొను. ఆదిత్యు లందరూకూడా గొప్పవాడైన విష్ణువుని చూచి భగవంతుడని తెలియవచ్చు. తెలిసి, అంతవాడు తాను కావడానికయిన ప్రేమను భావసమన్వితత్వాన్ని సంతరించగలగాలి సాధనలో. ప్రేమించాలి. అలాగే ప్రకాశముచే వారిలో సూర్యుడను నేనే (నీవే). మరుత్తులలో మరీచిని (మరీచివి.) నక్షత్రాల్లో చంద్రుణ్ణి చంద్రుడవు. ఇలా పరమేశ్వరస్థాయికెక్కి-నేనే-నేనే-నని సూచిస్తున్న శ్రీకృష్ణుడు పరిపూర్ణుడైన భగవంతుని స్థాయి అర్జునునికి ప్రదర్శిస్తు న్నాడనిపిస్తుంది. అర్జునుని కూడ ఆ స్థాయికి తేవాలని చేసేప్రయత్నం స్పష్టంగా అవుపడుతుందిక్కడ.

22. వేదాలలో సామవేదాన్ని దేవతల్లో ఇంద్రుణ్ణి; ఇంద్రియాల్లో మనస్సును; భూతాల్లో వాటి జీవాన్నే.

మనుష్యుడు భగవత్తత్వాన్ని తెలియకముందు, భగవంతుడంటే మనిషిరూపంగా ధ్యానిస్తాడు. అలాగే బహుశ పక్షులు పక్షిరూపంలో, సర్పాలు సర్పరూపంలో భగవంతుని ధ్యానిస్తవి. ఎందుకనంటే ఎవరికివారు ఉన్నతి కెక్కాలి గదా! తమకంటె ఉన్నతినందిన తమ వంటి రూపవంతుని నాయకునిగ తలచి భగవంతుడని తానలా అనడం అవసరమూ నిజమనిపిస్తుంది. భగవంతుడు సర్వత్ర ఉంటున్నభావం ఏర్పడే ముందు అలాతలచటం న్యాయం—మామూలు—అనాలి. అందుకని విభూతికలిగిన చోటనల్లా చూచి భగవంతుడనుకొమ్మంటున్నాడు శ్రీకృష్ణుడు.

23. రుద్రులున్నారు. వారి ప్రతిభేగొప్పది. వారిలో శంకరుని చూచి, అది నావిభూతిగా తెలిసికొను. యక్షరాక్షసుల్లో కుబేరుడనని, వసువుల్లో పావకుడననీ, శిఖరాల్లో మేరువనని తెలియాల్సింది.

24. పురోహితుల్లో బృహస్పతిని. సేనానులలో స్కందుడను, సరస్సులలో సాగరాన్ని. ఇలాచేతన—అచేతన—అధిచేతనా అన్నిటిలో కూడ తన ఐశ్వర్యాన్ని ఎలా గ్రహించాలో శ్రీకృష్ణుడు చెప్తున్నాడు. వస్తువులను ఇంకావస్తువులుగానే తిలకించే స్థితినుండి [illegible] విభూతిని దేనినిచూచినా భావసమన్వితులమై భగవంతుని జ్ఞాపకం చేసికొనటం. మనసువానియందు ఏకంచేసి చూచుకొనటం ఇక్కడచెప్పే సాధన.

25. మహర్షులున్నారు. వారిలో భృగుమహర్షి నావిభూతి. అక్షరాలలో "ఓం" అనేది భగవద్విభూతి, యజ్ఞాలలో జపయజ్ఞం భగవంతుడు యజ్ఞాలలోతాదాత్మ్యంపొందిన మనసు తానే యజ్ఞమనుకొన్న స్థితి జపయజ్ఞస్థితి. అది విభూతి—భగవంతుడు "నేను" అలానే స్థావరాల్లో హిమాలయం భగవంతుడు—నేను.

26-30 వృక్షాల్లో అశ్వత్థ వృక్షం, దేవర్షుల్లో నారదుడు. గంధర్వుల్లో చిత్రరథుడు, సిద్ధుల్లో కపిలుడు. అశ్వాల్లో ఉచ్చైశ్రవం, గజాల్లో ఐరావతం. నరుల్లో నృపుడు, ఆయుధాల్లో వజ్రం, ఆల జాతిలో కామధేనువు, సంతానోత్పాదకుల్లో కందర్పుడు, ఇవన్నీ భగవంతుడే. ఇంకా సర్పాల్లో వాసుకి, నాగుల్లో అనంతుడు, జలదేవతల్లో వరుణుడు, దైత్యుల్లో ప్రహ్లాదుడు· వశంచేసుకొనేవారిలోకాలం, భగవంతుడు. మృగాల్లో సింహం. పక్షుల్లో గరుత్మంతుడూ భగవంతుడే.

31-35, ఇంకా చెప్తున్నాడు శ్రీకృష్ణపరమాత్మ—పవిత్రత నిచ్చేవారిలో పవనుడను, శస్త్రధారుల్లో శ్రీరాముడను. మత్స్యజాతిలో మకరాన్ని.నదుల్లోగంగను. ఇంత ఏమిటి! లక్షలాది ఈభూతాలున్నాయి కదా! ఈ పంచభూతాలూ వాటి తన్మాత్రలూ, వాటి ఆది, మధ్య, అంతాలూ అన్నీనేనే. నేనే ఇలా ఇన్నిగా అయినాను. చిదాభాసుణ్ణినేను నీమనసూ బుద్ధిలద్వారా ప్రసరించి కనిపించే ప్రపంచం అయినాను. విద్యలలో అధ్యాత్మవిద్యను నేను. తర్కంలో వాదవిశేషాన్ని. అక్షరాల్లో అకారాన్ని సమాసాల్లో ద్వంద్వసమాసాన్ని.సామాల్లో బృహత్సామాన్ని. ఛందస్సుల్లో గాయత్రీ ఛందస్సును. మాసాల్లో మార్గశీర్షాన్ని ఋతువుల్లో వసంతఋతువును.

36. అంతేకాదు.వంచన చేసేవారిని చూస్తేవారిలోద్యూతమను. తేజశ్శాలురలో తేజస్సును, ఉద్యమపరుల్లో ఉద్యమాన్నే. జయవంతులలో జయాన్ని. సాత్త్వికుల్లో సత్త్వమే నేను.

37. వృష్ణివంశజుల్లో వాసుదేవుడను.పాండవుల్లో అర్జునుడను. అర్జునుడు ఇప్పుడున్న స్థితి ఎలాటిది! ఆత్మలో ఐక్యమై భగవదంశమే ఆత్మ అని తెలిసిన స్థితిలో ఉన్నాడనచ్చు.ఆలాటి అర్జునుడె భగవంతుడంటున్నాడు శ్రీకృష్ణుడు. ఆస్థితిననుసంధానం చేయుమనిబోధ-ఏ పరిస్థితుల్లో ఉన్నా: వారు మనుష్యులైనా,మానులైనా, జంగమాలైనా స్థావరాలైనా పైనసూచించినట్లు భగవద్విభూతిని లక్ష్యంగాపెట్టుకొని

మెట్టునెక్కటానికి ఇదే తరుణోపాయం అన్నమాట. అలాగే మునుల్లో వ్యాసుడు, వివేకుల్లో శుక్రుడు భగవంతుడని తెలిసికో అన్నాడు.

38. దమనంలో దండనీతిని నేను. జయించాలి అనేవారిలో రాజనీతిని నేను. గోప్యంగా ఉంచవలసిన విషయంపట్ల మౌనాన్ని నేను. జ్ఞానాల్లో తత్త్వజ్ఞానాన్ని.

39. అంతేకాదు. కీర్తి, శ్రీ, వాక్కు, స్మృతి, మేధ ధృతి, క్షమ, ఇవన్నీ నేనే, ఏది సర్వభూతాలకూ మూలకారణమో అదీ నేనే. నేనులేని వస్తువే ఈ చరాచరాల్లో ఉండదు. ఈ విభూతులకు అంతులేదుసుమా!

విభూతి అనేదాన్ని మిగిలినవాటి నుంచి ప్రత్యేకంగా చూడదలుచు కొంటే సూత్రంచెప్తాను. విను. ఐశ్వర్య యుక్తమూ లక్ష్మీయుక్తమూ శ్రేష్ఠత్వమూతో ఒప్పేకే ఏ వస్తువైనాగానీ ఆ ఐశ్వర్యం నీవుగడిం చాలనే ప్రేమను అది నన్నుగా గ్రహించటంద్వారా తరించి సాధించు అది నా తేజోంశమని గ్రహించు. భగవంతుడు అని అనుకొనేటప్పుడు ఉన్నతిని తెలిసి తాదాత్మ్యంపొందితె భావసమన్వితత్వం కలుగుతుంది. అందుకనే ఈ విభూతులను ప్రత్యేకించి తెలియుమనటం!

42. అంతే కాదు-ఇంకొక విషయం తెలిసికొనాలి. ఏమనంటే ఈ సమస్తమైనజగత్తూ భగవంతుడైననాలో ఒకానొక అంశ మాత్రమె దీనిఅర్థం కుడిభాగం ఎడమభాగమనికాదు. ఈసమస్త జగత్తు నీకు తెలిసి నట్టిది ఒకచిన్నభాగమేనని అర్థం. (భగవంతుడు భాగం అనిఅర్థంకాదు) ఈ జగత్తు-మొత్తం నేనులో భాగమనిధ్వని. వీటిని జాబితాచేసి చెప్పితే ఆ జాబితా ఎన్నడూపూర్తికాదు అని అర్థం. వాటివల్ల నీకు కలిగే ఉప యోగంకంటే నేను చెప్పిన కీలకం ఉపయోగతరమైంది.

నీవింకా ఈ బాహ్య విషయాలు చూసి, తెలిసి, ఐశ్వర్యంఏదో కనిపెట్టి, అప్పుడు భగవంతుని అనుభూతిచేయాలి అనేస్థితిలో నిల్చి పోకు. సర్వత్రనీకు కనపడేది భగవంతుడే. చిదాభాసమే. అది అనుభూతి చేయటం ముఖ్యం. అన్నాడు శ్రీకృష్ణపరమాత్మ.

—ఇది పదవ అధ్యాయం—

# శ్రీ మ ద్భ గ వ ద్గీ తా మ న న ము
## పదకొండొవ అధ్యాయము



## విశ్వరూపదర్శన యోగము.

ప్రపంచాన్నే విశ్వరూపుడుగ చూడటం అభ్యాసంచేయాలి

అర్జునునికి అది చిత్రంగా లభ్యమయింది.

మనం అంతర్దృష్ట్యా తెలియాలి.

1. అర్జునుడు అంటాడు—"శ్రీకృష్ణా! నన్ను అనుగ్రహించటానికే నన్నట్లు అత్యంత క్లిష్టమైన రహస్యాలను నాకు చెప్పావు, ఆత్మా౽నాత్మల విషయంచెప్పటంవల్ల నా మోహంతొలగిం దనిపిస్తున్నది."

2. "నీవింకా అనేక విషయాలుచెప్పావు. ఈ భూతాలు నీనుంచి కలిగించుకొన్నజననం మరణం, నీమహత్తు సంగతులు కూడ చెప్పావు. కాని ఇంకా ఏదోతెలియాలని ఉంది. నీకూ ఈ జీవరాశికీ గల సంబంధం కమల పత్రాక్షకుడవైన నీకు అవుపడేటంత సుస్థిరంగా నేనూ చూడ గలగాలనిపిస్తోంది. ఆదృష్టినాకు పూర్తిగ రావటల్లేదు. అందుకని తృప్తికలగలేదింకా.

3. నీవు ఇంతకు ముందు వివరించి చెప్పిందంతా నిజమే ననే నమ్మకయితేనాకు ఉంది, ఆసంగతులు నామనసుకూ బుద్ధికీమాత్రం తెలిసినయి. ఇంతకు ముందు వస్తువులను చూస్తే అవి నిజంగా వస్తువులు మాత్రమేననిపించేది. ఇప్పుడు అలాకాదనీ—అవీ ఆత్మేననీ తెలుస్తున్నది యోచిస్తే. కాని అవివస్తువులేననిపించినంత దృఢానుభూతి అవి ఆత్మే ననే విషయంలో కలగటల్లేదు. ఆయనుభూతి కొరకు నీ జగదాత్మ స్వరూపాన్ని నాకు దర్శనంచేయరాదా?

ప్రస్తుతం అనాత్మను చూచి అది వాస్తవమేనని ముందుకు వెళ్ళిపోతున్నాం. ఈ అనుభూతి మనః స్థాయిలోనే, చక్షురింద్రియస్థాయిలోనే,

పొందటం మనకు అభ్యాస మయిపోయింది. అలాటిది పోయి ఇంద్రియా తీత మయిన విషయాలను అనుభూతిచేయటం సాధనద్వారా అభ్యాసం చేసికోవాలి. అది సాధన.

4. ఆసాధన ఇప్పటి వరకూ అర్జునునకు అందలేదు. ఇప్పుడు అదృష్టవశాత్తు సర్వఫలదాతగా శ్రీ కృష్ణుడు ఎదుట సాక్షాత్కరించి ఉన్నాడు. అప్పుడర్జునుడు అడుగుతాడు-"నేను చూడవచ్చు ననుకొంటె ఆదృష్టినాకిచ్చి చూపించు" మని. ఇంతకూ అర్జునుడి కయితే ఆ విశ్వ దర్శనానుభూతికలగబోతోంది. మిగతా వారి కెలాగ? వారు అభ్యాసం చేసినమీదటనె-సాధనద్వారానే-ఈ అనుభూతిని పొందాల్సిఉంటుంది.

చెప్పిందివిని ఆవగతం చేసికొని-మర్చిపోక-తదుపరి విష యాన్ని తెలియాలనే ఆసక్తి కలిగిన శిష్యునిమీద గురువున కెంత ప్రేమ కలుగుతుందో ఈ కృష్ణార్జునుల గురుశిష్యసంబంధం గమనిస్తే తెలు స్తుంది. పదవ అధ్యాయంలో శ్రీకృష్ణుడు తానే భగవంతుడనే బాహ్యం గాకూడ అనుభూతిచెంది అన్నిటిలోతానే వ్యక్తమవుతున్నట్లు చెప్పాడు. అది సాధారణ మానవ మనస్తత్వంతో మాత్రమె చెప్పింది కాదు. గురు వుకు ఇంకా ఇంకా చెప్పాలనె ఉంది. కాని ఇలా అన్నాడు-చెప్పటం అన వసరం. ఇక నంతా. నీవు తెలిసికొనుమని మాత్రం మాటలుముగించాడు ఇప్పుడు శ్రీకృష్ణుడు యేప్రశ్నవేసినా సమగ్రమైన సమాధానం చెప్ప టానికి ఉద్యుక్తుడై ఉన్నాడు. ఆసంగతి అర్జునుడికి అవగతమయింది. కాని తాను ఏది అడుగుదామన్నా తనసందేహాలన్నీ బుద్ధికితెలియ జెప్ప టం ద్వారా తీరిపోయినయి. సందేహాలు జనించేది బుద్ధిలోనేగదా! అందుకని వెనక చెప్పిన విషయాలు తిరిగితాను చెప్పి, అవి అర్థమయినా యనిచెప్పి-"నీమహాత్మ్యంతో ఈ సర్వప్రపంచాన్నీ ఆవరించి ఎలా ఉన్నావో అవి నాకు అనుభూతి అయేవిధంగా దర్శనంచేయు"మని కోరు తాను అనుభూతస్థితిలో సందేహాలు రావు; ఎందుకనంటే అది కార్యకారణ సంబంధం పై ఆధారపడి ఉండదు. కేవలం అనుభూతిమాత్రమే అంతే-

అనిపించటం మాత్రమె బుద్ధి స్థితిని దాటి అంతర్గతంగా సాధనచేసి అనుభూతి చేసేటప్పుడు—అదె నిజము. ఆదేవాస్తవము. అలాకాక, బుద్ధికి బాహ్యస్థాయిలో, మనసులో అలా ఊరికె అనిపించినట్లయితె—అది మూర్ఖ స్థాయిఅవుతుంది బహుశ. అందుకని బుద్ధికి పైగల స్థాయికి పోవటానికి సాధనా, గురువూఅవసరం. గురువును చేరి నాకు జ్ఞానం ప్రసాదించు మనటం—"తద్విద్ధి ప్రణిపాతేనపరి ప్రశ్నేన"అనేది ఇదె. దివ్యదృష్టితనకు కలిగిన క్షణాన శుద్ధబుద్ధివై పుతిరిగిన అధియజ్ఞుడే తనకుగురువై అనుభూతినీయటం జరుగుతుందన్న మాట.

5-6 ఏమడిగినా సమాధానం ఈయడానికి సిద్ధంగాఉన్న శ్రీకృష్ణుడు వెంటనే అంటాడు. "అలాగే కానీ చూడు. నాలోసర్వమూ ఎలా ఉంటున్నదో వందలు వేలు సహస్రాలు అయిన నానావిధాలైన దివ్యాలైన రూపాలుచూడు, నానావర్ణాలను ఆదిత్యులను వస్తువులను ఇంకారుద్రుల్ని అశ్వినీదేవతల్ని మరుత్తుల్ని అందర్నీచూడు. అంతేకాదు ఇతః పూర్వం నీవు ఎరుగని పెక్కులైన ఆశ్చర్యకరమైన విషయా లన్నింటిని చూస్తావుగాక. అంటేనీస్మృతితో సంబంధంలేని విషయాల యినాసరె అలోచించిచూచి అనుభూతిచేయగలవనిధ్వని.

7-8 ఈ జగత్తంతా చరాచరాలన్నిటినీ ఒకచోటకుతెచ్చి ఉంచి నట్లు నాదేహంలో ఇక్కడ చూస్తావుగాక ఇంకా ఎలా ఎలా చూడాలని నీవనుకొంటావో అదంతా నీకు తెలియబడుతుందిగాక. నీ వెలా అను కొంటావో ఆలా అనటంలో గొప్పవిషయం ఉందనిపిస్తుంది. "నేను చిత్ స్వరూపాన్ని. నా సంకల్పమె ఈ జగత్తు దానిని నీమనసు లేదాఅంత రంగం ద్వారా లోనికి చూస్తున్నాను. కన్పింపజేస్తున్నాను నీఅంత రంగం నీకె. అందుకని నీవునాతో యేకీభవించి చూడు నీవు కోరుకొన్న వన్నీ. భగవంతునితో, చిదాభాసునితో నీవువానితోపాటు కలిసిచూడు. వానితోపాటు సంకల్పించు. సర్వప్రపంచం నీసృష్టిఅయి అవుపడుతుంది అని భావం. ఆలాగె అయింది కూడ. తన ఎదుట ప్రపంచాన్నంతనూ

అర్జునుడు శ్రీకృష్ణుని శరీరంలో చూడబోతున్నాడు. ఇదె అంతర్దృష్టి కయినసాధన, "నేను" ఎవరో "నీవు"తెలిసి కలిసిపోఅనిబోధ.అహం యొక్క మూలాన్వేషణ అనే సాధన ఇదె. శ్రీభగవాన్ రమణమహర్షి మాటల్లో ఇక ఉండేది "నేను" కాదు.తత్ అనే భావనుండాలి. నేను అనే అహంనశించి బుద్ధిస్థాయినిమించి అనుభూతి అవటం ఇక్కడ ప్రధానం. ఈ సంగతులను నీవు నీ చర్మ చక్షువులతో దర్శించలేవు. ఇదిదివ్యమైన దృశ్యంకావటంచేత నీకు దివ్యదృష్టికావాలి. అది నేను నీకు ప్రసాదిస్తున్నాను.ఐశ్వరమైనదంతా చూడునాలో అన్నాడు.

9. మహాయోగీశ్వరేశ్వరుడైన శ్రీకృష్ణుడు అలా చెప్పి అర్జునునకు విశ్వరూపాన్ని దర్శింప జేశాడు. ఆవిశ్వరూపమెలా ఉందో సంజయుడు వర్ణిస్తున్నాడు, ఈ సంజయుడికి యుద్ధరంగంలో ఎక్కడెక్కడ ఏం జరుగుతున్నా కనిపిస్తుండడమేగాక ఎవరి మనసులలో ఏఊహాలున్నాఅవన్నీ కళ్ళకు గట్టినట్లు కనపడజేసికొనగలిగే మహత్తరమైన శక్తి ఉంది. ఆశక్తిని వ్యాసభగవానుడు ఈయనకు ప్రసాదించాడు. సంజయుడుయోగి,ఆరాధకుడు అనిపిస్తుంది అందుకే శ్రీకృష్ణుని గూర్చి చెప్పేటప్పుడు యోగీశ్వరేశ్వరుడని అంటూ ఉంటాడు. అర్జునునకు ఎలా అనుభూతి అవుతున్నదో అలాగే అతడికికూడ విశ్వరూపం దర్శనం అవుతోంది.సంజయుడుధృతరాష్ట్రునకు వర్ణించిచెపుతున్నాడు.

10. అనేకమైన ముఖాలు నోళ్లు రూపాలు ఉన్నాయి. బహువిధాలైనవి, అద్భుతమైనవి, వివిధమైనవి, దివ్యమైనవి. అలంకారాలతో కూడిఉన్నాయి ఆరూపాలు. దివ్యాస్త్రాల నేకాలతో కూడి ఉన్నాయి.అన్నీ కనపడుతున్నాయి ఈ ప్రపంచంలో ఉండే నానాజాతులైన జీవరాసులూ కూడ ఒకేచోట అర్జునుడు చూడటం అయింది మొదట.

11. వెంటనే భగవంతుని మహాత్మ్యదృష్టికివచ్చినట్లు సంజయుడు చెప్పిన వర్ణన నడుస్తుంది. "దివ్యమైనమాలలు వస్త్రములు ధరించి

ఉన్నాడు ఆభగవంతుడు. దివ్యమైన గంధపుపూతలు కన్పడుతున్నాయి. సర్వమూ ఆశ్చర్యమయమై దీప్తిమంతమై అంతులేనిదై విశ్వరూపం అవుపడుతున్నది. ఒకక్షణాన భగవంతుడని అర్జునుడనుకొంటున్న చూస్తూ, మరొకక్షణాన ఈ సర్వప్రపంచమూ, ఒకేసారి ప్రత్యక్షమవుతున్నది.

12–13. ఆకాశంలో వేయి సూర్యులొక్కసారి ప్రభాపూర్ణంగా ఉదయించినప్పుడు కలిగే కాంతి ఆవిశ్వరూపుడి కాంతితో సమానమని చెప్పచ్చు. ఈ జగత్తు అంతా ఒకేఒకచోట విడివిడిగానయి ఆమహానుభావుని శరీరంలో–దేవదేవుని శరీరంలో–నిల్చిఉండటం అర్జునుడు దర్శించాడు. తాను చూస్తున్నది ప్రపంచాన్నా? ఈ భగవంతునా?అనేది తెలియటల్లేదు.ప్రపంచమూఉంది,భగవంతుడూ ఉన్నాడు తనకుకనపడే దాంట్లో.అది వేరూఇదివేరూ అని రెంటినీ వేరుచేయ గలగటంలేదు తాను ఆస్థితిలో. అతడు భగవంతుడే సందేహంలేదు. కన్పడుతున్నది ప్రపంచమే అబద్ధమేమీలేదు.సత్ అసత్‌లు అనబడేరెండూను ఉన్నయ్యే కాని ఇదీదివ్యదృష్టి కలిగిన అర్జునునకుకలుగుతున్నఅనుభూతి.సాధకుడు అభ్యాసంవల్ల ఈప్రపంచాన్నంతనూచూసి భగవంతుని గుర్తించినట్లైతే అర్జునునకు కలిగిన అనుభూతితో సమానమయిన అనుభూతి పొందటం అవుతుందనిపిస్తుంది.

14. అప్పుడెలా ఉంటుంది సాధకునకు? అర్జునునకు? విస్మయస్థితి కలుగుతుంది అర్జునుడు అందుకె ఆశ్చర్యాన్వితుడైఉన్నాడు. పులకాంకితుడై ఉన్నాడు వెంటనే శిరస్సువంచి ప్రణమిల్లినాడు. కేల్మోడ్చి నమస్కరించాడు. అప్పుడంటున్నాడు.

15–16. ఓ దివ్యమూర్తీ! నీదివ్య దేహంలో సర్వభూతాలనూ స్థావర జంగమాలనూ చూస్తున్నాను. కమలాసనస్థుడైన బ్రహ్మనూ, ఈశ్వరుని. ఋషులనూ అందరనూ చూస్తున్నాను. దివ్యసర్పాలనుకూడ

చూస్తున్నాను. ప్రపంచపరంగా సర్వమూ కనపడుతోంది. ఒకవిధంగా నీవే వీళ్లుగాఅయినావు.విరాడ్రూపుడవైన నిన్నూచూస్తున్నాను. అసంఖ్యా కమైన చేతులూ ఉదరాలూ ముఖాలూ నేత్రాలతోసహా అనంత రూపు డవైననిన్నూ దర్శనం చేస్తున్నాను. ఈ ప్రపంచ వస్తువులకయితే ఎక్కడికక్కడె అంతం కనపడుతున్నది కాని భగవాన్! నీకు ఆది మధ్యం అంతం ఎక్కడ అనేసంగతి తెలియజాలకుండ ఉన్నాను.అలా నీ ప్రత్యేకత తెలుస్తున్నది. ఈ మొత్తం విశ్వంకన్నా నీవుగొప్ప అనేది చూస్తున్నాను.

17-20 నాకు కనపడే యీ ప్రపంచాన్ని ఆవరిస్తూ కిరీటంగదచక్రం ధరించిన ప్రకాశమానమైన తేజోరాశివైన నిన్నుచూస్తున్నాను. నీప్రభా దీప్తి ఉజ్జ్వలమై దుర్నిరీక్ష్యమై సూర్యునీ అగ్నినీమించిఉన్నదిఅపరిచ్ఛి న్నుడవై అంతటా నిండియున్ననిన్నే నేనుచూస్తున్నాను.నీవుఅక్షరుడవు శ్రేష్ఠుడవు జ్ఞేయమేదో అదేనీవు అని నాకుతెలుస్తున్నది. ఈజగత్తునకు ఆధారమైనవాడివి. అవ్యయుడవు ఈ ప్రపంచం వ్యయం ఆయినపుడు గదా నీవువ్యయంకావటమనేప్రసక్తి. ఈ ప్రపంచంఎప్పుడైనాఅంత మవుతుందా కాదాఅనేది నాకుతెలీటల్లేదు. కాని ఒకవేళ యీ ప్రపంచం వ్యయమైనాగానీ నీవుమాత్రంవ్యయం కావటమనేదిఅసంభవమని తెలు స్తోంది.నీవు పురాణపురుషుడవు;పరమాత్మవు అనినాకుతెలుస్తున్నది.నీకు ఆది అంతం ఉండటం అనేది లేదు. అందుకని మధ్యం ఉందని చెప్ప టానికే అవకాశం లేదు. అఖండమైన శక్తిశాలివి నీవని తెలుస్తున్నది. ఒకొక్క నీచేతికి ఎంత బలవిశేషం! అలాంటివెన్ని చేతులు అసంఖ్యా కమైనవే! సూర్యచంద్రులేనీనయనాలు. అగ్ని నీనోటినుంచి వెలువడు తున్నది. నీదైన స్వంత కాంతితో ఈ విశ్వాన్నంతనూ ప్రజ్వలింప జేస్తున్నావు! అలానాకు దర్శనమవుతోంది.

ఈ భూమీ ఆకాశాల మధ్యనున్న ఈ వివరమంతా నీ ఒక్కని చేతనే వ్యాప్తమయి ఉంది. దిక్కులన్నీ నీయందె అణగిపోయినవని

పిస్తున్నవి. ఈ ప్రపంచం అనే దానిలోని చిన్ని చిన్ని భూతాలు ఈమహో మహోగ్రరూపాన్ని చూచిన క్షణాన, ఆశ్చర్యకరమైనతేడా గమనించిన నిముసాన, మహాభయంతో తల్లడిల్లి పోతవని తెలుస్తున్నది. నీయిచ్ఛా సంకల్పం ప్రకారమే ఈ బ్రహ్మాదులు తామూ సంకల్పించి సృష్టిస్తు న్నారు అనిపిస్తోంది. అలా ప్రతి అణువునకూ నీసంకల్పమే ప్రధాన మైఉంటోంది.

21-25 ఈ స్వార్థ భూయిష్ఠులయిన దుర్యోధనాదుల సమూహం వసువుల అంశాన జనించిన భీష్ముడు మొదలైన సురసంఘాలు అన్నీ కూడ నీయందే ప్రవేశించిఉన్నవిగ అవుపడుతున్నాయి, భయపడిన వారు కొందరు బద్ధాంజలులై స్తుతిస్తున్నారు. మహర్షి సిద్ధసంఘాలు ఈ ప్రపంచాలకుశుభంకలగాలని స్వస్తిచెప్తున్నారు. వీళ్లుమాత్రం భయపడట లేదు, సంపూర్ణస్తోత్రాలతో నిన్నుపొగడుతున్నారు. రుద్రులు, వసువులు సాధ్యులు, విశ్వేదేవతలు. అశ్వనీకుమారులు, మరుద్దేవతలు, పితృ దేవతలు యక్షరాక్షస సిద్ధసమూహాలు అందరూ ఆశ్చర్యంతో నిన్ను చూస్తున్నారు. నీ మహోగ్రమైన అసంఖ్యాకమైన బాహువులు, ఊరు వులు, పాదములు, ఉదరాలు, కోరలు ఈ విశ్వపూర్ణమైన రూపంలో చూచి ఈ ప్రపంచంలోని వాళ్ళంతాభయపడిపోతున్నారు. నేనూభయాన్నే అనుభవిస్తున్నాననిపిస్తోంది. ఆకాశాన్నంటుతూ, దీప్తులను వెదజల్లుతూ రంగులమలుపులతో విరాజిల్లి నోళ్లుతెరచి, కన్నులువిప్పి, ఇంత గం భీరంగా భయంకరంగా కనపడేనిన్నుచూచి ధృతిచెడగొట్టుకోకుండా ఉండగలవాడెవ్వడో తెలియటల్లేదు. నేను నిన్నుచూస్తూ శాంతినిపొందు తున్నానా అనేది సందేహమయిపోతోంది. శాంతినిజానికి కల్గటల్లేదు.

ఇప్పుడు అర్జునునకు-సర్వమైనవిశ్వాలూ భగవంతునిలో ఎల్ల ప్పుడూ ఉండేవే ననే సత్యవిషయం తెలిసింది. అదేశాంతికలగ వల సిన సమయం. జ్ఞేయవిషయం తెలిసినప్పుడు శాంతి కలుగాలి నిజానికి.

లెక్క చేయటానికి పథకం తెలియంగానే విద్యార్థి శాంతి పొందటల్లేదా! కాని అర్జునుడు శాంతి కలుగటల్లేదంటున్నాడు. ఏమిటి కారణం? ఈ జ్ఞేయం అభ్యాస పూర్వకంగా అతడికి తెలిసినది కాదు. చర్మ చక్షువుకు సినిమావలె దివ్యచక్షువుకు తనకు కన్పడింటే అనిపిస్తో ఉండచ్చు. ఇంకా అనుభూతికావాల్సి ఉందన్నమాట. అందుకని ఈ క్రొత్త అనుభవాన్ని తరిచి తరిచి అర్థంచేసికొంటున్నాడు అర్జునుడు, ఈ దుర్యోధనాదులు, ఈ యుద్ధయోధులు అంతా అక్కడ ఉండటం చూస్తున్నాడు. అంటే భగవంతుడు అంటూనే తనచుట్టూ ప్రపంచం జ్ఞాపకం వస్తుండే స్థితిలో ఉన్నాడు. ఇక చుట్టూ చూచి భగవంతుని అనుభూతి చేసేస్థితికి ఎక్కాలి. అంతర్గతమైన చిదాకాశం భగవంతుడనితెలియాలి. దానితో తాదాత్మ్యం పొందాలి. జ్ఞానంఇదె. దానిని పొంది అనుభూతినంది అప్పుడు ప్రపంచాన్ని తిలకించాలి. అర్థంచేసికొనాలి. ఇప్పటి వరకూ ఆత్మ 'నేను అనుకొంటుంటే ఇకనుంచి అతత్ 'చిదాకాశం' తాను అనుకొని మసలాలి అప్పుడు ప్రపంచంలోఉన్న దేనైనా భగవంతుడనె ఆ 'తత్' అనె చూస్తాడు. రూపం: చట్టీ అబద్ధం అని మిథ్య అనీ తెలుస్తాడు. అది జీవన్ముక్త స్థితికెక్కటమె. అంతర్గతంగా ఉన్న నేను ఆత్మేను భగవంతుడేను అని చూడటానికి ప్రయత్నం చేయటమె. అంతర్దృష్టిఅహంయొక్క మూలాన్వేషణ మంటారు శ్రీభగవాన్ రమణ మహర్షి. జీవన్ముక్త స్థితికి ఆరోహణ మార్గమదె. ఈ ఆరోహణం ఎలాజరుగుతుందో గమనించాలి. జరగబోయే ప్రచండయుద్ధమంతా భగవత్సంకల్పమనేఅర్థం అర్జునునకు అవగతంకావటమె ఈ దృశ్యఫలం.

ఇంక భయంకరమైన దృశ్యాన్ని వర్ణిస్తున్నాడు అర్జునుడు. "దేవా నీదంతాలు ఎంతో క్రూరమై వికృతమైఉన్నాయి. ప్రళయాగ్నిలా నీనోటి నుండి అగ్నిజ్వాలలు బయటకు వస్తున్నాయి, తేజోపూర్ణమై సర్వత్ర ఆక్రమించియున్న నీముఖాలు చూస్తూ దిక్కులేవో తెలియ

లేని స్థితిలో పడుతున్నాను ప్రభో! ప్రసన్నుడవుకా! నేనుచూడలేను— అంటూనేచూస్తున్నాడు. అప్పుడు విశ్వరూపంలో ఏంజరుగుతోంది?

26–31 విశ్వరూపంలో కదలిక ఆరంభమయింది.ఇంతవరకూ అందులో ఉంటున్నవని మాత్రమె కనుపడినవి. ఇప్పుడు కదలిక తెలుస్తున్నది అర్జునునకు. దూరంనుంచి ఒకబొమ్మలా ఉన్న ఆకారం దగ్గరకు వెళ్ళిన కొద్దీ అందులోని అరలూ,మరలూ విడివిడిగా అవుపించి చలనంపొందుతున్నట్లు అయింది, అర్జునుడు అందు కన్పడిన వారంతానిలాఉన్నారో ఏంచేస్తున్నారోఏదిచెయ్యలేకపోతున్నారోతెలియ గలుగుతున్నాడు, అందులోతనూఉన్నాడు.అంటే తత్ తప్ప తనువేరే లేదనేది గ్రహించాల్సిన అంశము.

ఈ నృపాల సంఘంతోసహా ధార్తరాష్ట్రులందరూ భీష్మ ద్రోణ కర్ణులు సహా ఆవిశ్వరూపంలో ప్రవేశిస్తున్నారు. వాళ్లుఎవరి ఇష్టాన్ననుసరించివాళ్లు వెళ్ళలేకపోతున్నారు. తమతమ ఇచ్ఛలకు అక్కడ ప్రసక్తి పరిపూర్తికల్గటల్లేదు. ఒకానొక నదిలోని నీటిబిందువులు ఎలా ప్రవాహాన్ని మాత్రమే అనుసరించి అవశమై మహాసముద్రంలో పడటానికి వెళ్ళిపోతాయో ఆలా ప్రవేశిస్తున్నారు.ఆప్రవేశించె ప్రదేశమేమిటా! అది విశ్వరూపుడవైన నీనోటి వివరం. ఆ క్రూరమైన దంతాల పళ్ళ మధ్య సందుల్లోకి ప్రవాహంలా వెళ్ళిపోతున్నారు కొందరు ఆ పళ్ళసందుల్లో ఇరుక్కుపోయి శిరస్సులు పగిలి నలిగి చూర్ణమై కొట్టుకుపోతున్నారు ప్రవాహంలో!

మిడతలు ఎలా అతితొందరతో మండే అగ్నిపైకురికి చస్తవో అలా మూడులోకంలోని జనులందరూ చావటానికే నీముఖంలోకి ప్రవేశిస్తున్నట్లు తెలుస్తున్నది.వీరందరినీనీవు ఆ ప్రకాశవంత మయిన నోటితో మింగివేస్తున్నావు, నాలుకలుచాచి మరీ అందుకొని నోట వడవేసి కొంటున్నావు. నీఉజ్జ్వల కాంతితో ఉష్ణముతో యీ ప్రపంచాన్నితపిం

పజేస్తున్నావు మహానుభావా! నీకు నమస్కారము. ఈ ప్రపంచస్థితికి కారణము పైన నీవు ఇలా నాశనం కలిగిస్తున్నావా? ఉగ్రరూపుడవైన నీవెవరో నాకు చెప్పవలసింది.నాకు ఆ విషయం తెలియాలనిఉన్నది. ప్రసన్నుడవు కావలసింది." అన్నాడు.

అప్పుడు భగవానుడు అన్నమాటలను అర్జునుడు వింటాడు. తిరిగి శ్రీ కృష్ణుడు అర్జునునకు కర్తవ్యాన్నిబోధిస్తాడు.

32-34ఈ శ్లోకాల్లో భగవంతుడు అర్జునుడికి ఇచ్చిన సందేశమే కర్మయోగి భక్తుడై ప్రపంచంలో భగవంతుని దర్శించేటప్పుడు కలిగే జ్ఞానం అనిపిస్తుంది.

భగవంతుడంటున్నాడు, "ఇప్పుడు నేను కాలుడను లోక సంహారకుడనై విజృంభించి ఉన్నాను. ప్రాణుల్ని సంహరించడానికి ఆరంభించాను. ఈ శత్రుపక్షంవాళ్ళంతానశించిపోతున్నారు చూడు. ఈ పనికి కారణం నాసంకల్పం.ఈ ప్రపంచంలో ఏంజరుగుతున్నా ముందు నాసంకల్పం ఉంటుందనేది జ్ఞాపకముంచుకొను. ఈ ప్రపంచనడక, నాసంకల్పంలో ఉన్నదనేది తెలిసికొను, అందులోని కష్టనష్టాలు మీ మీమనసుల్ని అనుసరించి మీరు సహిస్తారుగాక,

"అందుచేత నీవు నాసంకల్పంతో ఏకీభవించు, కీర్తిగడించు. కష్టనష్టాల నుండి విడివడు. శత్రువులను జయించి నిష్కంటకమైన రాజ్యాన్ని పొందు. ఈ చేయడంలో నీవు వట్టినిమిత్తమాత్రుడవేఅయి ఉంటావు.ఈ స్థితిలో ఉన్నావు కనక నీ కర్తవ్యం యుద్ధంచేయడమే. ఇంకో మార్గంలేదు." (వెనక్కుతిరిగితె సేనాధిపతి అయిన భీముడు చంపి పారేయటం తథ్యం అనిధ్వని) ఆమాటకొస్తే అసలు అర్జునుడే వెనక్కుపోలేడుగాక, పోయేవాడైతె పారిపోయేవాడే ఈ పాటికి.ఈ భగవద్గీతా చర్చకుస్థానం లేకపోయేది భారతంలో.

"జరగబోయే దేదో నాలో గమనించావుకదా! వాళ్ళంతా ఇంతకు పూర్వమే నాసంకల్ప ప్రభావం చేత నిహతులయినారనేది జ్ఞాప

ముంచుకొను. ఈ భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు ఇతరవీరులు అంద రనూ నీవు జయించినవాడవై చంపివేయి. విచారపడకు. ఇదినిమిత్త మాత్రమే. నీవు చేయలేకపోవటమనేది లేదు. నీకు నేనుచేసేదే కర్తవ్యము. దానికిభిన్నంగా చేస్తాననీ నీమనసంటె. చిక్కుల్లోపడి సోదిలోకి రాకుండా పోతావుగాక. అందుకని యుద్ధంచెయ్యి అన్నాడు.

అర్జునునకు అపటివ్వరకూ కలిగిన జ్ఞానంతో ఇక నీ బ్రతుకు నడకావలసిందని భగవంతుడు బోధించటం ఇక్కడ గమనీయం. భగ వంతుడెవరో ఎరిగినవారికి కర్మ ఫలత్యాగమనే బోధ ఇక్కడ చెప్ప బడింది. కర్తవ్య కర్మ చెయ్యి. ఫలం ఏమౌతుందనేది నీయోచన కం దేదికాదు. అది చిత్ స్వరూపాధీనం—అంటె—భగవదధీనం అని చెప్తున్నాడు.

35 అర్జునుడు భయ భక్తులతో భగవద్వాక్యాలను విన్నవాడై శ్రీ కృష్ణునికి తిరిగి నమస్కరించాడు. ఇంకా అంటున్నాడు.

36–46 భగవన్! నీ శరీరంలో ఇప్పుడు ఏమేం కనపడుతున్నా యో చెప్పుడునా: నీ మాహాత్మ్యాన్ని కీర్తిస్తూ ఉండటంచేత—నీ ఇచ్చనే యీజగత్తు నడుపుతూ ఉండటంచేత ఆనందాన్నిపొందుతున్నట్లున్నది: ప్రీతిని పొందుతోంది. రాక్షసులు భయపడి నాల్గు ప్రక్కలకు పారి పోతున్నారు. నిన్నుకీర్తించే సిద్ధులు అంటటా నీకు నమస్కరిస్తున్నారు అర్జునుడు తనకు ఆయిన అనుభూతిని తిరిగి గురువుకు చెప్పి తనలో స్థిరం చేసుకొంటున్నాడు.

ప్రభో: అనంతా: ఈశ్వరా: జగదాశ్రయా: బ్రహ్మకంటె ముందేఉన్న గొప్పవాడవయిన నీకు దేవతలు మాత్రమెందుకు నమ స్కరించకుండా ఉంటారు: సత్‌నకూ అసత్‌నకూ పరమైన ఏ అక్షరమైన బ్రహ్మముందో అదే నీవు కదా!

నీవే ఆది దేవుడవు. పురాణ పురుషుడవు. ఈ విశ్వానికంతకూ ఆశ్రయుడవు. తెలిసినవాడవు తెలియబడవలసినవాడవు. జ్ఞేయమవు.

పరం ధామ మవున్నా. నీ చేత జగత్తంతా వ్యాపించబడి ఉన్నది.

నీవే వాయు, యమ, అగ్ని, వరుణ, చంద్ర, ప్రజాపతులు అందరును. బ్రహ్మదేవుని తండ్రివే నీవు. నీకు వేయిపర్యాయాలు నమస్కారిస్తున్నాను, మళ్ళీ మళ్ళీ నీకు ప్రణుతి చేస్తున్నాను.

సర్వమూ ఆక్రమించి ఉన్నావు నీవు, నాముందు—వెనక—ప్రక్కన పైన—క్రింద—సర్వత్ర ఉన్న అనంతుడవు. అమిత విక్రమపూర్ణుడవు. సర్వం సమాప్నోషివి. సర్వ ప్రదేశాలలో సమానంగా హితుడవై యున్నవాడివి. అందుకని నిన్ను సర్వుడవనాలి" ఇదీ అత్యంత గరిష్ఠమైన అనుభూతి అర్జునునకు అందినట్టిది. దీనికోసమె మనం చేయాల్సిన సాధన. ఇంకా అంటున్నాడు.

అలాంటి మహానుభావుడవని మహాత్ముడవని ఇంతకు పూర్వం నేనెరుగను. ప్రమాదవశం చేతగాని నీయందున్న స్నేహభావంచేతగాని, ఓ కృష్ణా! ఓ యాదవా! ఓ సఖుడా! అనితిరస్కార పూర్వకంగా ఏమేమో పలికి ఉంటానుగా. విహార శయ్యాసన భోజనసమయాల్లో గాని ఒంటరిగా ఉన్నప్పుడుగాని ఇతరులతో ఉన్నప్పుడుగాని పరిహాసార్థముగగాని నాచే ఎలా అసమ్మానితుడవై ఉన్నావో చెప్పలేను ఎరుగను. అందుకునన్ను క్షమించవలసింది.

ప్రభో! అతులనీయ శక్తిమంతుడా! ఈ చరాచరాత్మకమైన జగత్తుకు నీవు స్రష్టవు. పూజనీయుడవు. గురుడవు. శ్రేష్ఠుడవు. ముల్లోకాలలో నీకు సమానుడయినవాడే లేడు. ఇక నిన్ను మించిన వాడెవడున్నాడుగనుక

అందుకె నా యీ శరీరం వంచి నమస్కరిస్తున్నాను. ఈశ్వరుడవు వందనీయుడవు అయిన నీవు నన్ను అనుగ్రహించవలసింది. తండ్రి బిడ్డలను అనుగ్రహించినట్లు స్నేహితుడు హితుని ఆదరించినట్లు ప్రియుడు ప్రియురాలిని మన్నించినట్లు నా అపరాధాలను నీవె క్షమించాలి.

..దేవా ఇతః పూర్వం చూడని యీ విశ్వరూపాన్ని చూచి

నేను సందేహాలు పోగొట్టుకొన్నాను. సంతుష్టి నందుతున్నాను, భయం చేత నామనసు ఇప్పుడు బాధపడి పోతున్నది. వెనకటి నాభావాలు ఎంత తప్పుభావాలో కదా! ప్రభో! నాకు ప్రసన్నుడవు కావలసింది. పూర్వ రూపాన్ని ధరించాల్సింది. వెనక చతుర్భుజుడుగా గదా చక్ర కిరీటాదు లను ధరించిన వాడుగా చూశాను. ఆరూపమె నేనెరుగుదును. అలా నాకు ప్రసన్నుడవుకావలసింది. ఈ సహస్రబాహువుల విశ్వమూర్తి స్వరూపం ఉపసంహరింపవలసింది—అన్నాడు.

అర్జునునకు సమగ్రమైనఅనుభూతి అయింది.తనకయినబ్రతుకు భగవంతు డెలా నడుపుతున్నాడో చూశాడు. దానినె బ్రతుకులో మళ్ళీ మళ్ళీ తలుచుకొంటూ దానినే ప్రేమిస్తూ హాయిగా బ్రతకవచ్చుననే నిశ్చయం ధైర్యం కలిగింది. అందుకని యుద్ధం చేయడానికి కూడ సంసిద్ధుడైనాడని పిస్తుంది.

47—49 అప్పుడు భగవంతుడు చెప్తున్నాడు—"అర్జునా ఈ రూపాన్నినీవుగాక ఇంకెవరూ ఇంతకు ముందు చూడలేదు. నేను నిన్ను అనుగ్రహించి ఇలాచూపుదామనె చూపించాను. అందువల్లనే ఈ తేజోమయమూ అనంతమూ అనాద్యమూ అయిన విశ్వరూపాన్నిఅంత శ్చక్షువుతో నీవు చూడకలిగావు. ఏ వేద—అధ్యయన—యజ్ఞకర్మలు! చేసినా ఉగ్రమైన తపస్సును చేసినా, మనుష్యలోకంలో ఈ దృశ్యం ఎవరుగాని చూడజాలరుగాక. ఈ అవకాశం నీకే కలిగింది సుమా ఈ రూపంచూసి భయపడకు. చిత్తవైకల్యాన్ని చెందకు. అనేకాద్భు తాలు కలిగిన ఈ విశ్వరూపంలో ఈ రూపంకూడ ఒకటి.ఒకానొకదశ జరిగి తీరేదిస్సీ"

శ్రీ కృష్ణుడు ఇక్కడ కచ్చితంగా చెప్తున్నాడు—ఈవిశ్వరూపం ప్రత్యేకంగా నేను ఈ స్థితిలోనున్న అర్జునునకు అనుగ్రహించిచూపెట్టి నట్టిదని. సాధకులందరకు—అభ్యాసం చేసేవారందరకూ—ఇలా విశ్వ

రూపం కనపడవలసిన పనిలేదు. వారికి ఈ కన్పడే ప్రపంచ దృశ్యమే విశ్వరూపముగా భగవంతు డర్జునున కిచ్చిన సందేశమని తెలియాలి. ఈ ప్రపంచంలోనే వారు భగవంతుని చూడాలి. దర్శించాలి.

50–51 అలా పలికి భగవానుడు తనపూర్వరూపాన్ని అంటే దేవకీ నందనుడి రూపాన్ని పొంది ప్రసన్నుడయినాడు. అర్జునుని ఓదార్చినాడు, అర్జునుడు భగవంతుని నుతించి "నేను సంతోషాన్ని పొందుతున్నాను" అన్నాడు.

52. భగవంతుడప్పుడంటున్నాడు–అర్జునా! ఈ రూపాన్ని దేవతలు కూడ ఎప్పటి కప్పుడు చూడాలని ఆత్మతపడుతుంటారు" అని. జరిగిందీ జరుగుతున్నదీ జరగబోయేదీ ఒక్కసారిగ స్ఫురింపజేసే రూపం ఎవరు చూడాలని తెలియాలనీ కోరరుగనక!! "వేదాలు, తపస్సు, దానం, యజ్ఞం వీటిద్వారా ఈ రూపం చూడటం అశక్యమైనపని. వేదోక్త క్రతువులవల్ల దానమువల్ల స్వర్గాన్ని చేరి దేవతలవలెమనవచ్చునుకాని ఈరూపాన్నిచూడటం మాత్రం జరిగేది కాదు, కేవలం భక్తి ప్రధానమయినచోట ఇలాంటి ప్రత్యేక దృశ్యాలు (visions) సంభవం. అందుకని సాధకులంతా సాధనచేయడమె కర్తవ్యం,

నేను మొదట కర్మపూర్వకమయిన సాధనలు చెప్పాను. అవి అనుసరించి ఆత్మాఽనాత్మజ్ఞానమునుతెలిసి, అభ్యాసంవల్ల ఈ ప్రపంచంలో సర్వత్రనన్ను దర్శించ గలవారికిఈదృశ్యాలు అక్కరనేలేదు. కేవల భక్తి కలిగి జ్ఞానం అభ్యాసంకాని వారికి అనన్యమైన భక్తి కారణంగా నాఅనుగ్రహం కలిగి ఇలాంటిదృశ్యాలు సంభవిస్తవి, అప్పుడు వారు సర్వత్ర నేనెలా వ్యాపించి ఉన్నానో తెలిసి మెట్టు నెక్కగలుగుతారు. నాతో ఐక్యం పొందగలుగుతారు.

55. "కనక పాండవా! నాభక్తుడు కావటం నాకొరకు కర్మలాచరించటం నేనే (మత్పరమః) పరమగతిసని తెలియటంఇదీసాధన. ఆ

పైన ధన మిత్ర పుత్రాదుల యందు ఆసక్తివదలి, సర్వభూతాలపట్ల శతృత్వభావమనేది లేకుండటం కలగాలి. శతృత్వభావం వుంటే నన్ను (తత్‌ను) మరచినవాడయిపోతాడుకదా!" నేను నాదేవుని కొలుస్తున్నాను మిగతావాళ్ళు ఇంకోదేవుని కొలుస్తున్నార" నటంకూడ పనికిరాదు. ఆ స్థితిని సాధించినవాడు నాసమాదె నన్నే పొందుతాడు. ఇదేపరమమైన విషయం." అంతర్దృష్టిసాధనవల్ల అహం "నేను"తో (ఆత్మతో) చేరి నశించిపోతుంది. అపైన ఆత్మే జీవన్ముక్తుని జీవితం నడిపేది. అతడికి అహంలేదనిబోధ. ఇది మనలో జీర్ణించాలి.

ఈ అధ్యాయంలో నడచిన బోధకు ప్రాతిపదికగా వెనకటి అధ్యాయాల్లో చెప్పింది జ్ఞాపకం చేసికొనాలంటే.-ఆత్మా-అనాత్మ వివేకం, త్యాగపూర్వకంగా మాత్రమే కర్తవ్య కర్మలను చేయటం,ఆత్మా అనాత్మా కూడ బ్రహ్మమేననీ, అది సర్వత్రఉన్నదేననీ, ప్రకృతి (అనాత్మ) త్రిగుణాత్మకమై తన స్వభావాన్ననుసరించి ప్రపంచవ్యవహారాలను నడుపుతుంటున్నదనీ-ఈ సర్వప్రపంచాలూనడిచేనడక ఈశ్వర సంకల్పంప్రకారమేనడుస్తున్నదని-తెలియాలి. వ్యక్తి తన శరీరం వదలబోయేముందు-రాబోయే జన్మ ఎలాఉంటుందో-లేదా ఉండా లోనని ఊహించక భగవంతునే స్మరిస్తే వానియందు ఐక్యంకావచ్చుననీ అనన్యమైన భక్తితో ఉండేవారికి అది సాధ్యమనీ వారియోగ క్షేమాలు తానే (భగవంతుడే) చూసుకొంటాడనీ చెప్పారు. ఏవస్తువును చూసినా అందులోని విభూతిని చూచి తానని గ్రహించి ప్రేమించుమనీ అదే భగవంతుడనీ-కేవలం భక్తి-ప్రేమ కల వారికి తన అనుగ్రహంవల్ల విశ్వరూపం వంటి దృశ్యంకలిగి లేదా అర్థం తెలిసిజ్ఞాన విషయం అవగత మవుతుందని భగవంతుడు చెప్పాడు నేను. కాదు శాశ్వతంగా ఆత్మఅనబడుతూ మనలోఉన్నది తత్ మాత్రమె. ఈ మెట్టునెక్కటం పరాకాష్ఠ.

ఇది పదకొండవ అధ్యాయము.

# శ్రీ మద్భగవద్గీతా మననము



## ద్వాదశోధ్యాయము
## (భక్తియోగము)

### జ్ఞాన భక్తిద్వారా శాంతి కలుగుతుంది.

భక్తిషట్కంలో ఈ అధ్యాయం చివరది. భక్తి అంటే అంతర్దృష్టిద్వారా సాధకుడు తన మనసును బుద్ధిలోచేర్చి దాని నుండి సమష్టి మనసును—(Total mindను) అంటే భగవంతునిచూచి సేవించటమె అని సూచించారు. అలా ఆభగవంతుని చూడగలిగితె అతడినుంచె ఈ సర్వ ప్రపంచమూ ఉత్పన్నమయిన సంగతి అవగతమవుంతుది. ఆ సమష్టిమనసులోచేరి ప్రపంచాన్ని చూస్తుంటె సర్వమూతానే—పరమేశ్వరుడే—అయినట్లు, సర్వప్రపంచములోనూ ఆ భగవానుడేఉన్నట్లు అనుభూతి అవుతుందని సూచిస్తూ శ్రీ కృష్ణుడు అర్జునునకు విశ్వరూప దర్శనాన్ని అనుగ్రహించాడు.

అలా విశ్వరూపంచూపి భక్తి ఒక్కటే దీనికి తాళంచెవి అన్నాడు పరమాత్మ. అందుకని అర్జునునకు అభక్తియొక్క నిశ్చితమైన పరమార్థం తెలిసికొనటం తప్పనిసరి అయ్యింది. కేవలం జ్ఞానం తెలియడానికి బుద్ధి సహాయంచాలు. కేవలం కర్మకు శరీరావయవాలు చాలు. కర్మయోగం అనుసరించడానికి బుద్ధి సహాయంతో శరీరావయవాల కృషిసరిపోతుంది. కాని భగవద్భక్తి కలిగితేనేగాని కైవల్యస్థితి నందుకోవటం జరగదు. అందుకని అర్జునుడు శ్రీ కృష్ణుని అడుగుతున్నాడు.

1. శ్రీకృష్ణా, "మత్కర్మకురు" అన్నావు. శరీరంతో ఇంద్రియాలతో నీకైదెన కర్మనుచేయవలసి ఉన్నదని తెలిసింది. "మత్పరమః" అన్నావు. ఆత్మాఽనాత్మ వివేకంచేత ఆత్మను బుద్ధిద్వారా తెలిసి,

సర్వత్ర ఉన్నది ఆత్మేననీ అదేభగవంతుడనీ—అనాత్మ కేవలం రిప కరంవంటిదనీ తెలిసింది. ఇవి మనసుతో బుద్ధితో అనుసంధానంచేయాలి తప్పదు, కాని మద్భక్తః అన్నావు. దీని విశేషమేమిటి? ఈ భక్తి చేయ వలసింది శరీర మనోబుద్ధులతోమాత్రమె అయినట్లు అవుపించటల్లేదే! ఇంకా పై స్థాయిలో చేయాలా?" అన్నాడు.

"భక్తి అంటె భజించటం. భగవంతుడవైన నీ విశ్వరూపం సగుణమై సేవించతగి ఉంటున్నది. అలాటి రూపాన్ని భజించటమా భక్తి—లేక—ఉపనిషత్తులు చెప్పే అక్షరమూ అవ్యక్తమూఅయినబ్రహ్మ పదార్థమును సేవించటమా? ఈ రెండూభక్తియే అయితె ఇందులో దేనిని ఉత్తమమని చెప్పాలి?" అని అర్జునుడడుగుతాడు. శ్రీకృష్ణుడు సమాధానం చెప్పుతున్నాడు.—

2. "నాయందు మనసును ఆవేశింపచేసి ఏకనిష్ఠతో ఉత్తమమైన శ్రద్ధతో నన్ను ఉపాసించేటట్లయితె వారు యుక్తతములని నేను అనుకొంటున్నాను." అంటాడు. మనసు ఆవేశింపకలిగింది సగుణము మీదనె. నిర్గుణ ఉపాసనము సర్వసాధారణంగా కుదరనట్టిది. సగుణారాధనచేసేవారు మనసును భగవంతునియందు నిలపటంఇక్కడిసాధన. విగ్రహం మీదమనసునిలపటంకాదు. అది విగ్రహమన్నేదృష్టిపోయి భగవంతుడేను అనేదృష్టివచ్చినప్పుడే భగవంతుని యందు మనసు ఆవేశించిందని చెప్పగలం ఈ విగ్రహం వట్టిజ్ఞాపకంకోసం పెట్టుకొన్న ప్రతీకమాత్రమేనని బుద్ధిస్థాయిలో ఆలోచిస్తున్నంతవరకూ భగవంతుని పై మనసు ఆవేశించినట్లు చెప్పటానికి వీలులేదు. అసలు విగ్రహ మెక్కడుంది భగవంతునికి భిన్నంగా అనే దృష్టిని అనుసంధానంచేయ గలగాలి. అబ్బో! అలా అయితె ఈ విగ్రహమేదేవుడు అనే మూఢ భక్తినా శ్రీకృష్ణుడు ఉత్తమతరమైన దంటున్నాడు? అని శంకవస్తుంది. "మూఢ" అనే మాట భక్తికితగిలించి అలాఅడిగితె "అబ్బే కాదు–కాదు" అనబుద్ధిఅవుతుంది. మనసును ఆవేశింపచేయటం ప్రధానమని

శ్రీకృష్ణుడు చెప్తున్నాడు. సందేహం లేనట్టి విధంగా మనసును ఆవేశింప జేయాలి. "అయ్యో ఇది రాయిగదా" అనే సందేహంవస్తే- "ఇది భగవంతుడనటం ఎలాగ" అనే సందేహం కలిగితే-మనసు ఆవేశించిన మీదట కలిగిన భక్తి కాదన్నమాటేగదా! మనసులో ఆలోచించిన బొమ్మ సంగతి కూడా ఇంతే. అది వట్టి ప్రతీక అనుకొనేవారి మనసు భగవంతునిమీద లయించినట్లుకాదు. అలాలయించితే "ఇది మూఢ భక్తి అనవచ్చునాకాదా" అనే ప్రశ్నరాదు.

3 – 4 "కాని అక్షరం. అనిర్దేశ్యం, అవ్యక్తంను ఉపాసించేవారి సంగతివిను. ఈ భగవంతుడు సమష్టి మనసు. ఇది సర్వత్రగము, అచింత్యము, కూటస్థము, అచలము, ధృవము. ఈలాటి భగవంతుని ఎలా ఉపాసించటమనేది చెప్పటమయింది. మళ్ళీచెప్తాను విను. ఆఉపాసనను, ఇంద్రియాలను నియమించినమీదట చేయాలి; అన్నిటిపై సమమైన బుద్ధిని కలిగి ఉండటం, చేతనయిన మీదట చేయాలి. అలా చేసేటట్లయితె ఆచేసినవారు నన్ను చేరుతారు. వారు సకల ప్రాణుల శ్రేయస్సునందు ఆసక్తులై ఉండాలి, ఈ యోగ్యతలు కలిగింతరువాతనే ఈ భక్తిని ఆచరించగలుగుతారు. ఎందుకనంటే-ఈ భక్తికి అంతర్దృష్టికావాలి. మనిషికి ఇంద్రియాలు బయటివైపునకె ఉన్నాయి. జ్ఞానేంద్రియాలు బయటినుంచి సమాచారాన్ని సేకరించి మనసునకు అందిస్తవి. మనసులోని సంగతులను బుద్ధిపరిశీలించి తన అనుభావాన్ననుసరించి ఆజ్ఞలను మనసుద్వారా కర్మేంద్రియాలకుజారీచేస్తవి.

ఈ నిర్గుణభక్తికి బయటి దృష్టి అక్కర్లేదు. అంతర్దృష్టేకావాలి అనగా అర్థం, మనసు బుద్ధిద్వారా శుద్ధబుద్ధినిచూడటంకోసం అంతర్గతమైన దృష్టిని అలవాటు చేసికొంటె, ఆ శుద్ధబుద్ధిద్వారా సమష్టి మనసయిన భగవంతుని, దర్శించకలుగుతాడు, ఈ భగవంతుడు సర్వత్రనున్నవాడు, అందరిలోను కూడ ఉన్నవాడు, జీవుడు అనబడే వాడితడె,

కాని పరిమితిని ఆపాదించుకొనటంచేత, జీవుడనబడుతున్నాడు.భక్తుడు (నిర్గుణభక్తుడు) తన శుద్ధ బుద్ధినుంచి భగవంతుని చూడాలి. ఆ భగవంతుడు తనలో ఎలావ్యాపించాడో ఎరుగాలి. తాను ఎవరో తన వైపుచూచుకొనగలిగే దృష్టిఏర్పాటు చేసికొంటేగాని ఆ భగవంతుడందడు, భక్తియు అందదు.

ఈ భగవంతుడు చిదాకాశము అని పిలువబడుతాడు. ఈయన సంకల్పంవల్లనెతన్మాత్రలు కల్పించబడినయి. వీటియందు జీవుడు అభిమానాన్ని పెంచుకొని.పృథివ్యాపస్తేజోవాయు రాకాశాదులను కల్పించి వాటితోసర్వప్రపంచాన్ని సంకల్పసృష్టిచేసి ఆంనదిస్తున్నాడు. భక్తుడి మనసూ బుద్ధీ కూడ ఆయననుంచి వచ్చినవె. అతడి శరీరం అలా వచ్చిందె. ప్రపంచమంతా కూడా అలావచ్చిందె. భగవంతుని స్వప్నమిది. ఇందులో మనం ఉన్నాం, ఎందుకున్నామంటె—మన మనోఆకాశాన్ని చిత్తాకాశమంటారు. చిదాకాశంలో భాగమె చిత్తాకాశం. అలా చిత్తాకాశమనే ఒక ప్రత్యేకప్రతిపత్తి ఉండటంచేత-మనం ఈ భగవంతుని స్వప్నంలో కేవలం పావులుగా ఉంటూకూడ–నేను–నేను అని అహంకారాన్ని వెళ్ళబోస్తూమనుతున్నాము. ఈ చిత్తాకాశంలోని ఆలోచనలు,సంకల్పాలు చిగురింపచేయటం మాన్పి చిదాకాశంవైపుపయనించటమె నిర్గుణభక్తిచేయటం.

ఈ నిర్గుణభక్తిలో అంతర్దృష్టితోకూడిన సాధన అత్యవసరం. బాహిరమైనదృష్టిని నిరోధించి అంతర్దృష్టిలో అనుసంధానంచేయాలి మనసును.నేనెవరు అని విచారణ చేయటం అంతర్దృష్టికి ఒక మార్గం. ఆలా బయటి వ్యవహారమంతా వదలి అంతస్సు చూడటం సామాన్య మానవునకు అందుబాటులోని విషయం కాదనేది జ్ఞాపకంపెట్టుకొనాలి.

నిర్గుణోపాసనకు కొన్నిలక్షణాలను ముందుఅలవరచుకోవలసిన అవసరం ఉంది· 1. ఇంద్రియాలను నియమించటం 2. మనసులో

సర్వభూతాలకూ హితాన్నే కోరుతుండటం 3. బుద్ధితో సర్వత్ర సమత్వాన్ని గమనిస్తూ ఉండటం. ఇలా నిర్గుణోపాసనచేసే అతడు కూడ ఉత్తముడైన భక్తుడే. సందేహంలేదు. ఈ లక్షణాలు సంతరింపబడకుండా నిర్గుణోపాసన చేస్తున్నాననటం సరియైనస్థాయి కాదనిధ్వని. అది మిథ్యావాక్కవుతుందనిసూచన.

5. ఈ నిర్గుణోపాసకులకు శ్రమ అధికము. వీరికి దేహం మీద అభిమానమున్నట్లయితే యీ ఉపాసనే సమకూరదు. వారికి యీ పై లక్షణాలుకలుగవు, చాలకష్టపడవలసి ఉంటుంది. అందుకని ఉపాసన చేయాలనీ ఎలా చేయాలనీ ఆలోచించె మొదటి మెట్టులో ఉన్నవారికి, సగుణోపాసనమే మేలు.

ఐతే యీ బాహ్య భక్తిని గూర్చి మూఢభక్తి యీ ఇది! అని సందేహాన్ని వెలిబుచ్చే వారంటారు. అక్షరము అవ్యక్తము అయిన భక్తిలో – ఆభగవంతుడే అణువులణువులై, ఎలెక్ట్రానులై సర్వత్ర వ్యాపించి ఉన్నాడని తెలిసికొన్నావు. ఆభక్తి నిజమైనదేనంటావా కనీసం? దానిపై నీకునమ్మకం కలిగినక్షణాన ప్రతి అణువులోనూ ఉన్న పదార్థాన్ని భగవంతుడేనున అటానికి అభ్యంతరమేమిటి? ఆ అక్షరమైన భక్తియందెనీకు నమ్మకం లేనప్పుడు నీబాహ్య భక్తి నిర్గుణభక్తి రెంటినీకూడ మూఢభక్తి అనే అనాల్సి ఉంటుంది. అంతకంటె అబద్ధపు భక్తి అవాలి. నమ్మకంలేకుండా భక్తిచేయటం! అది అబద్ధపు బ్రతుకు బ్రతకటం కాదా?

6–7. కాని ఎవరయితే సర్వమైన కర్మలనూ నాయందుసన్యసించి, మత్పరులై, అనన్యమైన భక్తితో నన్ను (తత్ను) ధ్యానిస్తారో వారిని మృత్యుసంసారసాగరం నుండి నేను ఉద్ధరిస్తాను. కర్మలను దేవునియందు సన్న్యసించడమంటే ఎలా? సాధకుడు కర్మయోగి అయి ఉండాలి. అంటె అర్థం కర్తవ్య కర్మలను మాత్రమే చేస్తూఉంటాడు.

రజోగుణ సముద్భవమయే పనులను ఆరంభించడమని అర్థం. కర్తవ్య కర్మలను తాను చేయటల్లేదనీ, తన కర చరణాలద్వారా భగవంతుడే చేస్తున్నాడనే కర్తృత్వభావత్యాగ పూర్వముగా చేస్తుండటమే కర్మలను సన్న్యసించటం. చేసినకర్మయొక్క ఫలం భగవంతునిదేనని కర్మఫల త్యాగ పూర్వకమైన విధంగా ప్రవర్తించాలి.

8. అందుకని నాయందే చిత్తాన్ని నెలకొల్పు. నాయందే బుద్ధిని కూడ నివేశింపజేయి. అలాచేయటంలో సర్వమూ 'నేనే'నని అనుభూతి చెయ్యి, అలాచేస్తే ఇక నీవు నాయందే నివసిస్తూ ఉంటావు. అలా చిత్తాన్ని నెలకొల్పటం బుద్ధిని భగవంతునియందు నివేశింప జేయటం అదె భక్తి. ఈ భక్తిచేయడానికి సాధనలను తరువాతి శ్లోకాల్లో చెప్ప బోతున్నాడు.

మనసులో నన్నేస్థాపించాలి అన్నప్పుడు, ఐదవ ఆధ్యాయంలో (21) శ్లోకంజ్ఞాపకమొస్తుంది. బాహ్యములైన శబ్దాది విషయాలపై సక్తతనువదలి, అంతః కరణంలో విషయాలు అక్కరలేకుండానే కలిగే సుఖంపొందుమనీ అలాంటి వానికి నాశములేని సుఖం కలుగు తుందిఅనీ చెప్పారు. కర్మయోగంలో చెప్పిన ఆ సాధన శరీర మనో బుద్ధుల ద్వారాచేయవలసిందిగా ఉంది. ఇప్పుడీ 8వ శ్లోకంలో చెప్పింది అనుభూతి స్థాయిలోది—అంటే బుద్ధికి అవతలి స్థాయిలోకూడ చేయ వలసిన సాధన ఆమాత్రమెకాదు. బాహ్యవిషయాసక్తి వదలి భగ వంతుని యందాసక్తినిపెంచుకొని అనుభూతి చేలూలని అర్థం.

మనసులోనన్నే నిలుపు. "నేను" ఎవరో తెలిసివానియందు మనసునిలుపు. బుద్ధిలోనన్నె (తత్‌ను) నిలుపు. ఈ సర్వప్రపంచం నేనే కనక నా(తత్)లోనే నివసిస్తున్నట్లు అనుభూతి చెయ్యి. ధీ మనోకాయా లతో భక్తిచేయవలసిందనిబోధ. చిత్తాన్ని సమాధాన పరిస్తే అలా చేయ టం అవుతుంది,

అంతటి సంయమనం లేకపోతె వారిగతి ఎలా అనేదానికి శ్రీ కృష్ణుడు సమాధానం చెప్తున్నాడు—

9. ఆలా చిత్తాన్ని నాయందు నిరంతరం సమాధాన పరచలేక పోతే ఎలాగ? అంటావేమొ నిజమె! ఎప్పుడో ఒకసారి యీ మనసు దోవతప్పుతూనే ఉండటం కద్దు. దానికి మందు అభ్యాసమె. ఉత్కృష్ట స్థితికి ఎక్కాలెనని అభ్యాసం చేస్తుండటమె సాధన. పైన చెప్పినజ్ఞానానుసారం సాధనను నడిపించటమెపని. ఎప్పుడు జ్ఞాపకానికివస్తేఅప్పుడే ధ్యానించుతూ తలుస్తూ ఆస్థితికి ఎక్కుమని ధ్వని.

ఈ సాధనదీ మనో కాయాలన్నిటికీ సంబంధించినదె. ఈమూడింట్లోముందుగా లొంగదీయబడవలసింది బుద్ధి. అది కార్యకారణసంబంధమనే వాదనకు లొంగుతుంది. మిగిలినవి రెండూ అలాలొంగవు. అందుకనె మిగిలిన ఈ రెంటినీ సమాధాన పరచటం కంటె బుద్ధిని సమాధాన పరచటం తేలిక. పూర్వగ్రంథాలను అందుకే చదివి, విని, బుద్ధినిసమాధానపరచాలి. అలాసమాధానపరచడానికెఇప్పటికి పది అధ్యాయాలు భగవద్గీతలో బోధ చేసి చివరకు పదకొండవ అధ్యాయంలో జ్ఞాననేత్రానికి పరమేశ్వర స్థితిని చూపి అది యీ ప్రపంచమేను అని చెప్పిఅర్జునుని బుద్ధిని సమాధానపరచాడు శ్రీకృష్ణపరమాత్మ.

కేవలం బుద్ధితో సాధనచేసెచాలదు. మనసుచేత అభ్యాసం చేయించటమెమార్గం. అలాచేయించకలిగేది బుద్దే. బుద్ధి ముందె సమాధానపడి ఉన్నది గనక, ఆబుద్ధి మనసుచేత అభ్యాసంచేయించగలదు. అలా చేయిస్తె బుద్ధీ మనసులు ఏకమై శరీరం సహకరిస్తె, మూడూ కలసి సాధనచేస్తే, భక్తి పరిపూర్తి అపుతుంది. కాని శరీరమెలాసహకరిస్తుందీ అని శంక.

శరీరం సహకరింపకపోతె మనసూబుద్ధులకు నిష్ఠనిలువదుగాక అందుకె మతం అని చెప్పిన కర్మలను ఎల్లప్పుడూ చేస్తూనే ఉండవలసింది అనె సూత్రం మతగురువులు చెప్పటం. ఆలా చేస్తూఉంటువ్న

వారికి శరీరం సహకరిస్తుంది. సందేహంలేదు. అలా మతంచెప్పిన ప్రకారం చేయని వారి గతేమిటి? వారి శరీరం సహకరించకపోతే బుద్ధి మనసులు సంపూర్ణమయిన భక్తి చేయజాలకపోతవికదాఅనె శంకకు శ్రీకృష్ణుడు తరువాతి శ్లోకంలోసమాధానం చెప్తున్నారు.

10. అయితె మరి అభ్యాసం చేయడం కూడ చేతకాకపోతె ఏం చేయాలి? అలా ఎందుకు చేతకాకపోతుందంటె శరీరంవ్యతిరేకించటం మూలాన అనాలి. కడుపు చేత్తో పట్టుకొని ప్రపంచం తిరిగేవారికి ఈ అభ్యాసంచేయడం ఎలాకుదురుతుంది అనచ్చు. దానికి మార్గ మేమిటంటే.– "మదర్థమపి కర్మాణి కుర్వన్సిద్ధి మవాప్స్యసి" "మత్కర్మ పరమోభవ" అన్నారు. అంటే అర్థం నాకర్మలనుచేస్తే సిద్ధి లభిస్తుందీ అని.

కర్మ యోగులయితె కర్తవ్యకర్మలను మాత్రమేచేస్తూ కర్మ యోగంలో చెప్పిన మనోబుద్ధుల కయిన జ్ఞానం సంతరించి శరీరమనో బుద్ధుల్ని ఒకే మార్గంలో ఉంచగలరు. కాని, కర్మయోగులు కానివారి సంగతేమిటి అని శంక.

వారు భగవంతుని కర్మలు చేస్తుండాలి. గోపురాలు, చర్చిలు గురుద్వారాలు కట్టించటం, భజనలు చేయటం ఉత్సవాలునడపటం అన్న దానాలుచేయటం, సత్రాలునడపటం ఇవన్నీ భగవంతుని కర్మలు. వీటి వల్ల చిత్తశుద్ధిఅయి, చిత్తం సమాధానమవుతుంది భగవదనుగ్రహం వల్ల. ఇవి నిష్కామకర్మలయి ఉండాలి. అంటె అప్పటికె సమాధానపడిన బుద్ధి శరీరంచేత ఈ భగవత్కార్యాలు చేయించాలి. అదె "మత్కర్మ కురు" అనే సాధన.

11. కాని దరిద్రంచేత, లేదాశారీరక అశక్తతచేత మనసు ఇంకాదోవను పడకపోవటంచేత అలా భగవత్కర్మకూడ చేయలేక పోయేవారికి ఎలా? అనేదానికి "మత్ యోగాన్ని-ఆశ్రయించాలి" అంటున్నాడు శ్రీ కృష్ణుడు. "మత్ యోగం" అంటే నాతో కలవటం. అంతే

గాక "యతాత్మడవై" యుండాలి. అలా ఉంచడానికయినదీ,జ్ఞానాన్ని శ్రవణ మననాదులద్వారా, సంతరించినట్టిదీ బుద్ధే. యతాత్ముడంటె, సర్వకర్మఫలత్యాగంచేస్తూ ఉండట మిక్కడి సాధన అని విశదీకరించి చెప్పారు.

కర్మలు చేస్తూనే ఉంటాడు. ఆ కర్మల ఫలం పదార్థరూపంలో అనుభవించేది తన శరీరమే అయినా బుద్ధితో "ఇది పరమేశ్వరుని కయినఫలమె. ఆయన నాపై అనుగ్రహంతో నన్ను అనుభవింపజేస్తున్నాడు"-అనే తత్త్వం అనుసరించటమె కర్మ ఫలత్యాగమనెసాధన. ఈ భోజనం చేస్తున్నానన్న మాటేగాని, ఈ ఫలం నీదె. నీవే ఈ శరీరంలో ఉండి ఈ భోజనాన్ని ఆరిగించుకొంటావుగాక. ఇలా అనుకొంటూ తినటమనె కర్మచేయాలి-ఈ వ్యాపారంచేస్తున్నాను-ఇందులో ఏలాభనష్టాలు వచ్చినా నీవేగాని నావికావు. ఈ వస్తువులవంక ఎవరు చూచి ఆకర్షింపబడినా అది నీగొప్ప. ఎవరుకానినా అదినీగొప్ప. ఈ వచ్చే ఆదాయం నీవేం చేయదలచావో,అలానాచేతనడిపించు అనేమనః స్థితిని అలవరచుకొనాలి.

అలా చేస్తే నాబ్రతుకెలాగ అనద్దు. తినేది నీశరీరమె. నడిచేది నీబ్రతుకె. భగవంతునికంటె భిన్నమైందికాదు నీబ్రతుకు. ఇది బుద్ధికి స్థిరమయ్యేట్లు తెలియాలి అని అర్థం. మత్కర్మ చేయటమనేది అభ్యాసం చేస్తే అది తెలుస్తుంది. మనసు కూడ మెట్టునెక్కుతుంది. చిత్త సమాధానమై అప్పటికి అనుభూతి అవుతుంది.

12. శ్రీకృష్ణుడు అర్జునునకు ఈ భగవద్గీతద్వారా జ్ఞానంచెప్తున్నాడు. తెలిసి ఊరుకొంటె ఈ జ్ఞానంవల్ల ప్రయోజనం చాలకొద్ది. అభ్యాసంచేయాలి. మతంలో చెప్పిన అభ్యాసంచేస్తూ ఈ జ్ఞానాన్ని నేర్వని వారుంటారుగాక, వారి అభ్యాసంకంటె జ్ఞానంగొప్పది. జ్ఞాన పూర్వకమైన అభ్యాసం ఎంతోగొప్ప సాధన అనిబోధ. అలా అభ్యా

సంచేస్తే బుద్ధీ మనసులు సరియైన స్థితికి వస్తవి. అంతకంటె పైసాధన ధ్యానం. ఇందులో యమ నియమ ఆసన ప్రాణాయామాలుంటవి కనక శరీరమనోబుద్ధులు ఏకముఖమై అంతర్దృష్టిని కలిగిస్తవి. అంతరంగంలోగల సమష్టిమనసైన భగవంతుని—చూపింపజేస్తవి. ఈ కారణం చేత ధ్యానం జ్ఞానంకంటె కూడ గొప్పదని బోధ.

ధ్యానం కంటె కర్మఫలత్యాగం ఇంకా గొప్పది అని చెప్తున్నాడు శ్రీకృష్ణుడు. ఎందువల్లనంటే సాధకుడు తను చేసే ప్రతిపనిని భగవంతునికి రావలసిన ఫలంకోసమనుకొంటూ, ఫలం భగవంతునికె అర్పణ చేస్తూ బ్రతుకును సన్మార్గంలో నడుపుతూ ఉంటాడు. ఈతడి బ్రతుకులో, బుద్ధితో పాటు శరీరంకూడ—తన పనులేచేస్తూన్నప్పటికీ—భగవదర్పితంగా చేయటమనేది ఉంది కనక, అదె కాలక్రమాన మనసూ బుద్ధీ చిత్తాలకు. అలవాటై, జ్ఞానమై, సత్కర్మఅయి అనుసంధానమై వెలుస్తుంది. సర్వకర్మ ఫలత్యాగం అనేయీ సాధనలోనే అభ్యాసం, జ్ఞానం, మత్కర్మకరణం అనే సాధనలు మలచబడి అభ్యున్నతిని స్తవి.

అందుకె ఈ సర్వఫలత్యాగం అనే సాధన అన్నిటి కంటెగొప్పదనటం. అంతే కాకుండా—అంతర్దృష్టిద్వారా పరమేశ్వరుణ్ణి కలసి, అతడే ఈ సర్వప్రపంచమూ అయినట్లుగా అవగాహన చేసుకొన్న మీదట, జీవన్ముక్తి నొందిన వ్యక్తిప్రపంచంలో బ్రతికె తీరు కూడఈ సర్వకర్మఫలత్యాగి బ్రతుకునకు, యెనగానె ఉంటుందనిపిస్తుంది. అందువల్ల ఈసర్వకర్మ ఫలత్యాగమనే సాధన గొప్పదని చెప్పటంన్యాయమె.

కర్మ ఫలత్యాగం తరువాత గొప్పదైన సాధన శాంతిని సాధించటం. ఇది అన్నిటి కంటెగొప్పదెలాగవుతుందనే సందేహం ఎవరికీ రాదు. అది పై సాధనల ఫలం నిజానికి.

ఇలా ఐదురకాలయిన సాధనలు చెప్పారు గనక ఏదోఒకటిచేస్తే సరిపోతుందని అనుకోరాదు. ఏదో ఒక సాధనతో ఆరంభించవచ్చునని చెప్పటం. అలా ఆరంభించి శాంతినిసాధించి జీవన్ముక్తిని లేదావిదేహ

నాసక్తిని పొందవలసింపనిబోధ, ఆపైన భక్తునకు వివిధ స్థాయుల్లో ఉండే లక్షణాలు చెప్తున్నారు.

13–14 అద్వేష్టా సర్వభూతానాం:– (1) ద్వేషం వదలట మనేది రాజశాసనంకూడ బోధించేదే. ద్వేషాన్ని వదలటం సత్త్వ బుద్ధి వలవాటు చేసికొనేవారికి మొదటిపని. అదితేలిక (2) మైత్రః కరుణ ఏవచ:–మైత్రిని సర్వభూతాలయందూ పెంచుకొనటం (3) వాటిపై దయ కలిగి ఉండటం ఇవి కూడ ద్వేషం వదలటం అవంగానె కలిగించుకోదగినవె.

(4) నిర్మమో నిరహంకారః:–ఈ భూతాలను ప్రేమిస్తూ వాటియందే మమకారాన్ని పెంచుకోరాదు. మమకారం కోసంకాదు ఈమైత్రిని పెంచుమన్నది. సత్త్వలక్షణం కనుక మాత్రమే(5) పైగా నేనుగనక వీటిని దయతో చూస్తున్నాను, అనే అహంకారం పెంచుకోకుండా ఉండాలి ఈ (4), (5)లు (2), (3) లపై ఆంక్షలు.

(6) సమదుఃఖసుఖః క్షమీ:– సుఖ దుఃఖాలు వస్తూపోతూ ఉండేవి. అవివచ్చినప్పుడు అనుభవించటం అనేది ప్రతివారూ చేసేపనె. కానిఈ వచ్చిన దుఃఖం ఎప్పుడూ ఉండేది కాదని ఈ సుఖం ఎప్పుడూ ఉండనిదేనని తెలిసి అనుభవించటం వల్ల సమానత్వం వాటియందు నెఱపిన వారవుతారు. అది భక్తుని లక్షణమనిబోధ (7) క్షమీ అంటె ఇతర్ల తప్పులను క్షమింపకలిగేవాడు. తనకు చేసిన అపకారాన్ని క్షమింపగలిగేవాడని అర్థం–ఇది సత్త్వగుణలక్షణం.

(8) సంతృష్టఃసతతం:– ఎల్లప్పుడూ సంతోషంగా ఉండేవాడు. ఇదీ సత్త్వగుణలక్షణమె. దుఃఖ సమయాల్లో సంతోషంగా ఏలా ఉంటాడు, అనచ్చు. అప్పుడు సంతోషం అనే మాటకు బదులు సంతృప్తిగా ఉంటాడనే అర్థంచెప్పాలి. ఈ దుఃఖం వచ్చింది. అది రావటం అయిపోయింది గనక నిట్టూర్పుతో వెళ్ళి పోయిందన్నట్లుండాలి.

యోగీ :– (9) సమాహిత చిత్తుడై ఉండటం.

యతాత్మా :–(10) నియమింపబడిన స్వభావుడై ఉండటం.

దృఢనిశ్చయః:– (11) దృఢసంకల్పముతో ఉండేయాతడు.

మయ్యర్పితమనోబుద్ధిః:– (12) నాయందు మనసునూబుద్ధినీ అర్పించినవాడు అని అర్థం. పై 11 లక్షణాలలో భగవద్విషయంలేదు. కేవలం సత్త్వగుణలక్షణాలేఉన్నాయి కాని అలాంటి లక్షణాలు కలిగిన వాడు నాస్తికు డయితె ప్రయోజనం లేదు. నాస్తికుడుగాక భగవంతునికి మనోబుద్ధుల్ని సమర్పించేవాడు నాకు ప్రియుడని శ్రీ కృష్ణుడంటున్నాడు. ఈ 12 వ లక్షణం కిరీటం వంటిది.

ఈ 12న్నూ మొదటి సాధనగా చెప్పిన "అభ్యాసం" చేసి నేర్వవలసినలక్షణాలు అభ్యాస స్థితిలో భక్తుని లక్షణాలు. ఇక చెప్పబోయే లక్షణాలు, రెండవదయిన జ్ఞాన సాధనలోని పనిపిస్తవి. జ్ఞానం సంతరించేసమయాన భక్తుని లక్షణాలవి.

15.యస్మాన్నోద్విజతేలోకోలోకాన్నోద్విజతేచయః:–(13)లోకంలో ఏజీవినీ కూడ భయపెట్టక పోవటం–వారి వల్ల,తానూ భయపడాల్సిన అవకాశం లేక ఉండటం.

హర్షామర్షభయోద్వేగై ర్ముక్తో:– (14) అసూయ,భయం,సంక్షోభం, అతి సుఖం నుంచి విడివడినవాడు.

ఈ (13), (14) లక్షణాలు బుద్ధికి తరణి పెట్టగలిగినవి.భగవద్భక్తికి ముఖ్యంగా బుద్ధికి తరణి పెట్టాల్సిన అవసరం–మనకు–ఎంతో ఉంది. ఈ శరీరావయవాలు శరీరం,మనసు,బుద్ధీలు కూడ దేనినుంచి ఉత్పన్నమయినయ్యో అది చిత్‌శక్తి. ఆచిత్‌శక్తినేభగవంతుడంటాము. అది ఒక సాధకుని బుద్ధికి వెనక మాత్రమె ఉంటుం దనుకోరాదు. అందరి మనోబుద్ధి శరీరాలకూ సర్వప్రపంచాలకు ప్రభవస్థానమైన సమష్టిమన భగవంతుడు, దానిని చూడాలంటె ఈ శరీరం వైపునకు ప్రపంచం

పై పునకు చూస్తే అవగతంకాదు. అంతర్దృష్టితో చూడాలి. మనసును బుద్ధిలోనిల్పిలోపలి వైపునకు చూస్తె ఆ సమష్టి మనసు ఎప్పటికో అవగతమవుతుంది. ఈ జ్ఞానం తెలిసే స్థితిలోనున్న భక్తుడు కూడనాకు ప్రియుడేనని శ్రీకృష్ణ పరమాత్మ చెపుతున్నాడు. ఈ 13, 14 లక్షణాలు అప్పటివి. ఇవిబుద్ధి స్థాయి.

16 అనపేక్షః శుచిర్దక్షః ఉదాసీనోగతవ్యథః:- (15) దేనియందూ అపేక్ష లేకుండటం-అంటే ప్రపంచవస్తువులపై ధ్యాసలేదని అర్థం. (16) శుచి కలిగి ఉండటం. (17) కార్యశూరుడై ఉండటం (18) తటస్థుడై ఉండటం (19) బాధలను మరచినవాడై పోవిడిచినవాడై ఉండటం. సాక్షీ దీపంలా ఉండటం అనే ఈ స్థితి, శుద్ధ బుద్ధి స్థాయి అనగా అధియజ్ఞుని స్థాయి. సాక్షిలా దీపంలా ఉండగలిగేది ఆస్థాయిలోనె. అనుభూతి స్థాయి.

ఈ అయిదు లక్షణాలు ధ్యానంలో ఉంటూ సాధించతగినవి. శుచి మనసుకూ శరీరానికీ కూడ. బుద్ధికిగల వాసనలను వదలించటం కూడ శుచె. అశుచి పోతే బుద్ధి, శుద్ధ బుద్ధి అవుతుంది. అది బ్రతుకంతా పరుచుకోవాలి. ఇది ధ్యానస్థాయి.

17 నహృష్యతి నద్వేష్టి నశోచతి నకాంక్షతి శుభాశుభ పరిత్యాగి భక్తిమాన్:- (20) కలిగిన వసుతతిని చూచి పొంపోగివడు (21) ఇతర్ల పైద్వేషం ఉండదు.(22)శోకం ఉండదు (23)కోరికెఉండదు. (24) శుభ మనీ అశుభమనీ గమనిక ఉండదు (25) సర్వకర్మ ఫలత్యాగం గల భక్తుడై ఉంటాడు. ఈ సర్వకర్మ ఫలత్యాగస్థాయి శుద్ధ బుద్ధి స్థాయికి చేరి తిరిగి ప్రపంచ స్థితికి వచ్చినప్పటి స్థాయి అనిచెప్పవచ్చు ఈపై స్థాయులన్నిటి కంటె గొప్పస్థాయి యిది.పై సాధనలవల్ల ఉచ్ఛస్థితికిహఠాత్తుగా వెళ్ళిపోతారొకప్పుడు సాధకులుఅలావెళ్ళిన సంగతి, వారికె తెలియక పోవచ్చు. అతడు తిరిగి శరీరస్థాయికివచ్చి యీ సాధనలో చెప్పిన లక్షణాలను కలిగి ఉంటాడు. వీటి వల్ల శాంతి లక్షణాలు అమరుతవి.

ఆరంభంలోనే ఈసాధనచేసేవారికి శరీరమనో బుద్ధులు ఏకమై భక్తి—అంతర్దృష్టి—చక్కగా అలవడుతుంది.

ఇక శాంతిస్థితి లోని లక్షణాలేమంటే—

18 సమః శత్రౌచమిత్రేచ తథామానావమానయోః శీతోష్ణ సుఖ దుఃఖేషు సమః సంగవివర్జితః:— (25) శత్రుమిత్రులయందు సమత్వ బుద్ధి (26) మానావమానాలను సమంగా అనుభూతి చేయటం (27) శీతోష్ణాలు సమానంగా అను భూతి చేయటం (28) సుఖదుఃఖాలు సమం అనిపించటం (29) సంగాన్ని వర్జించటం. ఇవి సాధారణ మానవునికి అందు బాటులో ఉండే లక్షణాలుగా అవుపించవు.

19 తుల్యనిందాస్తుతి ర్మౌనీ సంతుష్టో యేనకేనచిత్ అనికేత స్థిరమతి ర్భక్తిమాన్:— (30) నిందాస్తుతులు సమం అనిపించటం (31) మౌనం కలిగి ఉండటం (32) దొరికిన దానితో సంతుష్టిచెందటం (33) తననివాసం—మతం—నికేతం మీద అభిమానం లేకుండటం (34) స్థిరబుద్ధి కలిగి ఉండటం. ఇవీ సాధారణ మానవునికి అందు బాటులో ఉంటవని చెప్పటానికి లేదు.

ఈ 18,19శ్లోకాల్లో చెప్పిన లక్షణాలు శాంతిని పొందిన స్థితిలో కలిగేవి. ఊ స్థితిలో శరీరం కూడ పరిపూర్ణతను పొందినదై శీతం ఉష్ణం భరించే విషయంలో ఒకే విధంగా ప్రతిచర్యను కలిగి ఉం టుంది కావచ్చు. ప్రహ్లాదుడు పాములచే కరిపింపబడ్డా, అగ్నిలో త్రోయ బడ్డా కందకపోవటానికి కారణం అతడీ స్థితికి చేరినవాడై శరీరంలో పరిపూర్ణతను పొందటమె ననిపిస్తుంది.

20 చివరకు శ్రీకృష్ణుడు సింహావలోకనం చేస్తున్నట్లుగా అం టాడు ఎవరు శ్రద్ధావంతులై మత్పరాయణులై ఈ నేను చెప్పిన ధర్మా మృతాన్ని చెప్పిన విధంగా అనుసరిస్తారో వారు నాకు అత్యంత ప్రియులు అన్నాడు (1) కర్మషట్కంలో కర్తృత్వ భోక్తృత్వాలూ, ఫలమందాసక్తిలేకుండా నీకయిన కర్మచేయుమన్నారు.

ఈ అధ్యాయంలో సగుణోపాసనము ఆచరణయోగ్యమైనదనీ ఎందువల్లనంటే అది బ్రతుకుతో కలిసినడుస్తుంటుందనీ—నిర్గుణోపాసన అంటే అంతర్దృష్టితో సమష్టిమనసు అయిన భగవంతుని దర్శించటమేనని చెప్పి, (2) భగవంతుని నమ్ముతూ కర్మయోగం చేయుమన్నారు,

ఈ రెండే గీతాసారం అనేది మర్చిపోకూడదు. ఇవి ఎలా బ్రతుకులో తెలియాలి అనేది 13నుంచి15 అధ్యాయాల్లోనూ ఆచరణకు ఏమిటి సాధనం అనేది 15 నుంచి 18 అధ్యాయాల్లోను స్పష్టంచేయబోతారు ఇకముందు.

కర్మ షట్కంలో చివరి అధ్యాయం ఎలా ఆచరణకు చెప్పబడిందో అలాగె భక్తి షట్కంలోని ఈ అధ్యాయంలోని సాధనలు కూడా ఆచరణకు చెప్పబడినవి. అహం బ్రహ్మాస్మి అనే మహావాక్యంలో అహం గురించి మొదటి అధ్యాయాలూ, బ్రహ్మను గురించి తరువాతి ఆరధ్యాయాలు చెప్పట మయింది. అనగా తత్త్వమసిలో, త్వం, తత్‌లను గూర్చి చెప్పటమయింది, ఇక అసిఅనే విషయం మీద ఆరధ్యాయాలింకా ఉన్నాయి.

13 నుంచి 15 వరకూ అత్యంతజ్ఞాన విషయాలు తిరిగి బోధచేసి 16 నుంచి 18 అధ్యాయాల్లో ఆచరించేటప్పుడు కలిగే చిక్కులు విడదీసి చెప్తారు. ఓపిగ్గా అనుసంధానం చేయాల్సినవి 13 నుంచి 15 అధ్యాయాలు. పాటించాల్సినవి 16-18 అధ్యాయాలున్నూ.

ఇది ద్వాదశోధ్యాయం

:—:—:

# శ్రీమద్భగవద్గీతామననము

## క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగయోగము

## పదమూడవ అధ్యాయము.

### బ్రతుకులో తగిలె సర్వమూ భగవంతుడె.



కర్మ యోగ విషయం ఆరూ, భక్తియోగ విషయం ఆరూ మొత్తం పన్నెండధ్యాయాలు చెప్పి చివరకు భక్తి పరాకాష్టను వర్ణించారు ఇంతకు పూర్వం. కర్మయోగికి కూడ భక్తిభావమె ఐదవ అధ్యాయంలో "తద్బుద్ధయఃతదాత్మానః...." అంటూ సూచించటం జరిగింది. అలాగె భక్తుడికి పన్నెండో అధ్యాయంలో "కర్మఫలత్యాగ" మనె కర్మయోగ సాధన చెప్పి తద్ద్వారా శాంతిని పొందుమన్నారు. కర్మఫల త్యాగమనేది కర్మయోగికీ భక్తుడికీ అత్యవసరం. ఈ రెండు యోగాలకు ఈ దృష్ట్యా తేడాలేదా అనిపిస్తుంటుంది.

కర్మ యోగి భక్తుడెనపుడు ఎలాటి లక్షణాలు కలిగి ఉంటాడో పన్నెండో అధ్యాయంలో చెప్పారు. వాటిని చూస్తెకర్మయోగి ప్రపంచంలో కనుపడే తీరూ ఆధ్యాత్మికంగా ఉండాల్సిన తీరూ వేరు వేరనిపించవు. కర్మయోగంలో తనలో ఆత్మె ప్రధానమై అదే సర్వత్ర ప్రత్యక్షమై ఉంటుందన్నారు. భక్తియోగంలో సర్వాత్మ అయిన భగవంతుడి అంశమె నీవై ఉన్నావన్నారు. తత్, త్వంలు రెండూ సూత్ర రీత్యా ఒకటే ననేది చెప్పి బుద్ధిని సమాధాన పరచటం చేశారు. ఇప్పుడు అసి అనేది ఎలాగో చెప్పాలని ఆరంభిస్తున్నారు. నీవు భగవంతుడే అయిన ఈ ప్రపంచంలో మనుతూ భగవంతుడివె ఎలాఅవుతున్నావో —లేదా అవుతావో సెలవిస్తున్నారు.

అర్జునుడు శ్రీకృష్ణుని అసంగతిని గూర్చి అడుగుతాడు:—

1—2 "ప్రభో! నీ శక్తి సంగతీ నీకయిన భక్తిసంగతీ తెలిసింది. ప్రకృతి నీలోభాగమె. నీవే. పురుషుడూ నీవె. శరీరమూ నీవె.

అధియజ్ఞుడవూ నీవేనని చెప్పావు, అన్నీ నీవే యయితే ఈ భేదమేమిటి? ఇక తెలిసికోవలసిన జ్ఞేయ మేమిటి? జ్ఞాన మేమిటి? ఇవన్నీ సందేహ రహితంగా చెప్పాల్సింది–అన్నాడు. ఈ ప్రశ్నకు సమాధానంలోనే విశ్లేషణాత్మకమైన విభాగవిషయం మొదలవుతుంది. కర్మయోగికీ భక్తియోగికీ ఈ విశ్లేషణాత్మకమైన విభాగవిషయాలు అక్కర్లేక పోయినవిగాని, ఇక బుద్ధిప్రధానసాధనగా కలిగిన జ్ఞాన యోగికి ఈవిశ్లేషణాత్మకమైన విభాగవిషయం అవసరమవుతున్నది. ఈ అధ్యాయమూ, పద్నాలుగో అధ్యాయములలో ఈవిభాగ విషయాలు సంపూర్తిగా జ్ఞానవిషయం తెలియజెప్పడానికిగాను చెప్తున్నారు. జ్ఞానంకలిగిన తరువాత బ్రతుకులో ఆచరణవిషయం చెప్పటందుకు కూడ మళ్ళీ రెండు విభాగయోగాలు చెప్పబోతారు. దైవాసురసంపద్విభాగయోగమూ శ్రద్ధాత్రయవిభాగ యోగమున్నూ. మరి అర్జునుడు "భేదమేమిటి" అని అడిగిన ప్రశ్నకు ఇలా చెప్పకపోతే ఎలా?

నిజానికి, భేదమల్లా యీ బ్రతుకే. ఈభాషే. భిన్నమైన అర్థాలుగల మాటలున్నప్పుడే భాష మార్పే బ్రతుకు. మార్పు అంటేనే భేదం. ఈ భేదాన్ని తెలియడమే బ్రతుకును తెలియడం. బ్రతుకవలసినతీరు నేర్వడం. అందుకని ఈమాటల భిన్నభిన్న అర్థాలు వాటిపుట్టుకతోసహా చెప్తున్నారు. ఎదురుగాకనపడే యీబ్రతుకూ అంతర్దృష్ట్యా తెలియబడాల్సిన భగవంతుడూ నిజానికి ఒకటే, ఈ రెంటినీ కలిపి బ్రతుకటమె సాధన. ఆసాధన ద్వారాజీవన్ముక్తిని సాధించటమవుతుంది.

కేవలం అంతర్దృష్ట్యా సాధనచేసే కొంచెంసమయంలో 'నేను' భగవంతుడనుకొని, బ్రతుకులో నేను దేహాన్ని అనుకొంటే జీవన్ముక్తి కలుగదు. ఈ భేదం స్పష్టంగా తెలిసికొని, బ్రతుకు బాటను సరిచేసి కొనటం జ్ఞానసాధనం, నీబ్రతుకు సరికాకపోతే నీవు జ్ఞాని వయినావా కాలేదా అనేప్రశ్న ఎవరికీ అక్కర్లేదు. ఇంతవరకూ అంతర్దృష్టిని

తెలియజెప్పడానికే కర్మ-భక్తియోగాలు చెప్పారు. ఇప్పుడిక మూడధ్యాయాల్లో అంతర్దృష్టిని సాధించిపొందినవాని పరాకాష్ఠను చెప్పబోతున్నారు. అలా అనుభూతిచేయబడే పరాకాష్ఠను బ్రతుకులో ఎలావర్తింపచేయాలో చివరి మూడధ్యాయాల్లోనూ చెప్పి అర్జునుని సమరోన్ముఖుని చేయబోతున్నాడు శ్రీకృష్ణపరమాత్మ.

అప్పుడు భగవంతుడంటున్నాడు — అర్జునా! ఈ శరీరాన్ని క్షేత్రం అంటారు, కనపడుతున్న ఇవన్నీ క్షేత్రాలే. కనపడటమంటె నీపఙ్ఞానేంద్రియానికిగాని మనసుకుగాని అవుపడుతున్నదల్లా క్షేత్రమేనని తెలిసికొను.ఈతెలిసికొనేవాడెవరో అతడికి తెలిసికొనబడిందానికిభిన్నమై వేరేఉంటాడు.తెలికొనే వాడు ఎవరంటె బుద్ధి అనకు.నీమనసూ బుద్ధీ లుకూడ నీచేత తెలియబడుతున్నవే కదా! మనసు మార్చుకొంటున్నావు. బుద్ధీమార్చుకొంటున్నావు.అందుచేత ఈ రెంటికీ వేరేఉన్న ద్రష్ట తెలిసికొనేవాడు.అతడే క్షేత్రజ్ఞుడు.క్షేత్ర + జ్ఞ అనగా క్షేత్రమునుతెలిసికొనేవాడు అని అర్థం. ఇతడు ద్రష్ట. క్షేత్రాలన్నీ దృశ్యాలు. ఈతెలిసికొనేవాడే "నేను" అనేవాడు. తత్ అతడే. అన్నిశరీరాల్లో ఈ "నేను" ఉంది వ్యాపించి. 'నేను 'నేను' అంటూనే అక్కడున్న శరీరానికి పరిమితంచేసికొనే ప్రారబ్ధవశంవల్ల 'అహం' అయిపోతున్నాడీ తత్.

క్షేత్రజ్ఞుడినిగూర్చి చెప్పాలన్నప్పుడు"నేను"అనేమాటఒకటి'అహం' అనేమాట ఒకటి ఇలాచెప్పి తంటాలు పడటం, నిఘంటువుల్లోఅహం అనేదానికి నేను అని చెప్పితుండటంచెత. నిజానికి దేనిఆర్థందానిదె. ప్రపంచవిషయాల్లో ఈసంక్లిష్టమైనఅర్థాలు వదలివేసి,రెండూఒకేభావం కోసంమాట్లాడుతూఉంటాముగాక. తత్‌ను గూర్చిచెప్తూ మాటలులేక తడుముకోకతప్పటల్లేదు. ఎందుకని?దాన్ని మాటలు చెప్పలేవుకనుక.అది నిశ్శబ్దంలోనే అనుభూతి చేయబడగలుగుతుంది. అంటే ఇంద్రియాలన్నిటినీ పనిమాన్పించి కేవలం బుద్ధిమార్గాన అంతర్దృష్టిద్వారా అన్వేషిస్తూపోతుంటే...................................."ఆ! పోతుంటే ఏమవు

కుంది" అని అడిగితె,మాటల్లో సమాధానం చెప్పగలిగిందిలేదు."చేసి చూడు" అనటం తప్ప. మనసు అలా పయనించాలి అనేదాన్ని ప్రచోదించిందెవరో ఆతత్‌ను వెదకాలి. అలాచేస్తే ఎప్పుడో ఒకక్షణాన మనసు నశిస్తుందిట. అదినిద్రకాదు. ఆక్షణంలో అనుభూతి అయేదే ఆ'తత్' నేను.అది ఇక నేను అనదప్పుడు. ఉన్నదంతా తనె అని, అనుభూతి చేస్తుంది. అదె 'సత్' నిజము.నిత్యము.ఈ "క్షేత్రజ్ఞ"డనేమాట ద్వారా కలిగించుకోవాల్సిన సాధనాఫలం ఆ అనుభూతే!

సత్ నిశ్శబ్దంలోనే కనుపిస్తుంది. నిశ్శబ్దమంటే ఒక్క శబ్దం లేకుండటం మాత్రమె కాదు.స్పర్శరూప రస గంధ ఆలోచనలుసహా అన్నీ శమించిన స్థితి. దీనిని మాటల్లో చెప్పడమెలాగ! నిత్యమంటె శాశ్వతంగా ఉండనివాటిని చాలాకాలముందేటట్లయితె నిత్యమంటామాయె,'నిజము'అంటె ఇంద్రియానుభూతులన్నిటినీనిజమేనంటామాయె! ఏమాటతో దానినిచెప్పిన అది కొంత మాత్రమె చెప్పగలిగిఉండటం చేత అబద్ధమది అనడానికి అవకాశమిస్తుందిగదా: అందుకేదాన్ని అనిర్వాచ్య మన్నారు.ఈ మాటలన్నీ శాఖా చంద్రన్యాయంగా విషయాన్ని కేవలం సూచింపగలవేతప్ప, ఇదమిత్థమనిచెప్పలేవు.అనుభూతి అయిన వారికి ఏమాటచెప్పినా తెలుస్తుంది. తీపి, మధురం, స్వీటు అన్నప్పుడు ఆరుచిమనకు జ్ఞాపకం రావటల్లేదా? ఆ అనుభూతి అయ్యేవరకూ ఈ శబ్దాలు సాధకులకు అందించే మెట్లుమెట్లుగానుండే త్రోవాలేగాని గమ్యం కాదు. ఆతరువాత చెప్పేపనిలేదు. నిశ్శబ్దమేచాలు.

3. ఈక్షేత్రాల్లో ఉండే 'నేను'పురుషోత్తముడను బహువచనం ఏకవచనం అన్నీ అదె. ఒకటి పూర్ణమైన నేను ఇంకొకటి అంశమైన నెనుగుండె మీద కొట్టుకొని నేనూ అంటావు.ఇందెకూడఅసందర్భంలో నేనె కదా! ఈ క్షేత్రమూక్షేత్రజ్ఞులకు సంబంధించిన జ్ఞానమె జ్ఞానం.

4-5. ఈ క్షేత్రం క్షేత్రజ్ఞుడు జ్ఞానం వీటిని గురించి మహర్షులు బ్రహ్మసూత్రాల్లోనూ వేదమంత్రాల్లోనూ చెప్పేఉన్నారు.

6–7 శరీరం అనంగానే ఇంద్రియాలు స్ఫురిస్తయి మనసులో. వస్తువిషయంలో పదార్థం స్ఫురిస్తుంది. శరీరంలో ఇవేకాదు, ఇంకా ఉన్నాయి. పంచభూతాలు, అహంకారం, బుద్ధి, అవ్యక్తం, అంతరింద్రియాలు ఇవన్నీ కలసినదె క్షేత్రంఅంటె. వీటిని గ్రహించేది క్షేత్రజ్ఞుడు.

ఈ ''నేను'' అనే ''క్షేత్రజ్ఞుడు'' వేరుగాను మిగిలిన శరీరం వేరుగానుచేసి, ''క్షేత్రం''గాను చెప్పటం ఎంతో ముఖ్యమైన సంగతి. ఇదె అంతర్దృష్టిఅంటం. ప్రళయం తర్వాత కేవలం పరాత్పరుడుతప్ప ఇంకెవరూ ఉండరు. ఆపరాత్పరునికి సత్ చిత్ ఆనందలక్షణాలుమూడు సమస్థితిలో ఏకమైఉంటవి. ఆసమయంలో ఆయన చైతన్యం కూడ వాటితోకూడుకొని నిశ్చైతన్యమనిపించేస్థితిలో ఉంటుంది. సముద్రంలో ప్రేలుడులా–ఆయన లక్షణాల్లోని ఆనందస్థితితో తన్మయుడై ఆపరాత్పరుడున్నసమయంలో–చిత్ శక్తి ప్రకాశమానమై తనలో ఆపరాత్పరుని ప్రకటింపచేస్తుంది. అద్దంలో రూపంలా చిత్‌శక్తె చిదాభాసమై పరాత్పరుని ప్రకాశాన్ని ప్రకటిస్తుంది. ఆయన 'సత్'' లక్షణం ''ఎవరునెను'' అని ప్రశ్నిస్తే ఈ చిత్, ఎక్కడికక్కడ ''నెను'' అనిసమాధానం చెప్పతుంది. ఈ చైతన్యం నిజానికి సమష్ఠి నేను. పరాత్పరుడే. కాని చిత్ శక్తియొక్క, మాయవల్ల, భ్రమవల్ల, అంటె లేనిది ఉన్నట్లుగా చూపటంవల్ల వేరు వేరు నేనులుగా ఎక్కడి కక్కడ ప్రకటిస్తూ పరిమితికి లోనై ఉండటం జరుగుతున్నది.

ఎక్కడ ఉన్న ''నెను'' అక్కడ తానువేరని, ఆప్రక్కనె 'నెను' అంటున్న పరమేశ్వరుడు వేరనీ అనుకొనటం ఆరంభిస్తుంది. సమష్ఠి నెను తాను తనస్థితిమరచిపోయి వ్యష్ఠినెనులుగానయి ఉంటుంది. అదె జీవుడులు అంటాము. ఈ జీవుడు సమష్ఠి మనసులోభాగమె. ఆసమష్ఠి మనసే భగవంతుడు అనెది మర్చిపోరాదు. జీవుడూ భగవంతుడైఉండే వాడేకాని ఈ పరిమితిని ఆపాదించుకొనటంవల్ల అతడు వేరైపోయి

నాడు. ఈజీవుణ్ణి శుద్ధస్థితిలో ఉన్నప్పుడు క్షేత్రజ్ఞుడనటం. అంటే ఇంద్రియాలస్థాయికి పైనున్నప్పుడని అర్థం.

ఈ జీవుడు శబ్దతన్మాత్ర నూహించి దానియందు అభిమానం పెంచుకొని శబ్దాన్ని, స్పర్శతన్మాత్ర పైగల అభిమానంతో స్పర్శనూ ఇలాగే అయిదు తన్మాత్రలనూ పుట్టిస్తాడు. దేవుడుగా తనకుగల "చిత్" శక్తిలోని భాగమయిన "చిత్త శక్తి"తో అభిమానించటం దానినె పెంచుకొనటం అనే ప్రక్రియద్వారాపంచభూతాలనూ పుట్టిస్తాడు. వాటితో శరీరం కలిగించు కొంటాడు. ఆ శరీరానికి శ్రోత్రత్వక్చక్షు జిహ్వా ఘ్రాణాలు కూడ కలిగించుకొంటాడు. ఇలా శరీరం ఇంకా ఈ కన్పడే వస్తువులన్నీ తయారవుతున్నాయి. జీవుడుఇచ్ఛాద్వేషస్సుఖం దుఃఖం చేతనధృతి ఇవన్నీకూడ శరీరధర్మాలుగా కలిగించు కొంటున్నాడు. ఇప్పుడుచెప్పే ఈ జ్ఞానవిషయానికిగాను ఈ శరీరంవేరు, క్షేత్రజ్ఞుడు వేరు అనిచెప్పటంలో ఇంత విషయం శ్రీకృష్ణుడు సూచించారన్న సంగతి మర్చిపోరాదు.

నేను అనేది చిత్ ఏమిటి అన్నప్పుడు కనపడే ఈ శరీరంకాక దీనిపుట్టుకకుగాను పంచతన్మాత్రలు, పంచభూతాలు దశేంద్రియాలు మనసు బుద్ధి అకాంకారాలనుముందుగా పుట్టించిందేదో అది అని అర్థం చేసికొనాలి. శరీరానికి వేరై ఉంటున్నదనే విషయం జ్ఞాపకముంచుకొనాలి. అదిద్రష్ట, ఈ శరీరం (క్షేత్రం)దృశ్యం. ఈ రెంటికి మధ్యగల ప్రేమభావం-లేదాఅభిమానం-అదె జీవితం అంటాం.

శరీరం ఎదురుకుండా ఉన్నా,మనిషి చచ్చాడంటాం. ఎందువల్ల? జీవుడు చచ్చేవాడుకాడుగదా! ఈ జీవునకూ ఈశరీరానికీ మధ్యగల అనురాగం—అభిమానం—చచ్చిందని అర్థం.

సరె అలా చచ్చిన తర్వాత జీవుడు మళ్ళీ ఆ పరమాత్మతో—సమష్టి మనసుతో—కలిసిపోతాడా అని శంక. అలా కలియకుండా ఉండిపోయే అవకాశముంది. తనకు కలిగిన భ్రమాత్మకమైన స్థితిపోయే

వరకూ పరమాత్మునిలో చేరిపోయినట్లు చెప్పము. నిజానికి ఆ సమష్టి మనసులో భాగంగానే ఉంటుంటాడు. కాని తాను ప్రత్యేకమనేదృష్టిని కలిగిఉన్నవాడై అంతకు ముందుగల శరీరంపై అభిమానంపోయినా అప్పటికి ఇంకా ఉన్న ఇచ్ఛాద్వేష సుఖదుఃఖాదుల ఫలితమనదగిన "వాసన"తో ఏకమై ఉంటాడు. ఆ "వాసన" కూడ వదలినప్పుడె పరమాత్మతో-ఆ సమష్టిమనసుతో-ఏకమని చెప్పటం అవుతుంది. అందాకా వేరుగానె ఉంటాడు. ఈ విచారణ చేసేది అక్షేత్రజ్ఞుడె. అతడు ఈ విచారణచేస్తె తాను ఇంకా ఉంచుకొంటున్న "వాసన"ను వదలి పెట్టకలుగుతాడు. అప్పుడు పరమాత్మతో చేరినవాడవుతాడు.

ఇంకోసం దేహం-జీవుడు వేరైనట్లుగా-పరిమితిలో పడినట్లుగా భ్రమలో పడ్డాడు. సరె. అతడేగదా ఈ దేహాన్ని తన మనోబలంవల్ల సంస్కార బలంవల్ల-చిత్త శక్తివల్ల పుట్టించుకొన్నాడు! ఈ శరీరంతో ఏకమై "నేను" అన్నప్పుడు ఈ శరీరాన్ని చూపుతున్నాడు. ఇప్పుడు ఈశరీరం వేరుఅని చెప్పటంలో అర్థమేమిటి? అని. సమష్టిమనసయినపరమేశ్వరునితో వేరై ఈదేహంతో తాదాత్మ్యం పొందటమే భ్రమ అని చెప్పటం. ఈదేహంతో తాదాత్మ్యం పొందక పోయినట్లయితె భగవంతునితో వేరు పడటమనేదేలేదు. ఎందుకనంటె జీవుడూ పరమాత్మ ఒకటెనిజానికి. జీవుడు వేరుగా అనుకొనటం భ్రమె. అంతెకాదు జీవుడుతాను సృష్టించిన దేహంతో కలిసి తాను దేహమె అనుకోవటమూ-భ్రమె. ఈ భ్రమలు రెండూకలిసి ఒకటె, ఈ భ్రమలుపోతె ఒక్కభగవంతుడే ఉండేది, జీవుడని ప్రత్యేకంగా అనబడేవాడింకెవరు? ఇప్పుడు భ్రమపోగొట్టుకోవటానికి మున్ముందుగా దేహంపైగలతాదాత్మ్యతను వదిలించుకోవటం సాధన. అందుకు ప్రాతిపదిక తాను నిజంగా పరమాత్మేనుఅనే "జ్ఞానం. ఈ జ్ఞానం కలిగి ఆసాధనచేయుమని చెప్తున్నారు. "నేను భగవంతుడి నేనట! అనుకొంటూ తాను శరీరంకాదు అనేసాధన ముందు చేయాలి.

ఇదె కర్తవ్యం. అందుకే క్షేత్రమూ క్షేత్రజ్ఞుడు అనేవాటి వివరణ చెప్పించి.

అద్దంలో బొమ్మను చూస్తాం.గడ్డంమాసిందంటాం.ఈమాసింది ఎవరికి? అద్దంలోబొమ్మకా? మనకా? చూసింది అద్దంలో బొమ్మ నయినా మనకనె ఆపాదించుకొనటం జ్ఞానం. పసిబాలుడు అద్దంలో తన బొమ్మనుచూసి ఎవరో అనుకొంటున్నట్లు నవ్వుతాడు, మాట్లాడు తాడు.అది అజ్ఞాన కారణం. ఈ అజ్ఞానం పోగొట్టుకొనటం ముఖ్యమని బోధ.

చెట్టును చూస్తాము.ఆకనపడేదాన్ని చుట్టూ ఉన్నవాటితోవేరుచేసి అది "చెట్టు" అని తెలుగు భాషలో పిలుస్తాం.భాషకోసం,నామరూపాల నిశ్చితార్థానికిగాను వేరు చేసి దానిని పిలుస్తాంకాని,అవి చుట్టూఉన్నవాతా వరణంతో,గాలితో కోయిళ్ళతో ఆకులతోఫలాలతో కలిసి ఉన్నదేకాని విడిగా ఉన్నదికాదే! జీవుని పరమాత్మనుంచీ విడదీసి పిలవటం కూడ ఇలా భాషకోసమె. నామ రూపాలకోసమె. నామరూపాలు వదలివేస్తే మిగిలేది కేవలం పరమాత్మే.ఐతె పరమాత్మ ఒకరూ—నామరూపాలు ఒకరూ—రెండేనా విశ్వంలో ఉన్నది? అని శంక. ఈ నామరూపాలు పరమాత్మను గుర్తించకుండా చేయగలిగినంత గొప్పవా?అనిసందేహం మళ్ళిగొప్పా నీచా అనే తర్జన భర్జన మనకొద్దు.నామ రూపాలు వల్లనె భ్రాంతికలుగుతోంది గనక, ఈ భాషే—ఈ విశ్లేషణ పూర్వకమైన రూపదృష్టే "మాయ"అయి జీవుడుతన స్వస్వరూపం మరిచిపోయి, ఈ రూపదృష్టిలో, బాహ్య దృష్టిలో పడేటట్లు చేస్తున్నదనేది మాత్రమె ముఖ్యం.

అందుకుగాను ఈ భాషను స్పష్టంగానేర్వడమె ప్రధానం.దానిని నేర్చి, దాని పరిజ్ఞానాన్ని బడసి, దేహాన్నుంచి జీవుని వేరుచేసెచూడటం తిరిగి అతడ్ని పరమేశ్వరుడుగా గుర్తించి "పరమేశ్వరు"డనే పద పుఅర్థం సమగ్రంగా గ్రహించటం అవసరమనిబోధ.

సముద్రం తళతళలాడుతోంది అంటాం ఒకరా త్రిపూటచూచి. ఏమిటి నిజానికి తళ తళ లాడేది? దానిలోని బుడగలు. బుడగలువేరూ సముద్రం వేరుగా చూడనపుడు అలా సముద్రం అంటాం. కాని ఏమిటవ్వి తళ తళలాడుతున్నాయి అని పిల్లవాడు అడిగితే—విశ్లేషణ ననుసరించి అవి గాలికి అడుగున కలిగిన బుడగలనీ, నీటిలో భాగమె, గాని విడిగా అవుపడుతున్నవనీ చెప్తాము. అలాగె సర్వమూ పరమేశ్వరుడెగాని ఇలాదేహ రూపమై ఉంటున్న ఆపరమేశ్వరుడె ఈ జీవుడనే మాట మాత్రం సామాన్యమానవుడికి విచారణ చేయందే అర్థంకాదు.

ఏనుగును చూస్తున్న ఏడుగురు గుడ్డివారు ఏడురకాలుగాభాషలో వర్ణిస్తారుదాన్ని. ఇది భ్రమవల్ల కలిగిన భేదం. భాషద్వారా అలా అభివ్యక్తం అయింది, అలాగే భగవంతుడు అని,తననుతాను తెలియక్క పోవటమనేది కూడ నామరూపాలవల్ల—అంతకుమించి భ్రమవల్ల—తాదాత్మ్యం వల్ల వచ్చింది,

ఈలా సూచింపబడిన విషయం ప్రాతిపదికగా మనసులో ఉంచుకొన్నవాడై సాధకుడు జ్ఞానం పొందాలి. ఏమిటీ జ్ఞానం అనెది తరువాతి పదము.

8-11 జ్ఞానం అంటే పైనచెప్పిందంతాజ్ఞానం కాదాఅనిపిస్తుంది. కాదు. అది విషయం కార్యకారణాల్లో కారణం. కార్యంఅయి పోయింది కనక ఈస్థితి నుంచిజ్ఞానంతో కారణాన్నిశోధించి తెలియటం జ్ఞానం. ఎలా ఈ శోధన చేయటం అనెది ప్రశ్న.

జీవుడు "పరమేశ్వరునే నేను" అనుకొవటానికిగాను సాధన—ముందు తాను ఈ శరీరం కాదు అని అనుభూతి చేయటం ప్రధానమని చెప్పాము. ఆ తరువాత భగవంతుని యందు తాదాత్మ్యతను పొందటం సాధన. ఇప్పుడు జీవుని కున్నలక్షణాలు దేహలక్షణాలూ భగవల్లక్షణాలూ కలిసి అయిపోతున్నాయి .అందువల్ల దేహలక్షణాలు అలాఉంచి

భగవంతుని లక్షణాలు సంతరించి స్థిరం చేసికొనాలి, అనుభూతి చేయాలి. ఇదేజ్ఞానసాధన. జ్ఞానంఅంటె భగవల్లక్షణాల అనుభూతేనని అర్థం. దేహలక్షణాలు మాత్రమే కాద"ని తెలిసిఅనుభూతి చేయుటమే జ్ఞానం.

ఇక్కడ 20 లక్షణాలు జ్ఞానంగా చెప్తున్నాడు శ్రీకృష్ణుడు.

1 అమానిత్వం—దేహానికే మానిత్వ లక్షణం ఉంటుంది. అది వదలితే దేహలక్షణం వదలుతుంది. అమానిత్వం అంటె మాన్యత న్యూనత లేని కేవల జీవునిస్థితిని అనుసంధానం చేయటం జ్ఞానమని చెప్పటం ఇది.

2 అదంభిత్వం—"దంభిత్వ"మనేది దేహలక్షణం. అది వదలితె జీవుని కేవలంగా విడిగా అను భూతిచేయుట మవుతుంది గనక అదంభి త్వం విజ్ఞానం.

3 అహింస:—హింసచేయకలగటం దేహలక్షణం. అదివదలుమనిబోధ.

4. క్షమ:—ఇది భగవంతుని లక్షణంగా ఆపాదించుకొనటం వివేకం.

5. ఋజుత్వం:—సమచిత్తంతో ఉండటం. దేహలక్షణమే కావచ్చు గాని, దీనిని దేవలక్షణంగా అనుభూతిచేయటం జ్ఞానమని చెప్తు తున్నారు. అలాగే 6 గురుభక్తి, 7 శౌచం, 8 స్థైర్యం 9 మనోనిగ్రహం వీటి నన్నిటినీ దేహలక్షణాలుగా ఆపాదించుకొనక పరమేశ్వరలక్షణాలుగా అనుభూతి చేయటమే జ్ఞానం అనేదిబోధ.

ఈ పైతొమ్మిదీ దేహలక్షణాలుగా మన్నించినంతవరకూ జ్ఞానం అనటం, సరికాదు అనిపిస్తుంది, దేహలక్షణంగా గాక పర మాత్మ లక్షణాలుగా తనకైతాను అనుభూతిచేయటం సాధకుని కర్త వ్యం. అదేజ్ఞానం. వట్టిపుస్తకాలు చదవటంకాదు జ్ఞానమంటె.

తరువాతి ఆరులక్షణాలు మనసు పరమైనవి. దేహం ఎలాజీవుని కంటె ప్రత్యేకమో, మనసూ అలాగే జీవుని కంటె ప్రత్యేకం. (10) ఇంద్రియ విషయాల యందు వైరాగ్యం:—మనసు కొన్నివిషయాల పై లగ్నం అవుతుంది. ఇతరాలు వద్దంటుంది. అది మనోలక్షణం. కాని ఈ

జ్ఞానమనే లక్షణంలో ఇంద్రియ విషయాలను వద్దనటమె లక్షణం. ఇంద్రియాలుకూడ భగవంతుని నుంచే జీవునిద్వారా కలిగినవే అయినా తాదాత్మ్యత వదలటానికిగాను వాటియందు వైరాగ్యం కలిగించుకొనటమె జ్ఞానమనిబోధ. (11) అనహంకారము :–ఇది పరమాత్మతో మనసు లీనమయినపుడు కలుగుతుంది. (12) జన్మమృత్యు జరా వ్యాధుల దోషదర్శనం:–దీనిని ప్రతిపక్షభావన అనికూడ అంటాము. వీటియందు నిరసన భావం పూర్తిగా కలిగితేనె మనసుపరమాత్మవైపునకు తిరుగుతుంది (13) పుత్రదారగృహాదులందు అనాసక్తి :–కర్మయోగంలో అనాసక్తి అంటే పెద్దచర్చచేశారు. (14) అనన్యాత్మభావం:–అంటే ఎల్లెడలా ఆత్మేనిండి ఉన్నదని అనుభూతిచేయటం (15 శుభాశుభాల్లో ఇష్టానిష్టాల్లో సమభావం కలిగిఉండటం ఇవిఅన్నీ జ్ఞానమె. అనుభూతిచేయబడుతున్నపుడు అవి జ్ఞానం అని అనబడతాయి. లేకపోతె అవి ఈమాటల్లోగల సారపుభావాలుగ మాత్రమే మిగిలిపోతాయి, అనేది గమనీయం.

చివరి ఐదులక్షణాలూ బుద్ధిస్థాయిలోవి:–(16) అనన్యభక్తి:– భగవంతుని అంతర్దృష్టి ద్వారా తెలియటమె భక్తి, అది అనన్యమైన భక్తి అయిఉంటమె జ్ఞానం (17) ఏకాంతమనుభవిస్తూ ఉండటం:– వృత్తిలో ఒకే అంతర్దృష్టిపూర్వకమైన ఏకాంత ఏకాగ్రత ఉండటం జ్ఞానమనిబోధ. (18) బయటి వ్యవహారముల యందు సక్తిలేకుండటం (19) ఈదేహం ఆ సమష్టిమనసునుండి కలిగిందన్న అధ్యాత్మజ్ఞానం కలిగిఉండటం (20) తత్త్వజ్ఞాన ప్రయోజనం కలిగిఉండటం. ఇవీజ్ఞానమంటె. భక్తుడంటే ప్రపంచాన్నివదలి వెళ్ళిగుహల్లో కూర్చొనబోయేవాడు కాదు. ఇక్కడ మనతోబాటు ఉండేవాడే కాని అతడి మానసస్థితి, బుద్ధిలోని జ్ఞానం అంతర్దృష్టి పూర్వకమై ఉంటుంది.

12. 'జ్ఞానం తెలిసికొను'' జ్ఞానం తెలిసికొను'' అంటేఅర్థం భక్తుడవుకావలసింది అని చెప్పటమె. అనుభూతిచేయుమని అనటమె. ప్రపంచం, జ్ఞాత,

జ్ఞేయమూ, ప్రజలూ అంతా భగవంతుడె అయి ఉన్నపుడు, అదితెలిసి కొనుమన్నపుడు ప్రత్యేకంగా భక్తుడవు కావలసింది అని చెప్పాల్సిన అవసరమేమిటి? తాను భగవంతుడనే విషయంతెలిసి అది స్థిరంగా నిలిచేవరకూ అన్నీ విడివిడిగా కనపడుతునే ఉంటవి. ఆ విడి విడిగా ఉన్నవన్నీ ఒకే ఒకటని తెలియడానికి సాధనే క్షేత్రమూ క్షేత్రజ్ఞుడూ. జ్ఞానం వీటివివరణం తెలియడం.

ఇకజ్ఞేయమేదో—అంటే—తెలియదగిందేదో ఆదిచెప్పబోతున్నాడు శ్రీకృష్ణుడు. తెలియ తగింది భగవంతుడు. సమష్టిమనసు. తత్.

13.ఆది తెలియడం వల్ల అమృతత్వం కలుగుతుంది. అదిఅనాది. స్వతంత్రమైనది, సత్‌మాత్రమే ననటానికి వీల్లేదు. అసత్ మాత్రమే ననటానికీ వీల్లేదు. భ్రమాత్మకమై ఈ కనపడే ఈ వస్తువులు దేహా అన్నీకూడ ఆ జ్ఞేయమే. అని పరమేశ్వరుడేనని తెనియాలి. సర్వ్ర ఆకాశం ఉండగా సర్వత్రగాలికూడ ఉంటోంది, ఆలా ఈ పరమేశ్వ రుడున్నాడనె ఉహతో యధార్థం వైపునకు గమి ంచాలి, జ్ఞేయం కేవలం శబ్ద ప్రమాణం వల్లతెలియతగింది అయియుండటం వల్ల సత్ అనీ (ఉన్నదనీ) అసత్ అనీ (లేనిదనీ) చెప్పటానికి వీల్లేనిదయింది.

14. ఆయనకు అంతటా హస్తాలే. అంతటా పాదాలె.అంతటా కండ్లె. అంతటా శిరస్సులె. అంతటా ముఖాలె ఉంటున్నాయి. ఈ ప్రకృతి మొత్తమంతా పరమేశ్వరుడు.అన్నిచోట్లా నిండి ఉన్నాడీతడు అతడేజ్ఞేయము.

15—16 జ్ఞేయము అనంగానే భగవంతుడు అని తెలియాలి.కాని భగవంతుడనంగానే సమష్టిమనసు సంగతిజ్ఞాపకంరావాలిగాని ఒక మనిషిజ్ఞాపకానికిరాకూడదు. అందుచేజ్ఞేయముఅనేమాటనువాడినకారణం శ్రీకృష్ణుడు. అదే సర్వేంద్రియాలనూ ప్రకాశింపజేస్తున్నది. దానికి ఏఇంద్రియాలూ అక్కరలేదు. అది సంగరహితమైనది. కాని అన్నిటికీ ఆధారమైనది. త్రిగుణ రహితమైనది. అయితె అదే గుణాలను పాలిస్తుంది. చరాచర

భూతాల్లో లోపలా బయటా కూడ ఉంది స్థావరమూ జంగమమూ కూడ అయిఉన్నది. దూరాన దగ్గిరా కూడ ఉన్నట్టిది.

ఈ మాటలు వేటికవి ఆంశికమైన అర్థం ఇస్తుండటం వల్ల అందరకూ సమగ్రంగా అర్థం కాకపోవచ్చు. అన్నీ విన్నమీదట బుద్ధిని వికసింపజేసి సమగ్రంగా తిలకించగలిగిన వాళ్ళకు శుద్ధ చిత్తులకు సంగతి అర్థం అవుతుందనిపిస్తుంది. అందుకె కర్మయోగసాధనలను గాని భక్తియోగ సాధనలనుగాను వినక, చేయక నేరుగా 13 వ అధ్యాయం అర్థంచేసికోవటానికి ప్రయత్నించేవారికి మధ్యలో అవష్టంభనం ఎక్కువ కలుగుతుంది. కర్మయోగికి గాని భక్తునికిగాని వెంటనె అర్థంకావటానికి అవకాశం ఉంది. అది చదవకుండా ఇది చదవవద్దని సలహా ఇస్తే-అదేదో మమ్మల్ని 13 వ అధ్యాయం నుంచి దూరంగా ఉంచటానికి ఇలా అంటున్నారని మన పిల్లలె మనను అనటంకద్దు, అందుకె పిల్లలకు కనీసం మనమీద లేదా ఆచార్యులమీద వారి లెక్చరర్లమీద నమ్మకం ఉండాలి. ఆసంప్రదాయం సంతరించబడాలి. అది లుప్తమయితె సహనం నశించటం అవుతుంది. అది పెద్దక్లాసుకు చెందింది గనక, ముందు ఇది చదువు అన్నామంటె నీదిమహాపెద్దక్లాసా-మాది చిన్నక్లాసా అనేస్పర్థబయలుదేరుతుంటుంది. పర్యవసానంగా అందరూ-అంటే కర్మయోగం భక్తియోగంతెలిసికొననివారు కూడ ఈ అధ్యాయంతో స్వాధ్యాయం ఆరంభించటం జరిగినా, దీని ఆంతర్యం తెలియ కలిగే ముందే విసిగిపోతే ఇదంతా ఒకానొక మూఢతతో-పిచ్చితో-వ్రాసిన భాగం అని త్రోసివేసేయడం మాత్రం కలగ కుండా జాగ్రతపడటం అవసరం-అందుకె చిత్తశుద్ధులకు ఇది దగ్గరగా అనుభూతి అవుతుందని అన్నపుడు నన్ను చిత్తశుద్ధుణిగా లెక్కచేయని పక్షపాతివి అనకుండా చిత్తశుద్ధికై ప్రయత్నించాలి బాలురు.

17. సర్వభూతాల్లో లోపలా బయటా ఒక్కటిగా ప్రవహిస్తున్న ఈ శక్తి-శక్తి అంటే ఛాలదు-ఈ జ్ఞేయము, అవిభక్తమైన దైనా

విభక్తమై తెలియనివారిచే అలా గ్రహింపబడుతున్నవి. ఈభూతాలను సృష్టిస్తున్నదని సంహరిస్తున్నదని అనిపిస్తోంది.

18. అది సూర్యచంద్రులనే ప్రకాశింప జేసేది. అది జ్ఞేయమూ జ్ఞానమూ కూడ. అంటే బుద్ధి వృత్తులయందు అభివ్యక్తమయే జ్ఞానమూ ఇదే—అమానిత్వం అదంభిత్వం అని చెప్పబడినజ్ఞానము కూడ ఇదే. అంటే సాధనచే తెలియబడదగిన జ్ఞానం కూడఈ జ్ఞేయమేనని అర్థం. అంతర్యామిగా ఎల్లెడలా వెలిసేది అదే.

12నుంచి 18 వరకూ చెప్పిన లక్షణాలు జ్ఞేయమేదో—తెలిసికొనతగినదేదో—దాని లక్షణాలు, అదేమిఅంటే –భగవంతుడే. భగవంతుడంటె సమష్టిమనసు. పరాత్పరుడొక్కడే ప్రళయసమయంలో ఉంటాడు. అతడికీ ఈ భగవంతుడికీ భేదమున్నదని ముందు భావించితే గాని, ఈ భగవంతుడి లక్షణాలన్నీ తెలిసి పట్టుకొని వానియందు తాదాత్మ్య మందలేము. పరాత్పరుడన్నవానికీ సత్ చిత్ ఆనందాలు తప్ప, ఇంకేమి లక్షణాలులేవు. ఈ భగవంతుడికి ఎన్నో ఉన్నాయి అంటున్నాడు కృష్ణపరమాత్మ. ఎన్నో కాళ్ళు. శిరస్సులు, ఇలా ఈ భగవంతుడు మనసు బుద్ధుల దృష్ట్యా అంతర్గతంగాచూస్తుంటె అవగతమవుతున్నవాడు. అతనిలో పూర్తిగా మనం తాదాత్మ్యమయితె అప్పుడు పరాత్పరుడు కూడ అతడేననిపిస్తూ ఉండవచ్చుగాక.

పరాత్పరుడినుంచి మహత్ కలిగింది అన్నప్పుడు మనం "హుం" అన్నట్లు అహంకారమైన సమష్టిమహత్ కలిగిందనితెలియాలి. అది పైనుంచి క్రిందికివచ్చే అంతరణ లేదా అవతరణ అన్నాపరవా లేదు మొదట్లో. ఆ మహత్‌లోని బుద్ధి నుంచి శబ్దతన్మాత్ర ఉద్భవించింది. అంటె శబ్దభావమని అర్థం. దానియందు యీ బుద్ధికి అభిమానం కలిగింది. దాంతో శబ్దం ఉత్పన్నమయింది. ఆ శబ్దాలు వేదాలుగా నయినయి. వేదాల్లో అనేక భావాలు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు, భావాలు పుట్టి ఆకాశం వాయువు, అగ్ని, జలం, నేల

ఇవి కలిగినయి. ఇవి ఇలాకలగడానికి కారణం బుద్ధి యొక్క అభి మానం ఆభావాలయందు ఉండటమె. అలాటి స్థితిలో పరాత్పరుడు తన నిశ్చైతన్య స్థితి మాని భగవస్థితిని పొందినాడనేది గమనీయం. అనగా అహంకారం, బుద్ధి. పంచభూతాలకయిన తన్మాత్రలు ఇవి అన్నీ కలిసి ఉన్న స్థితి భగవంతుని స్థితి అయి ఉండవచ్చు. వీటిలో అహం కారమనేది పూరణము. బుద్ధిప్రధానము. ఈ రెంటినీ చిదాభాసుడనే పేరుతో పిలుస్తాము. ఈతడిసంకల్పం నుంచి జీవుడు పరిమితిని పొంది తాను వేరనుకొనేస్థితి కలుగబోయేవరకూ భగవంతుని స్థితే.

జీవుడు పరిమితి పెట్టుకొన్నక్షణాన అతడికిచిత్తమువేరుగా కలి గింది. అతడు తనభ్రమను ఆధారంగాచేసి సృష్టినిచేయటం ఆరంభిం చాడు. తన శరీరాన్ని తానే చేసికొంటున్నాడు. ఈ ప్రపంచాన్ని భ్రమ ద్వారా ఊహించి ఆనందిస్తున్నాడు. దుఃఖిస్తున్నాడు—మళ్ళీ విచారణ చేసి తాను భగవంతునిలో ఐక్యంకావాలనీ చూస్తున్నాడు. కనుక చిదా కాశమె భగవంతుడు అందులోనే యీ మహాకాశం కూడ ఇమిడిఉంది. జీవుని చిత్తాకాశం కూడ ఇమిడి ఉంది. జీవుడుచూసే యీ ప్రపంచ మంతా ఆచిత్తాకాశంలోదే. ఆచిదాకాశంలోదే. ఈ చిత్తాకాశసృష్టిని ఉపసంహరిస్తే అదంతా చిదాకాశంలో కలిసి పోతుంది. స్వప్నంలో ఎన్నో కష్టసుఖాలు పొందుతుంటాం.అదంతా అనుభవం చేస్తుంటాము అబద్ధమైనాసరే. అబద్ధమని నిద్రలేచి జాగ్రతకు వస్తేగానితెలీదు. అప్పుడే ఆసుఖదుఃఖాలునాశనమయేది. అలాగే మన చిత్తాకాశంవదలి చిదాకాశంలోకలిస్తేనే యీ ప్రపంచంలో జాగ్రతలో మనకు కలుగు తున్న కష్టసుఖాలు లేవనితెలిసేది. లేకుండాపోయేద. అందుకే ఈ సమష్టిమనసును—చిదాకాశాన్ని—భగవంతుని తెలియవలసిన అవసరం కలగటం. అందుకే ఈ సృష్టి—కనుపడేది—నీ చిత్తాకాశం చేసే ఆలోచనే తప్ప మరేమీలేదని తెలియుమనేది. ఇది అబద్ధమనే సంగతి తెలిసేటప్ప టికి భగవంతునిలో చేరటం అవుతుంది. నిద్రలేవంగానే స్వప్నంలో చూసిందంతా అబద్ధమని తెలిసినట్లు,

ఆభగవంతుడే జ్ఞేయం—తెలియ వలసినవాడు. ఆచిదాకాశమే పొందదగింది. ఈ ప్రపంచాలన్నీ ఆయన కైన చిదాకాశంలో కలిగిన సంకల్పసృష్టే. జీవుని సృష్టులు కూడ ఇందులోనే ఉంటున్నాయి అనేది బుద్ధిచేత తెలిసి అనుసంధానంచేసి, అనుభూతిచేయ కలిగితే జీవుడు భగవంతుడవుతాడు, పరాత్పరునిలో చేరుతాడు.

ఈ జ్ఞేయమయిన భగవంతుడు-అపైన పరాత్పరుడు వెలుగుల కెల్ల వెలుగు. అంధకారం అనేదె అతడి పరిసరాల్లో ఉండదు.అతడికి పరిసరాలనేవి మాత్రమెక్కడున్నాయి గనక! అజ్ఞానికె పరిసరాలు.జ్ఞేయమును తెలిసికొన్నజ్ఞాని అతడి పరిసరాల్లో ఉంటాడు అనచ్చు.అప్పుడతడికి అంధకారము కన్పడదని పిస్తుంది, అజ్ఞేయం ప్రతివాని హృదయంలో ఉన్నదే అయినా, జ్ఞానం కలిగినవాడే ఆ జ్ఞేయాన్ని ఎరుగ గలడు.

19-23 క్షేత్రం అనేది ఒకశరీరం. వస్తువు లేదాజంతువు ఏదయినా సరెనని తెలిసికొన్నాం, క్షేత్రజ్ఞుడంటె దాన్ని నడిపిస్తున్న వాడు. అందులోవుండి "నేను" "నేను" అంటున్నవాడు. సత్ చైతన్యం—అనచ్చు. వస్తువులో కూడ దానిని వ్యక్తంచేసేగుణాలను ఏదైతే కలిగి ఉన్నదో, అదే క్షేత్రజ్ఞుడనవలసి ఉంటుంది. అది మన భావాన్ని తెలిపే పదం అనేది మరువద్దు.

ప్రకృతి అంటే ప్రపంచంలోని సర్వమైన శరీరాలు,వస్తువులూ సహా అన్నిటిని కలిగి యున్నదేదో అది. గాలితో సహా అన్నీ యీ ప్రకృతే. జడమైనదిది. అన్నిసమగ్రంగా చూసి ప్రకృతి అని అర్థం చేసికోవచ్చు. పురుషుడు అంటె, ఈ ప్రకృతి-యీ విధంగా ఉండటానికి ఆధారమైనవాడు అనితెలియాలి. నియతి.ఇది తిరిగి ఇంద్రియాతీతమైనభావం. ఒకానొక శరీరంలో—క్షేత్రంలో క్షేత్రజ్ఞుడెలాగో, ఈ ప్రకృతి యంత్రంలోనూ పురుషుడంతె. అతడె భగవంతుడు. ఈ శరీరాలన్నీ ప్రకృతిలో భాగాలయినప్పుడు పురుషుడైన పరమేశ్వరుని

లో అంశలే. ప్రతిక్షేత్రంలో ఉన్నక్షేత్రజ్ఞుడున్నూ అంశ అన్నంత మాత్రంచేత బియ్యపురాశిలో ఒకబియ్యపుగింజఅనీ పలుకు అనీ అర్థం చేసికొనవద్దు. పురుషుడే ఆ ఒక్క క్షేత్రంలో ఉంటూ 'ఆత్మ' అనీ,క్షేత్ర జ్ఞుడనీ పిలువబడుతున్నాడు.అలా తెలియబడుతున్నాడు అని తెలియటం సమంజసం.

ఇచ్ఛ ద్వేషం సుఖం దుఃఖం ఇంద్రియాలు ఇవన్నీ ప్రకృతి లక్షణాలు. పురుషుని లక్షణాలుకావు. ఫలానిపని ఇలా ఎందుకు జరిగింది అన్నప్పుడు సమాధానం వ్యక్తి (పురుషుడిలోని అంశ) ఏదో చేశాడు అనటం సరికాదు. మరి భగవంతుడిలా చేశాడంటామే! అదేమిటి? ప్రకృతి కూడపరమేశ్వరునిలోని భాగమేకనక మామూలు సమయాల్లో శివు నాజ్ఞలేందే చీమైనాకదలదనీ అన్నింటినీ భగవంతుడే చేయిస్తు న్నాడనీ అంటాము: కాని ప్రకృతినీ, భగవంతునీ విడివిడిగా అర్థంచేసి కొనే జ్ఞానార్జన సమయమిది. ఇప్పుడు ఫలాని పనికి కారణం పురుష డనటం సరిపోదు కార్య కారణం వల్ల జరుగుతున్నదనీఅది నియతి అనీ తెలియాలి. ఈ నియతే స్వభావం అనబడుతుంది. దేవుడు అనబడు తుంది. ధర్మం అనబడుతుంది. ఎవరెవరి సంస్కారానికి తగినట్లుగా వారి వారికి, ఆమాటలు చెప్పబడినయి. అర్థంచేసికొనటం నీవంతు అను భూతికోసం అన్వేషిస్తూ. ఇది జ్ఞాన విషయం.

అలా పనులన్నీ ప్రకృతే జరిపిస్తూ ఉంటే పురుషుడు సుఖ దుఃఖాలను వచ్చినవి వచ్చినట్లుగా అనుభవిస్తూ ఉంటాడు. ఇతడికి నిజానికి ఇంకోపనిలేదు. ఈ ప్రకృతిలోని గుణాలను అనుభవిస్తూ ఉం టాడు. ఇంతేచేసి ఊరుకొంటే అసలు చింతేలేకపోను. అవతరణే ఉండకపోను. దిగి పోవటమే లేకపోను.

అతడుచేసే ఒకానొక పెద్ద తప్పిదమేమిటంటె అక్షేత్రంతో తాదాత్మ్యం అవడం.అదె అవతణం.దానివల్లనె పరమాత్మ జీవుడుగా అవతరణ చెందుతున్నాడనవలసిరావటం, ఎలా? తాను పరమాత్మ

అనే విషయం మరచిపోవటం—పైగా—తాను ఈ దేహమేనను అనుకోవటం అనే ఈఅవాంఛనీయమైన తప్పిదాన్ని చేసిన వాడయిజీవుడుగా అయిపోతున్నాడు. జీవునికి "భ్రమ" ఉత్ప్రేరక పదార్థమై ఉంటోంది. దీనిని తొలగించుకోవాలంటె ఏంచెయ్యాలి అనటానికె నాల్గో అధ్యాయంలో "అకర్మణిచ కర్మ యః పశ్యేత్ సః బుద్ధిమాన్" అన్నాడు. కేవలం ఆ అనుభవం తప్ప ఇంకోపని యేమీ తాను చేయటల్లేదనె అనుభూతి సాధనగాచేసి పొందాలన్నారు.

సంసారం సంసరణ మయేది. అంటె మళ్ళీ మళ్ళీ కలుగుతూ ఉండేది. తాను ఉన్నాడు. తనకు దేహము ఉన్నది. ప్రకృతి తనచుట్టూ ఉన్నది. దానికి గుణాలున్నాయి. వాటిని ఆ "నేను" అనుభవిస్తూ ఉంటాడు. ఆ ప్రకృతి,—శరీరం—పెరుగుతుంది. ముసలి దవుతుంది. చచ్చిపోతుంది. తానలాగె ఉంటాడు. తాను పరవ్రుడు_పురుషోత్తమస్థితిలో ప్రకృతిని కూడ తనలోని భాగంగా కలిగినవాడే. ఇప్పుడు తనకు కలిగిన కోరికల్ని — తాదాత్మ్యంవల్లకలిగే ఇచ్ఛల్ని — తీర్చడానికే ఈ ప్రకృతి. ఒక శరీరంగాఉన్న తను చనిపోయినా మళ్ళీ ఇంకో శరీరాన్నిఆ 'నేను' కు కల్పించి పెట్టుతూఉంటుంది. ఇలా పురుషుని(ఇప్పుడు అతడు జీవుని స్థితిలో ఉన్నాడుగాక) ఆశ్రయించి అతడు ఏఏగుణాలను అనుభవించాలని కోరితె ఆగుణాలను సంతరించి పెట్టుతున్నది. అందుకు తగిన మనోబుద్ధీంద్రియాలను ఇస్తున్నదన్నమాట, ఆ 'నేను' కోరినకోరికకు తగినట్లుగా ప్రకృతి తనను తానుమలుచుకొని శరీరాన్ని సరఫరా చేస్తోంది. ఈవిధంగా ప్రకృతి('తత్' అయిన)జీవునకు సుఖదుఃఖాల అనుభవాలకు కారణమవుతున్నది. ఒక శరీరంపోయి ఇంకో శరీరం "నేను"కు రావటంకూడ"అస్యగుణసంగః" అనే దాని అర్థం ఇదె. గుణాల పాళ్ళను బట్టి వృత్తం—అంటె శీలం—ఉంటుంది. ఈ ఈ పాళ్ళుమార్చుకోగలిగింది బుద్ధి. అది మనిషికున్నది, ఉపయోగించుకొనేవాళ్ళు తక్కువ.

పురుషుడే శరీరంలో ఆత్మగా క్షేత్రజ్ఞుడుగ 'నేను'గా ఉంటున్నాడు. అది ఒక స్థాయి. జీవన్ముక్తస్థాయి వేఱు. ఉపద్రష్టగా అనుగ్రాహకుడుగా, పాలకుడుగా భోక్తగా పరమేశ్వరుడుగాకూడ ఉండేది అతడె. ఇన్నిగా ఎలా ఉంటాడంటే-చిదాభాసుడైన భగవంతుడు కేవలం సంకల్పంవల్ల సృష్టిచేస్తున్నాడు. అంతేకాదు. ఒకానొకజీవుడు తన చిత్త చైతన్యంతో సృష్టిచేస్తుంటే చూస్తూ అనుమతిస్తున్నాడు. ఈ భ్రమాత్మకమైన పనులన్నిటినీ భరిస్తున్నాడు. పరిపాలిస్తున్నాడు. అనుభవిస్తున్నాడు. అందుకే ఉపద్రష్టానుమంతాచ భర్తాభోక్తా మహేశ్వరం అనటం.

జరిగిన దానికి ప్రతిస్పందించకుండా సాక్షిగా ఉండే స్థాయి జీవన్ముక్తస్థాయి. ఒక్క విషయంలోకాదు; సతతమూ ఉండగలగాలి. పరమాత్మస్థాయిలోసర్వజ్ఞానసంపూర్ణత్వమునొందిన స్థితి. సర్వప్రకృతినీ శాసించ గలిగిన స్థితి అది. ఈ స్థితిలో 'ఆత్మ'-పరుడు అనగా స్వతంత్రుడు. అంతటానున్నవాడు. ఈ ప్రకృతి పురుషుల స్వభావ గుణాలన్నీ తెలిసి అనుభూతి చేసేవాడు. అతడికి ప్రకృతి శరీరాన్నివ్వలేదు. అదీ అతడు ప్రకృతిని జయించాడన టానికి లక్షణం. తను ఒక జన్మమెత్త తలచుకొంటె అప్పుడు తానే ప్రకృతిని ఆదేశించి దానిని పొందుతాడు.

24-26. సర్వత్ర అంతర్యామియై ఉన్న బ్రహ్మన్ని-అంటే పురుషుణ్ణి-ఈ ప్రకృతిని, దాని గుణాలనీ స్పష్టంగా అవగాహన ఎవరు చేసుకొంటారో వారు మళ్ళీపుట్టరు.

25-26 ఈ అవగాహన చేసికొనటం అనేకమంది అనేక విధాలుగా సాధనలు చేయటం ద్వారా కలిగించుకొన్నారు. ఇప్పుడు నీవుకూడ వాటిలో ఏదో ఒక మార్గం అవలంబించి అవగాహనచేసికొనుసాంఖ్య యోగం అవలంబించి, (పరాత్పరుడు-ఈశ్వరుడు-జీవుడు-అహంకారం-చిదాభాసుడు-చిదాకాశం-చిత్తాకాశం-శబ్దాదితన్మాత్రలు. శబ్దాది గ్రహణకాలయిన ప్రకృతి-ఇవన్ని సాంఖ్యశాస్త్రం)పరాత్పరుని ఎఱిగి

తరించుతున్నారు కొందరు. ఇంకా కొందరు ధ్యానంలో—మనసూ బుద్ధీలను ఒకే ఆలోచనలో నిశ్చలంచేసి, పరమేశ్వరుని దర్శించితరిస్తున్నారు. కర్మయోగులు సర్వమూ ఆపరమేశ్వరుని కర్మలేనని ఎరిగి కర్మఫలంమీద ఆశలేకుండా చిత్తశుద్ధిపొంది తరించుతున్నారు. ఇతర్లు తమకు ఏమీ తెలీకపోయినా ఉపాసనా పరులైన ఇతర్ల నుండి విని తెలిసి ఆవిధంగా ఉపాసించి ఈ పుట్టుక చావుల్లను అతిక్రమించిన వారవుతున్నారు.

26–27 ఈ చరా చర ప్రపంచంలో ఏమున్నా అది క్షేత్రమూ క్షేత్రజ్ఞుడూ; వీటి సంయోగమని తెలిసికొను మంటున్నాడు శ్రీకృష్ణుడు. అచరాలైనవి కేవలం ప్రకృతేగాని అక్కడ "నేను" లేదు గదా అని సందేహం కలగటం కద్దు. "నేను" అనేభాషదానికి లేకపోవచ్చు. తాను తానుగా అభివ్యక్తమవుతున్నది కదా. దానిని తెలిసికొనే వాని తెలియ బడుతున్నది నేనుగా. అందువని, సర్వత్ర ఈ క్షేత్రమూ, క్షేత్రజ్ఞుల సంయోగం వల్లనె ఈ ప్రపంచం తెలియ బడుతున్నది. ఈ క్షేత్రమూ క్షేత్రజ్ఞుడూలు ఆ పరమేశ్వరుని కుడి ఎడమల్లా ఉన్నాయి.

28. ఆ పరమేశ్వరుడు సర్వభూతాల్లోనూ సమంగా ఉంటాడు. ఆయన్ను ఆశ్రయించి ఉంటున్న ప్రకృతి భేదంగా ఉంటున్నది. అందులోని ఎలెక్ట్రానులు ప్రొటానుల సంఖ్యల్లో తేడాఉంటున్నదన్న మాట. ఆయన చుట్టూ చేరిన ఈ ఎలెక్ట్రానులూ ప్రొటానులూ—అంటె సూక్ష్మశరీరంలోని వాసనలు వేరు వేరుగా ఉన్నవన్న మాట. అందువల్లనె మనుష్యులుగా జంతువులుగా స్థావరాలుగా భేదాన్ని విలయిస్తూ ఈస్థూల శరీరాలు ఉంటున్నాయి. ఈ ప్రకృతులతో 'ఆయన' అంటే పరమేశ్వరుడు తాదాత్మ్యంచెంది—అంటె తాను పరమేశ్వరుడని మరచి పోవటమేగాక, ఈ తాను క్షేత్రమేను అనుకొంటూనేను పుట్టాను నేను చస్తాను—అంటూఅను భూతిచేస్తుంటాడు. అలాగాక ఈనేనునువీటన్నిటితో విడగొట్టి దానిని భగవంతునితో తాదాత్మ్యంచేయకలిగితె ఆ నేను కు

చావుపుట్టుకలు లేవు అనిపిస్తుంది. ఈ తాదాత్మ్యం పోయేదెలా? ఆతాదాత్మ్యం వచ్చేదెలా? దేహం కల్పన అని ఎఱుగటం వల్ల అదిసంభవమవుతుంది, స్వప్నం అబద్ధమని ఎఱుగటంవల్లనేగదా మనం స్వప్నంలోని అనుభవాన్ని మరిచి పోగలుగుతున్నాం. జాగ్రతలోకి రావటంచేత స్వప్నం అబద్ధం అనుకొంటున్నట్లె ఈ జాగ్రత నుంచి జ్ఞానంలోకి వెళ్ళినప్పుడు ఈ జాగ్రత్తా పట్టి అబద్ధమని తెలుస్తుంది. అలా ఎఱిగిన సాధకుడు సరిగా చూడగల్గినవాడు అని శ్రీకృష్ణుడంటున్నాడు.

29-30 ఆ ఎరిగిన విషయం విస్మరించడమంటే ఆత్మహత్య చేసినవాడవుతాడు. ఎఱుకతోనే ఉంటె మృత్యువు నతిక్రమించిన వాడవుతాడు. ఈశ్వరుణ్ణి సర్వత్ర చూస్తున్నవాడు ఇంకొకణ్ణిచంపడం అనేదే ఉండదుగదా.

ఐతె హింస చేయరాదు అనటం ఏమిటి? అది ఒకక్షేత్రం ఇంకో క్షేత్రానికి చేస్తున్నపని. ప్రకృతి ఎలాచేస్తే అది అలా జరుగుతుంటుంది. 'నేను' చేసిందనటం జ్ఞానదృష్ట్యా సరికాదు. గాండీవం క్రిందకు వదలబడింది, 'నేను' వదిలాను అంటావునువ్వు. ఆనేను వ్యవహారంతో మిళితం చేయబడ్డనేను. నిజానికి ఆపనిచేసింది నీశరీరం, అదినీబుద్ధి ననుసరించి నడుచుకొంటున్నది. నీబుద్ధి నీవాసనల ననుసరించి పరుగిడుతున్నది. ఈ వాసనలే నీప్రకృతి. అది త్రిగుణాత్మకము. గుణాల జల్లెడన్నమాట. ఆచిల్లులసంఖ్యను నీవు-నీబుద్ధిమనసులు-మార్చగలవు. సత్త్వగుణాల చిల్లులు పెంచి రజస్తమోగుణాల సంఖ్యలను తగ్గించు. నీప్రకృతిని నీవు మార్చుకోగలవు ఆవిధంగా. ప్రకృతె అన్నిపనులూ చేస్తోందిగాని, నీవు అనేమూలపదార్థంకాదనేది అవగాహన చేసికోవాల్సినట్టిది. తర్కం చేయాల్సిందికాదు,

31. ఈ ప్రపంచం, ఈ మనుష్యులూ విడివిడిగా అవుపడుతున్నా, అంతా ప్రకృతే, నిజానికి సర్వమూ ఆ పురుషుడే అనేభావన

పొందాలి. ఎప్పుడీ భూత సమూహాల నానాత్వము ఒక్క ఆత్మయందే నెలకొని ఉండటం జరుగుతుందో తెలిసినవాడు బ్రహ్మస్వరూపుడై పోతాడు. సర్వమూ తానే వనే స్థితి స్థిరమై నిల్చినపుడు బ్రహ్మమే అయి పోతాడు. ఈక్షేత్రంలో ఉండి తాను చూస్తున్నా ప్రకృతి చేసేకర్మలలో సంగము లేకుండా ఉంటాడు. ఇదె సాధనచేయాలి. అది చేయకుండ అంతా ఒక్కటే అనివట్టిమాటలు చెప్పటం చాలదు. ఏమీచేయనివాడు కావాలిముందు, సంగములేని తనాన్ని సంతరించి. అది సాధన.

32. ఆకాశం సర్వత్ర ఉంటున్నది. అందులోనె మన శరీరాలు తిరుగుతూ ఉంటున్నవి. ఆకాశం ఉన్నది గనకనె శరీరం అందులో ఉండ గలుగుతున్నది. అలా ఆకాశం ఉన్నదనె సంగతి ఇంద్రియాలకు తెలియటల్లేదు. బుద్ధితో తెలిసికొనాల్సిందె. అలాగే భగవంతుడు సర్వత్ర సూక్ష్మరూపంలో ఉన్నట్లు కూడ విచారణచేసి తెలిసికొనాల్సి నట్టిదె.

33. సూర్యుడు ఒక్కడే ఎలా అన్నిలోకాల్నీ ప్రకాశింపజేస్తూ ఉంటాడో అలాగే పరమాత్మ యీ క్షేత్రాలన్నిటిలో చైతన్యాన్ని ఉంచి ప్రకాశింపచేస్తున్నాడు.

34. ఈ విధంగా క్షేత్రక్షేత్రజ్ఞుల విభేదాన్నీ-భూతాలు ప్రత్యేక ప్రత్యేక ప్రతిపత్తి కలిగి ఉన్నవనే పొరపాటునూ-జ్ఞాననేత్రంచేత ఎవరు తెలిసికొంటాడో అతడు పరబ్రహ్మాన్ని పొందుతాడు.

ఈఅధ్యాయంలో జ్ఞాన విషయం సమగ్రంగా చెప్పటమయింది. కర్మ షట్కంద్వారా కర్మలు చేయటం ఎలాగో తెలిసి, భక్తి షట్కం ద్వారా అంతర్దృష్టినెరిగి పరుని విభూతి తెలిసి ప్రేమను కలిగింపజేసి కొన్నమీదట జ్ఞానవిషయం తెలిసి బ్రతుకు నడపటం ఎఱుగాలి. అంత వరకూ పరమాత్మను పొందినవాడు కాడు. బ్రతుకులో పరమాత్మను వెలయింప చేసికొనటమె ఈ జ్ఞానషట్కంలోచెప్పే విజ్ఞానం. ఈ

అధ్యాయం-ముఖ్యంగా-జ్ఞానపేటిక. ఈ పేటిక తెరవడానికి కర్మయోగం భక్తియోగం అనేతాళం చెవులతో ప్రయత్నించాలి. ఆభూతద్దాల్లోంచి చూసి తెలిసికొనాలి. అనుభూతి చేయాలి.

భగవంతుడె ఈ శరీరంలో నే నై ఉంటున్నాడు. ఈ ప్రకృతి గుణాలకు బద్ధుడవుతున్నాడు. ఇది సక్తి స్థాయి. ఎందుకీసక్తి? ప్రకృతి అనేదా విజృంభించడానికి. తనెందుకు ఈ ప్రకృతినలా విజృంభింపచేయాలనుకొంటున్నాడు? తానె ఆ ప్రకృతిపరిమితమైన ప్రకృతి అనుకొనటంవల్ల ఆపరిమితిని దాటివ్యాపించాలనే చీకాకులో పడుతున్నాడు. నిజానికి తానే వ్యాపృతుడని, బృంహింతుడని బ్రహ్మమనే మాట మరవటం చేత: ఇది తెలిసికొంటె మళ్ళీ ఈశ్వరుడవుతాడు. అది తిరిగి పరమాత్మ స్థాయి,

మనది గుణబద్ధ జీవితం. ఈ పరిణితిలో దైవాన్ని విస్మరించటం కష్టం. దైవంఏమిటో తెలిస్తె ఈ గుణబద్ధ జీవితాన్నె విస్మరించటం కష్టం. ఆ సాధన సన్న్యాసులలో మనం చూడగలం. సాధన మనమూ చేయాలి. సన్న్యాసులం కావాల్సినపనిలేదు, కావటంమనోబుద్ధులద్వారా కావాలని ఇక్కడిబోధ. ఇక్కడనె జీవిస్తూ ఈశ్వరుడై మనగలిగే సాధన భగవద్గీత ఇస్తున్నది. అంటే గుణాలను-విస్మరించటం అక్కర్లేదు-నియమించికూడ సాధనచేయవచ్చునని బోధ.

ఇక ముందు అధ్యాయాల్లో గుణాల ప్రకాశమూ సాధనవల్ల కలిగే స్థితి ముందు చెప్పబోతున్నారు.

ఇది పదమూడవ అధ్యాయం.



# శ్రీమద్భగవద్గీతామననము

## గుణత్రయ విభాగయోగము

## (పదునాల్గవ అధ్యాయము)



త్రిగుణాలకు అతీతుడవై అమనస్కతను సాధించు.

1. క్షేత్ర క్షేత్రజ్ఞులను వేరుచేసి చూచే జ్ఞానాన్ని తెలిసికొనటం మొదటిపని. తరువాతి సాధన త్రిగుణాలకు అతీతుడు కావటం. దాన్ని బ్రతుకులో అభ్యాసం చేయటం అవసరం. పూర్వం మునులు ఈమార్గం ద్వారా సిద్ధినిపొందారు. ఇదిచదివేసి, జ్ఞానం తెలిసింది అనే వాళ్ళంతా సిద్ధినిపొందలేరుగాక. అభ్యాసంచేసి బ్రతుకులో సాధనచేసినవాళ్లే సిద్ధిని పొందగలరు.

2. ఏమిటీ సిద్ధి అనుకొంటావేమో—పైజ్ఞానం తెలిసి, నావలె సాధన చేస్తున్నవారు ఈ సృష్టిపోయి మళ్ళీ మరొకసృష్టిఅయినప్పుడు కూడ పరాత్పరుని నుంచి విడిపోయి వచ్చి పుట్టరుగాక. ప్రళయంవచ్చినప్పుడు చనిపోవటమనేదే వారికి ఉండదు. తామెప్పుడూ ఆపరాత్పరుడేను అనే అనుభూతితో ఉండిపోయి ఉంటారని అర్థం. ఈ జ్ఞానాభ్యాసాలవల్ల జీవుని వాసనలు నశిస్తవికనుక ప్రకృతి శరీరాన్ని సృజించడానికి తగిన కారణం వెతకలేక ఊరుకొంటుంది. అందుకని పుట్టుకగాని చావుగాని ఉండదు.

ఈ ఉచ్చస్థితిని అభ్యాసం ద్వారానే రావాల్సి ఉన్నది. భగవద్గీత చదవడం శ్రవణంచేయడం, ఆలోచించడం ద్వారా మననం చేయడం—ఇవి ముందుచేయాల్సిన పనులు. తరువాత నిధిధ్యాసనముచేయాలి అంటె తెలిసిన దానిని మనసులో అనుసంధానంచేయాలి. బ్రతుకులో వర్తింపచేయాలి అన్నమాట. అది చేతనయేదాకా మళ్ళీ మళ్ళీ చదివి, విని, గురువు అనుగ్రహంతో—అదె భగవంతుని అనుగ్రహం కూడ—పురోగమించాలి.

3-4 'మహత్" అంటారు ప్రకృతిని. ఈ 'ప్రకృతి' కేవలం నిర్జీవవస్తువులేననుకోవద్దు. సత్ అసత్ కూడ అయిన మనసు కూడ ప్రకృతే. ఈ మనసుకు త్రిగుణాలని ఉన్నాయి. ఆ త్రిగుణాలతోకూడిన ప్రకృతినే మహత్ అనటం. అదె బీజాన్ని ఉంచడానికయిన యోని అంటున్నాడు భగవంతుడు. అందులోనుంచే సర్వభూతాలు పుట్టుతున్నయిట. ప్రపంచమంతా ఈ ప్రకృతీ పురుషుల సంయోగం వల్లనె పుట్టిందనే దాని కర్థమిదె. స్త్రీపురుషసంయోగం మాత్రంచాలదు. ఈశ్వరేచ్ఛ ముఖ్యం. నేను ముఖ్యం. ఈ ప్రకృతి తల్లి. నేనుతండ్రిని.

5. ప్రకృతిలో త్రిగుణాలున్నాయి. అవి సత్త్వం రజస్సుతమస్సు అనేవి. మనసును ఇవె కలిగిస్తున్నాయి, ఈ మూడూ పోతే ఇకమనసు లేదన్నమాట. బీజం అని చెప్పిన "నేను" అనేదాన్ని దేహానికి బంధించి ఉంచేవి ఈ మూడు గుణాలె. 'నేను' నాశరహితమైంది. గుణాలునాశం అయేవి. ఇవి ఆ "నేను"ను బంధిస్తున్నవనితెలిసికోను. నేను అనేదె సమగ్రమైన స్థితిలో పరాత్పరుడె. ఒక శరీరానికి, ఒక మనసునకు పరిమితం చేసుకొని 'నేను' అంటున్నప్పుడు మాత్రం కేవలం త్రిగుణాత్మకమైన మనసు అవుతుంది. ఆమనసునుంచే లక్షపుట్టుతున్నయి. కామంక్రోధం వగైరాలు సత్ వృత్తులు దుర్వృత్తులు, వికారాలు, ప్రాణాలు ఇంద్రియాలు శరీరాలు అన్నీని. ఇవన్నీ తానెననుకొంటున్నది కాదు. వాటిలో కొన్నిటిని మాత్రమే తానుగా భ్రమిస్తున్నది. ఆనేను. అది అప్పుడు జీవుడనబడుతున్నది. అలా పరిమితంచేసికొనటమె అవిద్య. దీని నెరుగడమె విద్య. ఆ విద్యే సూర్యుడు. సావిత్రి జ్ఞానము. జపంచేసేవారికి మూల పదార్థం. విరాట్టు. దీనిని అనుభూతి చేయడానికి అమనస్కయోగం చేయాలి. దానికి త్రిగుణాల్ని అతిక్రమించాలి. అందుకని వాటి లక్షణాలేమిటో భగవానుడు చెప్పబోతున్నాడు

6. ఈ మూడు గుణాల్లో సత్త్వమనేది శుభ్రతనూ, ఉపద్రవరహితమైన సుఖాన్నీ, చైతన్యాన్నీ అభివ్యక్తంచేస్తూఉంటుంది. దీని వల్లనేసుఖాసక్తి కలుగుతున్నది. జ్ఞానార్జనా సక్తికూడ దీని వల్లనె కలుగుతున్నది. ఈ [illegible]కి ఎప్పుడయితె కలుగుతున్నదో అప్పుడు

బంధమేకదా! అనాసక్తితోచేసిన కర్మ వల్లనే బంధం ఉండదుగాని ఏసక్తితో చేసినా అదిబంధమే. సత్త్వగుణంవల్లకలిగేసక్తి వల్లసుఖం పొందాలనీ జ్ఞానం తెలియాలనీ, ఊహలు పుట్టుతయి. మిగతాగుణాల వల్ల కలిగే సక్తులకంటె ఇదెనయం; మంచిదిన్నీ. కానిఇదీ బంధమె.

7. రెండవది, రజోగుణం ఇది రాగాత్మకమైనట్టిది. ఆశా పూర్ణమయినట్టిది, ఏదో చెయ్యాలి, దేనినో లాభంగా పొందాలి అనే కాంక్ష దీనివల్లనె కలుగుతోంది. అందుకె కర్మలు చేయాలనే సమారంభం కలుగు తుంటుంది. ఇది చేయాలి–అది కావాలి–అనేసక్తి ఈరజో గుణంవల్ల కలుగుతున్నదే. ఆ చెప్పిన సక్తితోనే ఈ గుణం 'నేను'ను బంధిస్తున్నది.

8. తమోగుణం మూడవది. దానిపుట్టుక అజ్ఞానంలో. ఇది అందరికి మోహాన్ని కలిగిస్తూ ఉంటుంది, "నేను' అయిన Total mindను (తత్‌ను) తెలియనీయక శరీరాన్నే నేను అనిపించుతూ ఉంటుంది. ఈ గుణము కేవలం ధ్యానంలో కూర్చొని జ్ఞానోపాసనం చేస్తున్నప్పుడు ఎప్పుడో మాత్రం ఈ మోహం విడిపోవచ్చుగాక, మిగతా వ్యవహారంలో మనకు ఎప్పుడూ ఈ తమస్సు ఉంటూనె ఉంటుంది– శ్రీ కృష్ణునిలా నిరంతరం జ్ఞానానుసంధానం చేస్తుంటే తప్ప. అది ఆవరిస్తూనే ఉంటుంది మనను. పొరపాట్లు, ఆలస్యం, బద్ధకం, నిద్ర ఇవన్నీ ఈ గుణపు లక్షణాలె. నిద్రమొదలైన వాటియందు సక్తిని కలిగింపజేస్తూ మన్ని బంధిస్తుంది ఈ తమోగుణం.

9. సత్త్వగుణం జీవిని సుఖంలో తగుల్కొ జేస్తుంది.రజోగుణం కర్మలు చేయటంలో తగుల్కొ జేస్తుంది. తమోగుణం జ్ఞానాన్ని ఆవరించే అజ్ఞానమై నిద్ర పొరపాటు మొదలైన వాటియందు చిక్కుకో జేస్తుంది,వ్యక్తికి ఈ మూడు గుణాలూ ఉండటం న్యాయం. తమస్సు వదిలేస్తాను–నేను నిద్రపోను అనటానికి సాధ్యంకాదు. అలాగే నెత్తిన ఏదో ఎగిరివచ్చిపడితె తెలిసికో ప్రయత్నంచేయను అనటానికి సాధ్యం

కాదు. సత్త్వగుణం ఊరుకోనివ్వదు. రజోగుణం సంగతి వేరే చెప్పనే అక్కర్లేదు. అలా ఇవి శరీరంతో పాటుగా ఉండేవే అయితే ఇక వాటిని గురించి తెలియడం ఎందుకు అని సందేహపడుతున్నట్లున్నావు. ఎందుకంటె (1) భ్రాంతిని కలుగజేస్తున్నవని(2) వాటిలో మార్పులు తేగలగటం సంభవం. శరీరం కానట్టి నేనుకు "నేను శరీరమేను" అనే భ్రాంతిని ఈమూటిలో చివరిగుణం కలుగ జేస్తోంది. ఆ భ్రాంతి ఆధారంగా, ఇదుగో యీయీ పనులు చేశాను. ఇంకా చేస్తాను. అనే ఆశ రెండోగుణం పుట్టిస్తూ నీవు శరీరమేను అనే భ్రాంతిని స్థిరంచేస్తోంది. సత్వగుణం నీకు సుఖం ఫలానిదానివల్ల వస్తుందనె సూచననిస్తున్నది. ఇదీపతనంయొక్క వైనం. ఈ పతనం వదలి మెట్టునెక్కాలంటె తమోగుణాన్ని రాజసగుణాన్ని మించి సత్త్వగుణం వృద్ధిచేసికొనాలి. అప్పుడు "నేను శరీరం కాదు" అనేది తెలియడానికి అవకాశం వుంటుంది. వివేకం కలుగుతుంది. అజ్ఞానంపోతుంది. క్షేత్ర క్షేత్రజ్ఞ జ్ఞానం ప్రాప్తిస్తుంది. అందుకె ఈ విషయాల సంగతి నెరుగవలసిఉంది.

'నేను'ను ఈ గుణాల నుంచి విడగొట్టి బ్రతుకడంనేర్వాలి. శరీర సహజమైన గుణాలన్నీ నావేననటం సరికాదు. శరీరం తమోగుణంలో ఉన్నా 'నేను'మాత్రం విడిగా మనాలి. మనగలదు కూడాను. అందుకే హాయిగా నిద్రించిలేచి హాయిగా ఉంది అనగలుగుతున్నాము.

10. గుణాల పాళ్ళను "నేను" మార్చుకోగలదు. నేను ను ఆధారం చేసుకొని సూక్ష్మశరీరంలో ఉన్న బుద్ధిపనిచేసినదై రజస్తమోగుణాలను తగ్గించి సత్వగుణం పెంపొందించగలదు. మరొకప్పుడు సత్త్వ, తమోగుణాలనణచి రజోగుణం పెరుగవచ్చు. అలాగె ఇంకోసారి తమోగుణమె పెరుగవచ్చు. ఏగుణం ఎవరి యందెక్కువ ఉంటుందో వారు ఆ గుణపువారని చెప్తాము. అతడి వృత్తం-అంటే శీలం -దానిపై ఆధారపడి వుంటుంది.

అన్నిగుణాలకు అతీతుడు కావడానికి ఆ సత్త్వగుణంకూడ దాటటం మార్గం. అది అమనస్కస్థితి. దానిని సాధించడానికి ఈ త్రిగుణాల నెరుగటం ఒక మార్గం.

11-13. గుణాలస్థితి నెరుగడానికి—ఎప్పుడు సర్వేంద్రియాలూ తమతమ జ్ఞానంతో ప్రకాశిస్తూ ఉంటవో ప్రజ్వలమైఉంటవో అప్పుడు సత్త్వగుణమనీ ఏవోకర్మలు చేస్తూండటం లోభం, అన్నీ తనకేన నటం శాంతిలేక, చీకాకుగా నుండటం—ఇవిరజోగుణం వల్లవచ్చినవనీ అప్రకాశం,అవివేకం ప్రయత్నమే చేయకపోవటం.కర్తవ్యం చేయ టం లోపొరపాటు చెవుడు మూగ, మనసుబండ కావటం, ఇవితమో గుణమనీ తెలియాలి. జడశరీరానికి గల లక్షణాల కంటె బుద్ధీ మన సులకు గల లక్షణాలు చూచి తెలియడం మెరుగు. జీవుడు సత్, సత్త్వ రజస్తమోగుణాల కూడలిని సూక్ష్మశరీరమంటాము. అదె బుద్ధిమనస చిత్తాలు. వ్యక్తిచనిపోయినాడని ఎప్పుడంటా మంటె,ఈ సూక్ష్మశరీరం స్థూలశరీరాన్ని ప్రేమించక వదిలేసి పోదామని పోయినప్పుడు శరీరం చచ్చిందంటాం.ప్రారబ్ధ వశాత్తు శరీరం తగులబడినా, మునిగినాకూడ అలావదలివెళ్ళిపోతుంది సూక్ష్మశరీరం—అదె చావు అంటాం.

ఇవన్నీ నాకెందుకయ్యా తెలియటం అంటావేమొ. బ్రతుకు తుండగా అనేకరకాలయిన యీస్థితులు రావటానికి కారణం ఈగుణాలు అని గమనించడానికి. 'నేను' నీవు 'వాడు'లు కారణం కాదని తెలియ డానికి.

14-15. అంతేకాదు. సత్త్వగుణం ప్రవృద్ధమై ఉన్నప్పుడు శరీరం చచ్చిపోతె అతడు శ్రేష్ఠులకు లభించె అమలమైన లోకాలను పొందుతాడు. రజోగుణం వృద్ధిపొంది ఉన్నప్పుడు చనిపోతె కర్మలు చేయవలసిన వారియందు చేరుతాడు.అలాగే తమోగుణం వృద్ధిగా ఉన ప్పుడు చనిపోతే, మూఢ జంతువుల్లో చేరుతాడు. అలా ఈ సృష్టిఅంతో

వివిధమైనదిగా ఎలా తయారైందో తెలియవలసింది. అందుకని శరీరంలోని గుణాలను చేతనయినంతవరకు నిరంతరం సత్వగుణ స్థాయిలోనడిపే సాధనచేయటం మంచిది. అప్పుడు జీవునికి జ్ఞానోదయమై సక్తి, అభిమానం, తాదాత్మ్యం—అదె ప్రేమలు—వదలి సూక్ష్మశరీరం నశించడానికి కారణమవుతుంది. 'నేను' ఎప్పుడయితె ఒక శరీరాన్నివదలి మరొకదానిని పొందు తుందో అదే శరీరం యొక్కచావడం పుట్టడం అని అర్థం. "నేను" తన స్వస్థితిని మరచి పోవడం ఒకటి. ఒకానొక శరీరంతో తాదాత్మ్యం పొందటం రెండు. ఒక శరీరంతో గల తాదాత్మ్యతనువదలి ఇంకొక శరీరంతో తాదాత్మ్యం పొందటమె చావడం, పుట్టడమూను. ఇలా పుట్టడం సత్వగుణం విజృంభించినప్పుడయినట్లయితె అమలమైన జన్మపొందుతాడు అని అంటున్నారు.

ఎప్పుడో చస్తామనీ ఆతరువాత మంచి శరీరం రావాలనీ అందుకుగాను ఇప్పటినుంచీ సత్వగుణాన్ని వృద్ధిచేయవలసిందనీనా శ్రీకృష్ణుడు చెప్పేది? అనిశంక. అవును. అంతేకాదు కూడ.—

16—17 ఒక జన్మలోనే,—సత్వగుణ సన్నిభమైన కర్మకుఫలం నిర్మలమై ఉంటుంది. రాజసిక కర్మకు దుఃఖము, ఎందువల్లనంటె ఫలితంకోరి చేస్తాడుపనిని. రజోగుణ సంభవమయిన లోభంవల్ల ఫలితం చాలలేదనిపిస్తుంది. అందుకనె దుఃఖం మిగులుతుంది. తృప్తి సత్వగుణ లక్షణం. లోభం రాజసగుణలక్షణం. ఇక తమోగుణ కర్మలవల్ల అజ్ఞానమెవృద్ధిఅవుతుంది. బద్ధకంవల్ల నిద్రముంచుకొస్తుంది. త్రాగుడువల్ల కలిగేతాకాస్తసుఖం అత్యంతమైన సుఖమిది అనేఅజ్ఞానం వృద్ధిఅవుతుంది. స్త్రీపురుషసంబంధమైనకామం అనుభవించుతున్నకొద్దీ యావపెరిగినట్లె. ఈవిధంగా తెలియాలి.

సత్వంవల్ల జ్ఞానం కలుగుతుంది. అది వృత్తిజ్ఞానమూకావచ్చు ఆధ్యాత్మికజ్ఞానమూకావచ్చు. రజోగుణంవల్లలోభం, తమోగుణంవల్ల అజ్ఞానం కలుగుతవి. ఇవన్నీ బ్రతుకులో కలిగేటటువంటివే. ఎప్పుడో

చచ్చేటప్పుడూ, ఆతరువాత కలిగేవికాదు. ఇక్కడికిక్కడ కలిగే ఫలితాలివి!

18. ఇంతెందుకు.సాత్వికులు ఈమూడు రకాలైన త్రిగుణాత్మకుల్లో శ్రేష్ఠులుగా, పైనున్నవారుగా, గణింపబడతారు. రాజసికులు మధ్యస్థులుగా చూడబడతారు. తామసికులు అధోగతిలో నున్నవాళ్లుగా చుల్కనచేయబడతారు లోకంలో.

19. ఈ ప్రపంచంలో ఇలా భిన్న భిన్నమైన కర్మలనుభూతాలు చేస్తున్న వన్నపుడు, వాటిలోని ఈ మూడుగుణాలే ఆకర్మలకు కారణమైనవి అనే సంగతిని విదితంచేసికోవాలి. ప్రకృతీ దాని గుణాలూ ఆవే వీటికి కారణం. "నేను"అనే'సత్' పదార్థం కాదు అనితెలియాలి. "సదసత్"అనబడే మనసు ఈగుణాల్ని బట్టి కర్మలు చేస్తుంటున్నదని తెలియాలి. ఆమనసును నియమించి సత్త్వగుణం పెంపొందచేసి చివరకు నిర్గుణాన్ని ఆశ్రయించాలి.

ఇది బాగా అనుభవం కావాలి. ఇది అనుభవమయేదాకా ఈ అభ్యాసం-అంటే-గుణాల ప్రత్యేకమైన పనుల పర్యాలోకనం చేస్తూనే ఉండాలి. అలాచేయగా-చేయగా-చేయగా, ఎప్పటికో అనుభూతి అవుతుంది. ఈ పనులన్నీ ప్రకృతి చేసికొని పోతోంది. "నేను" ఊరికే ఇక్కడ ఉండి అధ్యక్షునిలా-సాక్షిలా-చూస్తున్నాను అనేస్థితిరావాలి. అది అనుభవంకావాలి. అప్పుడే ఆ "నేను" పరమేశ్వరుని స్థితికి ఎక్కినవాడవుతాడు.

శ్రీకృష్ణుడు ఆస్థితిలోనున్నవానిని గూర్చి "మద్భావం సోఽధిగచ్ఛతి" అంటాడు. అనగా "అతడు నాభావాన్ని పొందినవాడవుతాడు" అని. నాభావమంటె భగవద్భావం- Total mindయొక్కభావం.లేదా శ్రీ. కృష్ణుడు ఈ ప్రపంచంలో చరించేటప్పుడు ప్రదర్శించిన భావమని కూడ అనుకోవచ్చు. అదేమిటి?

20. అదేమిటంటే-ఈమూడు గుణాలనూ దాటి నిలిచియున్న భావమన్నమాట. ఈ గుణాలు దేహసముద్భవాలు."నేను" వేరుగావుంది

ఈ ప్రపంచంలో జరిగే పనులన్నీ ఆగుణాలవి. "నా"కు సంబంధం యేమిటంటే 'నా' యొక్క ప్రకాశం (చిత్), ఆపనులకు ఉపయోగించింది. అంతే. ఇంకేసంబంధమూలేదు.ఆ"నేను"త్రిగుణాలకు అతీతుడై ఉంటాడు. అతడికి యీ జన్మ-మృత్యు-జరలు ఉండవు. తాకవు. అమృతత్వ మొక్కటే ఈనేను యొక్క లక్షణము. ఇదితెలిసి బ్రతకాలి. ఎలా బ్రతకటం!జరుగుతున్నపనులన్నీ సత్త్వరజస్తమో గుణాలవల్లజరుగుతున్నవనేదిజ్ఞాపకంచేసికొనివాటికిసంబంధించిన'రియాక్షన్' ప్రతిచర్యలేకుండా ఉండటం.నేనునై అనుసంధానం చేస్తుండటం.అంటె అంతర్దృష్టి కలిగిఉండటం అన్నమాట.

21. గుణాతీతుడు కావటం ఎప్పుడో అభ్యాసంచేసిన తరువాత కలిగే సంగతి. ఆసంగతి సాధకుడికి ముందు రాబోయేది గనక, అది వస్తే ఎలా ఉంటుందోతెలియాలి అని అర్జునునికి అనిపించి,శ్రీకృష్ణుని అడుగుతాడు. ఆలక్షణాలు తెలియడమంటె అర్థం, గుణాతీతముగా బ్రతుకునెలా గడపాలో నేర్వడమె. అందుకె ఈ సాధన "అసి" శబ్ద సాధనమనటం. ప్రభో! ఈ మూడు గుణాలనూ అతిక్రమించిన వాడు ఏఏ లక్షణాలను కలిగి ఏఏ ఆచారాలను కలిగి ఉంటాడు? ఎలా మూడు గుణాలనూ దాటేది. అనిఅతడుతాడు.

22-25. గుణాతీతుడెలా ఉంటాడనే విషయం శ్రీకృష్ణుడు చెప్పనేచెప్పాడు "నాలా ఉంటాడ"ని.శ్రీకృష్ణుడి చరిత్రలోని సంఘటనలుచూస్తె అన్నిచోట్లాఅతడు గుణాతీతుడుగ ప్రవర్తించినట్లె రుజువవుతుంది. ఇప్పుడు అర్జునుడు మళ్ళీ ప్రశ్నవేస్తే కూడ"నేనుచెప్పాను గాదుటయ్యా"అనలేదు శ్రీకృష్ణుడు. చెప్పిందే తిరిగి చెప్పవలసి వచ్చినప్పుడు విసగటం కూడగుణదోషమేగదా! అదిలేదు ఆయనకు. ఆయన చెప్తున్నారు-గుణాలు శరీరంలో ఆవిర్భవిస్తూఉంటాయి.మూడుగుణాల్లో ఏది కలిగినా గుణాతీతుడు మాత్రం దానిని ద్వేషించడు. అద్వేషించకపోవటం అప్పుడే సత్త్వరజస్తమోగుణాలు తగ్గిపోవటం కలిగినట్లు

చెప్పచ్చు. అతడు ఇంకొకటేదో కావాలని కోరడు. తటస్థునివలె ఉంటాడు. గుణములచేత కదిలింపబడడు. అన్నిటికంటె ముఖ్యంగా ఒక విషయం తెలిసికొని ఉంటాడు. ఏమనంటే "కర్మలన్నీ ఈ గుణాల ప్రభావంవల్ల జరుగుతున్నయి. గుణాలే ఈకర్మలను చేయటంలో ప్రవర్తిల్లుతున్నయి" అని ఎరిగిఉంటూ ఉంటాడు. అందుకనే అతడు గుణాలకు అతీతుడైఉన్నాడనటం.

సుఖదుఃఖాలు ఈశరీరానికి కలిగినప్పుడు రెంటినీ సమంగానే తిలకిస్తూ ఉంటాడు. అంటేతాను స్వస్థుడై ఎల్లప్పుడూ శరీరానికి భిన్నమైనవాడుగానే భావిస్తూ నిలుస్తాడు, మట్టిపెళ్ళ, రాతిపెంకు, బంగారం అన్నీ సమానమేననేభావం కలిగి ఉంటాడు. ప్రపంచంలోనితాను వ్యవహారంగా ఉండగా వాటి వాటి విలువలు అలవాటుగా ఆ దికి తెలియక పోదుగాక. కాని ఆధ్యాత్మికంగా ఈ భేదాలు ఉండవనేది అనుభవించగలిగి ఉంటాడు. ఇష్టమనేది అయిష్టమనేది ఈ జడమైన మనసుకు ఉన్నట్టిది.కాని చిత్ స్వరూపమైన తనకు ఈ రెండూ ఒక్కటే. ఈ ఆధ్యాత్మికసాధనంవల్ల వ్యవహారంలో సక్తితగ్గి "అసక్తి" ఎక్కువ కావచ్చుగాక.అంటె కర్మచేయడం-అనాసక్తితో చేయడం అవుతుంది. అది కౌశలంగా అతడికి ఉపయోగిస్తుంది నాల్గవ అధ్యాయంలో చెప్పినట్లు. గుణాల సంఘర్షణం వ్యావహారికంలోకూడ,తగ్గిపోతుందిగాక. దానివల్ల కీర్తి ప్రతిష్ఠలేకలుగుతవిగాని నింద ఉండదు. మనదృష్టికి సుఖమేగాని అసుఖం ఉండదు.ఆధ్యాత్మికంగా నింద, స్తుతి, ఈరెంటికి తేడాతోచదు. అభిమానం అవమానం అనేవి సమంగా చూడటం, మిత్రులు, శత్రులు అనేభేదం గమనించకపోవడం అవుతుంది. ఏకార్యంగాని కాముకుడై ఆరంభించటం ఉండదు. అమనస్కతకుదారి తీయగలిగినసాధన ఇది.

26-27 "ఇలాటిస్థితి రావడం సంభవమా? ఈ స్థితి ఎలా పొందటం"అనుకొంటావేమొ. ఎవరయితె సర్వభూతాల్లో "నేను" అనే

రూపంలో ఉన్న భగవంతుడైన నన్ను అవ్యభిచారపూర్వకమైనభక్తితో అనగా అనుభూతితో అనన్యభక్తితో అనుసంధానంతో సేవిస్తాడో అతడు ఈ గుణాలకు అతీతుడవుతాడు. బ్రహ్మత్వంపొందేందుకు సమర్థుడవుతాడు. బ్రహ్మత్వాన్నిపొందుతాడు, ఎందుకనంటే—"నేను" బ్రహ్మమను. తత్‌ను వికారరహితమైన బ్రహ్మమను. వినాశరహితుడిని. నిత్యుడను. ధర్మంవల్లకలిగిన జ్ఞానంచేత పొందదగినవాడను. సుఖస్వరూపుడైన బ్రహ్మానికిఆశ్రయుడను. నన్నుసేవించినప్పుడు నీకీలక్షణాలు రాకపోవడమెలా అవుతుంది? తప్పకగుణాతీతుడవయి తీరుతావు.

గుణాతీతుని లక్షణాలుచూస్తే 2వ అధ్యాయంలోని స్థితప్రజ్ఞుని లక్షణాలూ, 6వ అధ్యాయంలోని కర్మయోగి లక్షణాలూ జ్ఞాపకంవస్తవి. పేరుకు భేదంగాని వీరంతా ఒకటే. జీవన్ముక్తులు. అని తెలియాలి. ఏసాధనలో పరిపూర్తిపొందినా వ్యక్తికి ఈ పర్యవసానం—జీవన్ముక్తి రాగలదని బోధ.

ఈ అధ్యాయంలో సాధకుడు ఎలా బ్రతకాలో చెప్పారు; కనపడే ఈ ప్రకృతి పరమేశ్వరుడిలో భాగం. ఆయన సత్ చిత్ ఆనందాలే ఇక్కడ సత్వరజస్తమోగుణాలుగా రూపొందినయి. సర్వమైన పనులూ ఈ గుణాలద్వారా భగవంతుడే చేస్తున్నాడు. కనక సాధకుడు ('నేను' అనేది) ఈ శరీరాల నుండి విడిగాచూసి తాను భగవంతుని యందు తాదాత్మ్యం పొందితె అది ఈ ప్రపంచవ్యవహారాల్లోని కర్తృత్వం వదలించుకొనటానికి గొప్పచిట్కా అనిఅనిపిస్తుంది.

ఇక్కడ అనుసంధానానికి ఒకచక్కని భావం. ఈ ప్రకృతికి ఒక పంథా ఉంది, దాని ప్రకారం అది పనులు జరుపుతోంది. "నేను"అనేది పరమేశ్వరుడ నేసంగతి మరచిపోయి పరిస్థితుల్లోచిక్కుకొని ఈప్రకృతిలోని పదార్థాలను తనచుట్టూ తిప్పుకోవాలని తాపత్రయపడి ఈ ప్రకృతి గమనాన్ని భిన్నం చేయాలని చూడటంలో వ్యక్తి తప్పుచేస్తున్నాడు. అందుకె చీకాకులోపడిపోతున్నాడు. ఇది ఎరిగి విడుదలకైప్రయత్నించడం అనుసంధానానికి అనువైన భావం.

బాహ్యంగానడిచే వ్యవహారం చక్షువులకు అగుపడే వ్యక్తులతో అప్పుడె అంతరంగంలో పరమేశ్వరస్వరూపమే ఈవ్యక్తి అనితెలిసి జ్ఞాపకంచేసికొనాలి. మనసు బుద్ధి, నోరులతో మాట్లాడం ప్రవర్తించటం ఆవశక్తితోనె-కార్యకారణ సంబంధం వదలకుండానెజరపాలి. ఇది అభ్యాసం చేయాలి. ఇది మిధ్యాచారప్రబతుకు అనుకొంటావేమొ. కాదు. ఇది సాధన. దీని వల్ల నీఅంతరంగంలో స్పర్థ, కోపం,కామం ఇలాంటి వికారాలు కలుగకుండచేసి సాధనను పరిపూర్తిచేయటమె ఆశయము.

భగవంతుడు, ప్రకృతి ద్వారాచేసేపనిని, సర్వాన్నీ, విడివిడిగా చూపి సృష్టించటమె కావచ్చు. 'నేను'గాఉన్న తాను భగవంతుడినుంచి విడిగా అయినట్లు దర్శిస్తుంటే అదిమాత్రంసరికాదు, అదిభ్రమ.తానూ విడిఅయి పోయిన ప్రకృతిలో ఒకడే ననుకొని దానికి దాసుడయి పోవటం సరికాదు. తాను భగవంతుని స్థాయిలో ఉన్నవాడై, పరమాత్మ యీ ప్రకృతిలో నడిపించే యీ వ్యవహారాలతో సహకరించాలి మానవుడు. తనకు వేరేపనిలేదు.భగవంతుడిపనే పని. త్రిగుణాలు తనఎదురుగా, నడిపేపనులను సాక్షిగాచూస్తుండటమె పని.అప్పుడు ప్రకృతి(మనసు) ఇతడికిసహకరించితీరుతుంది.ఇతడు నిజానికి పరుడుగదా!స్వతంత్రుడు గదా!! తనమేధా శక్తిచేత అసంగతినెరిగి ఉన్నవాడవడంచేత, జ్ఞాని అయిన అతడిని అనుసరించుకొనే ప్రకృతి సహకరిస్తూ ఉంటుంది.భగవంతుడెలా చెపితె అలానడుచుకొనే ప్రకృతి ఇతడిని ఎలా ఉపేక్షిస్తుంది? అతడు మాత్రం-జ్ఞానిమాత్రం—ప్రకృతితో ఐక్యం కలిగించుకొనడు, ఈ స్థితినిగూర్చి రాబోయే అధ్యాయంలో వివరిస్తారు.

ఆస్థితి గొప్పది, తానే సర్వలోక మహేశ్వరుడయేస్థితి. అది నీవుగానయిన స్థితి. పరాకాష్ఠ స్థితిత త్త్వమసి స్థితి, ఆపైనచెప్పవలసిన జ్ఞానతత్త్వం మరిలేదు. చెప్పిన దానిని జీవితంలోఎలా వర్తింపజేయుటమనేదె అతరువాతి మూడధ్యాయాల్లో చెప్పబడుతోంది.

ఇది పదునాల్గవ అధ్యాయం.



# శ్రీమద్భగవద్గీతామననము

## పదునైదవ అధ్యాయము

## (పురుషోత్తమ ప్రాప్తియోగము)

## (పురుషోత్తముని సత్ చిత్ ఆనందాల అవతరణే సర్వమూ)



భగవంతుడు అర్జునునితో అంటున్నాడు. అర్జునా! ఈ సంసారం—అంటే ఈ ప్రపంచవ్యవహారం—ఎలా ఉద్భవించి ఎలా ఉంటున్నదో చెబుతాను విను. ఇది ఒక అశ్వత్థ వృక్షం వంటిది. అంటే బీజంగా ఉండి విస్తృతమయేది అనటానికి ఉదాహరణమన్న మాట. శ్వః అంటే రేపు అని అర్థం. అ + స్థః అంటే ఉండనిది అన్నమాట. అశ్వత్థమంటే రేపుఉండనిది. అంటె నశించి పోయేది అని చెప్పటం. దీని బీజం ఎక్కడుందో తెలుసునా? అది పరాత్పరుని చిత్ అనే చైతన్య శక్తియందు ఉన్నది. ఆ చిత్ ఈ ప్రపంచం ఇలా అవుపడటం ఆరంభించకముందునుంచీ ఉన్నది. ఆ శక్తి మనం మన యంత్రాల్లో యంత్రాలయాల్లో చూసే శక్తి మాత్రమే కాదు. మహావిచిత్రమై వెలిసే ఉచ్చస్థితియందున్న శక్తి. పైన ఎక్కడో ఉండేదన్నారు. పైనఅంటె ఉచ్చస్థితిలోనిదైన అని అర్థం. ఈ సంసార వృక్షం ఊర్ధ్వమూలం కలిగింది అంటున్నదందుకె. నిర్మలమైన ఆకాశం కంటె పెద్దగా పైన ఉండి మహాశాంతి కలిగిన సర్వమూ అయియుండి అలాతెలిసిన ఉచ్చస్థితిలో ఉన్నట్టి "నేను," 'తత్' యొక్క చిత్ లక్షణం.

బీజం అలా వేయంగానే ఇలా అంకురించి కొమ్మలువచ్చి పెరిగి ఊరుకొంటుంది. కొమ్మలూ ఆకులూ అన్నీ దానినుండె ఉద్భవిస్తవి. ఆ బీజం వేయటం అనేదేమిటో ముందు చెప్తాను గాక. ముందీ విషయం విను. ఆ కొమ్మలూ ఆకులూ క్రింది స్థాయిలో పెరుగుతూ ఉంటవి. పై నుంచీ చైతన్యశక్తి వీటిలోకి కూడ ప్రసరిస్తూ ఉండటం తెలుస్తూనే ఉంటుంది. కాని, ఆ వచ్చిన శక్తి యీ కొమ్మలూ

ఆకులకు పరిమితమై పోతుంది: ఎక్కడున్న శక్తి అక్కడనే పనిచేయ గలదుగాని సర్వత్రచేయలేదుగదా. అలా పరిమితమై ఉంటున్నమేర మనం తక్కువస్థాయిశక్తి అంటాము. అందుకనే క్రిందుస్థాయి అనటం. అధః శాఖలు అనటం. "వృక్షం" అని సంసారాన్ని అన్నప్పుడు బీజం పైన ఉన్నదనీ, శాఖలు క్రిందివనీ ఉపనిషత్తులనటంలో అంతరార్థమిదీ.బీజం అంటెలోపల అంకురాన్ని కలిగినట్టిదని అర్థం. అంకురమే చెట్టుఅవుతుంది.చెట్టుఅంటె చిగుళ్లూ ఫలాలతోపాటు మళ్ళీ బీజాలను కలిగి ఉండేది.మళ్ళీబీజాల్లో చెట్లు. ఇది ఊహ్యం.అందుకని, ఆ బీజం నశించేదికాదు. అవ్యయమైంది. వృక్షంకూడ అవ్యయమైనదే. వ్యయమయేదికాదు. దీని చిగుళ్ళకు ఛందములు అన్నపేరుంది. ఛందములంటే ఇచ్ఛలు అనికూడ అర్థం. అభిలాషలన్నమాట. ఆకులవల్ల చిగుళ్ళవల్ల వృక్షము ఎలా సర్వాలంకార పూర్ణంగా కన్పడుతున్నదో ఇచ్ఛలవల్ల యీ ప్రపంచం చప్పగాలేకుండా ప్రఫుల్లంగా ఉండేటట్లు జరుగుతున్నది. ఇది తెలిసినవాడే వేదవిత్.వేదజ్ఞుడు.చిత్. రజోగుణంగామారి వాసనలను పెంచుకొని ఉంటున్న స్థితి ఇక్కడ చెపుతున్న విషయం.

నేను అనే ఆ భగంతుని శక్తి అయిన ఆ బీజం నుంచి ముందుగా చిగుళ్లు వెలుస్తవి. అవి పెరిగి శాఖలవుతవి. క్రిందికీ పైకీ కూడ వ్యాపిస్తవి.ఈ సంసారవృక్షానికి విషయాలు చిగుళ్లు అనచ్చు.విషయాలే ఇచ్ఛలకు-అభిలాషలకు-ఆకర్షణలు. అభిలాషకలగటంలోనే పరిమితం చేసికొనట మనేది ఉన్నది.ఈ వస్తువునాదయినంత సేపూ అది నేను సంపాదించాలనే అభిలాష ఉండును. నాది కాదనీ నేను ఇంతవరకె పరిమితమైన వాడిననీతోచినప్పుడు,దానిని నా ఆధాలోకి ఎలాగో ఒకలా తెచ్చుకోవాలనే అభిలాష కలుగు తుంది, కనక అభిలాష కలగటానికి మూలం ఏమిటి_ అంటే_అభిలాషతోపాటుగానే,__'పరిమితి_

అనే ఒకటి "నేను"కు ఆవహించటం. ఇది మననం చేయదగిన విషయం అనిపిస్తుంది. కనుకనే ఈ పరిమిత పూర్ణమైన అభిలాష బీజం వేయటం. ఈ పరిమితికిలోను కావటమె ఇంకావ్యాప్తి నొందాలి అనే దానికి మూలం. అదే బీజం. ఈ ఇచ్ఛలు, గుణాల ప్రభావంవల్ల అభివృద్ధి నొందుతూ ఉంటయి. అలాగే అవి వృద్ధిఅయి, భూతాలుగా మనుష్యులుగా అయినయి. ఈ ప్రపంచమె ఇలా కలిగింది.

భగవంతుడే తనను పరిమితం చేసికొనే క్షణాన జీవుడె పిలువబడ్డాడనుకొంటే అతడికి అభిలాషకూడ ఆ పరిమితత్వం వల్లనే కలిగింది. ఆ అభిలాష వల్లనే సక్తి ఎర్పడింది. ఆ అభిలాషకు అనుకూలంగా పనిచేయటంలోగల తత్త్వమే సక్తి. ఆ అభిలాష యొక్క ఛాయ యీసక్తికి బాగాతగులుతూ ఉంటున్నదన్న మాట.ఈ అభిలాషకు ముందే పరిమితి అనేది కలిగింది, అది జీవుడుగా పరమేశ్వరు డెప్పుడయినాడో అప్పుడు అని గమనీయం. చిత్, ఆనందము,అనే ఆపరుని లక్షణాలు రజస్తమోగుణాలమే పేశవరకూ జీవుడు శుద్ధస్థితిలో ఉండి ఆనందిస్తూ ఉంటాడు. రజస్సువల్ల ఆ తరువాత అభిలాషకు అనుకూలంగా చరిస్తూ ఉంటాడు· జీవుడు భగవంతుడైనా తన చైతన్యాన్ని తనద్వారా ఎంతవరకూ ప్రసరింపనీయకలడో అంత మేరా ప్రకటింప చేయటమేగాక సక్తి కారణంగా భగవంతుని విషయం మరచి స్వార్థపరుడవుతాడు. తన పరిమితిలోకి మిగతాది రావాలనటం అన్నమాట. ఇదిపాపపూర్ణమైనట్టిది;ఎందుకంటె తాను విడిపోయి ఇతర్లను విడగొట్టి వాళ్ళకు కూడ భగవంతుడిచే ఉద్దేశింపబడిన వాటిని తాను ఆసిస్తూ అందుకు వీలుగా ప్రవర్తించడంవల్ల (పాపాయ పరపీడనం)పాపి అవుతున్నాడని ఒక ప్రవచనం. మనుష్యుడు పాపిగాపుట్టాడని క్రైస్తు అన్నమాటకు ఇదే అర్థం.

అలా పరమేశ్వరుని పనికి జీవుని సక్తి అడ్డుగానిలవడం తటస్థించుతున్నది. ఇదె అధర్మం. జీవునికిగల సక్తి అధర్మపరమైనదవ

మాట. సక్తివదలటం ధర్మం.సక్తితో ఏదోచేయటం అధర్మం అనాల్సి వచ్చింది. అలా ధర్మాఒధర్మాలు వెలయటం తప్పనిసరి అయింది. భగవంతుని చైతన్యాన్ని ప్రసరింపజేసి దర్శింపజేయటమె ధర్మమైన కర్మకాగా, జీవుని సక్తికి అనుకూలంగా చేయబడేది అధర్మమైనకర్మ అన్నారు. ఈ ధర్మాఒధర్మాలూ-ఆయా కర్మలూ వేదంలో చెప్ప బడ్డయి. జీవునికర్మ ఈ ధర్మము అనేదాంతో అలాముడివేయబడింది. అందుకనే వేదంలో చెప్పిన ధర్మ కర్మలుచేసి ఉచ్చస్థితిని-మళ్ళీ భగ వంతుని స్థితిని-జీవుడు పొందవచ్చు అనటం. కాని ఈ ప్రపంచం సక్తితో ప్రవర్తితం అవుతోంది ఇప్పట్లో. కోరటం-అనుభవించటం, మళ్ళీ కోరటం, మళ్ళీ అనుభవించడం-ఇలా.

చిత్రమైన విషయం ఏమిటంటే ఈధర్మాఒధర్మాల సమూహం ఊడల్లా అయి క్రిందకుదిగి పాతుకుపోయి వృక్షం పడిపోకుండా ఆపు తున్నదా అన్నట్లు, విస్తరించిపోయింది. వేదాల్లో చెప్పిన కర్మకాండల వల్లనె యీ ప్రపంచం నిలుస్తోందని కూడ అన్నారు. భగవంతుడు అనే భావం చెప్పక ఈ వేదకర్మలు అనేది ప్రధానంచేసి వారు చెప్పారు. దానిని సరిగా అర్థం చేసికొనగలగాలి మనం. ఐతె ఈ ధర్మాఒధర్మాలు పాతుకున్నది ఎక్కడ ఈమనుష్య సమూహంలో?జంతువులకు ధర్మాఒ ధర్మాలులేవు. ఉన్నాతెలియవుగాక. స్థావరాలకు లేనేలేవనచ్చు. ఉన్నా ధర్మం ఒక్కటె ఉన్నది, అక్కడ ధర్మం అంటె లక్షణమన్నమాట. మనుష్యులు మాత్రంధర్మాఒధర్మాలుతమకులేవుఅనుకోవడానికి వీల్లేదు. అలా అనుకొంటె జీవితమె సరిగ సాగదు కూడ,తన వల్ల జరుగవలసిన న్యాయమేదో తను ప్రతిక్షణం ఊహించితెలిసికొంటూనే ఉంటాడు మనిషి. అలా తెలిసికొనకపోతే ఇతర జంతువులకు వలెనె ఉంటున్నా డంటాముకదా! నిజానికి జీవన్ముక్తుడైన భరతుని కూడ జడ భరతు డంటూ ఉండటం అందుకేగదా!అలాఅనడం మనతెలివిలేమివల్లనేగాని. నిజానికి జడభరతుడు వట్టి జంతువుకు సమానమైనవాడు కానెకాడు. సర్వ మూతెలిసిన జ్ఞాని అతడు!

ఒక సునిసితమయిన సందేహం రావచ్చు. ఈ జీవుని అభిలాష తీరేఅవకాశం ఈ ధర్మ ప్రవర్తిత మయిన ప్రపంచంలో ఉందదా? అని.ఇది చిక్కు ప్రశ్న అనిపిస్తుంది. అసలు ప్రపంచమే అభిలాషకు వీలయిన సక్తివల్ల కలుగుతున్నప్పుడు తీరకపోవటమేమిటి? అభిలాష తీరుతూ ఉంటుంది. మళ్ళీ అభిలాషల బీజాలు కలుగుతూ ఉంటవి. ఒక బీజంవల్ల వృక్షం కలిగి సంతృప్తి కలుగుతున్నామళ్ళీకొమ్మకొమ్మకీ కాయ కాయకీ బీజాలు బోలెడు వస్తూనే ఉన్నాయి. తీరకపోవడం అనే మాటకు అర్థమేమిటి? తీరుతునే ఉన్నాయి. ఐతేమరి ఇన్ని బీజాలు ఇంకా మొలవాల్సినవి ఉన్నవే, ఎలాగ? అవును. అవి ఇంకాతీరలేదు. తీరాల్సి ఉన్నవి అంటాము. అవును నాకోరిక తీరింది అనుకొంటే సుఖపడుతున్నావు. కాని, ఒకటితీరిందని అనడానికిలేదు. అందుతోంచి వచ్చిన అనేక కోరికలున్నాయి అని వాపోతే దుఃఖపడుతున్నావు. అందు చేత అభిలాష తీరే అవకాశం ఈ ప్రపంచంలో ఉన్నది.సందేహంలేదు. ఒకదృష్ట్యా అది తీరుతునే ఉన్నది. రెండవదృష్ట్యా అంటే అది కలిగించిన ప్రతిచర్య (re-action) దృష్ట్యా-అంటె పుట్టినక్రొత్త కోరికల దృష్ట్యా తీరే అవకాశం ఉన్నదనటానికిలేదు. అందుకె అది చిక్కు ప్రశ్న అనటం.

మరి అవి పూర్తిగా సంపూర్ణంగా తీరిపోవడం ఎలా? అని ప్రశ్నవస్తుంది. ఎలాగంటె కొన్ని కోరికలను త్యాగంచెయ్యాలి, వేదాలలో చెప్పబడిన క్రతువులు యజ్ఞపూర్వకంగా చేయాలి. త్యాగ పూర్వకంగానని అర్థం.దానివల్ల భగవంతుని పని చేసిన వాళ్ళవుతారు. నీకు కలిగిన సక్తికి ప్రధానమైన ఫలం కూడ కలిగి, సక్తి పరితృప్తి కూడ అవుతుంది అన్నారు.సక్తిలేకుండాచేస్తే ఇంకా సక్తి పరితృప్తం కావడమనేది ఏమిటి? ఇక్కడ మళ్ళీ చిక్కు ప్రశ్నకలుగుతుంది. అభిలాష కలిగింది. దానివెంట సక్తిరారాదు. మరెలా? ఆ అభిలాష తీర

దానికి వేదంలో ఫలాని క్రతువు చేయవలసింది అని ఉంటే, దానిని చేయాలి. ఆ అభిలాషతీరుతుంది, మరి ఇంకా సక్తి అనే దాని ప్రసక్తి ఎక్కడ వస్తుంది? ఆ క్రతువు చేయడంలో కేవలం తన అభిలాషమీద మనసుపెట్టుకొని చేయడంవల్ల అది యజ్ఞంకాదు. దానిని యజ్ఞంగా చేయాలంటే కేవలం భగవంతునికోసమే ఆ క్రతువు చేయడం జరగాలి. అలా యజ్ఞంగా చేసినప్పుడు కలిగే ఫలితం (1) యజ్ఞకర్త అభిలాష తీరడం (2) క్రొత్తకోరికలు పుట్టకపోవడం. భగవంతుని నుంచి సాధకుడు దూరం ప్రయాణం చేయడన్నమాట. దీనివల్ల అతడి అభిలాషలు తీరటం కలుగుతున్నది అని చెప్పవచ్చు.

అలాగాక క్రతువులు క్రతువులుగా మాత్రమేచేస్తే సక్తి తాత్కాలికంగా పరిత్యక్తం అయినా క్రొత్తకోరికల యందు ఆసక్తిపారినట్లైతే తను బ్రతకడానికి ఆసక్తే ప్రధానమనీ దానిని తను వదలితే ఎండాకాలంలో ఉపేక్ష చేయబడ్డ పూలమొక్కల్లె నశించిపోతామని అనుకోవడం కద్దు. అది భ్రమ.

3. నేనెలా చెప్పానో అలా యీ ప్రపంచంలోని జనులు సంసార విషయాన్ని అర్థంచేసికొనటల్లేదు. నిజానికి ఈ సంసారం ఆది, మధ్య, అంతములు లేనిది. భగవంతుడే దీనికి ఆది—అనే సంగతి వీళ్లు తెలిసికొనటల్లేదు. అంతము ఫలాన అని ఎరుగటల్లేదు. దీని అంతము ఇలా ఈసంసారచక్రంలో తిరుగుతూ ఉండటమె ఒక విధంగా. రెండో విధమేమిటంటే తిరిగి ఆ "నేను" అనె భగవంతునిలో చేరటం. సక్తిలో పడికొట్టుకు పోయేవాళ్ళకు ఈ సంసారంలోపడి తిరుగుతూ ఉండటమే అంతం, కాని "అసంగ" మనే శస్త్రంతో ఈ వృక్షాన్ని ఛేదించినట్లయితే తిరిగి "నేను"లో సమష్టిమనసులో శాశ్వత స్థితిని అందుకోవచ్చు. ఇది ఎవరూ జ్ఞాపకముంచుకోవటల్లేదు. మధ్య అనేది యీ యిచ్ఛ, సక్తి, కోరికలు, తీరటం, తీరకపోవటం. ఇదె. ఈమధ్యమంలోనే

ఉంటూ అందుకు ఈ యిచ్ఛ, సక్తి ఇవి తప్పవని నమ్మి భ్రమలోపడి పోతున్నారు. ఇచ్ఛ, కోరికలను ఉంచుకోవటంచేతనే ఈ సంసార చక్రం అనేది మనుతున్నది. అవివదలితె "నేను" అనే "నీవు" ఒక్కడే (పరమాత్మ అయి) బ్రహ్మానందంతో మనుతాడు అనేది తెలియాలి. ఒక్కడవే అంటే మిగతా అని వేరుగాచూడబడేవారంతా నశిస్తారనికాదు. ఈ జనులంతా కూడ స్థావరజంగమాలన్నిటితోపాటు 'నేను' అనే సమష్టి భగవంతుడిలో ఒకభాగం. వాటితోపాటుగ మనం సహ జీవనులమై మనవలె, స్థావరజంగమాలు మనకోసమే పుట్టినయి అనుకోవటంతప్పు. అలా అనుకోవటం అధర్మం.

ఈ ఊడలుగా పెరిగిన ధర్మాలు మనుష్యుల మనసుల్లో పాతుక పోయినయి. సంగత్వమే ఆధారంగా ఉద్భవించి సంగాన్ని తగ్గించడానికే ఉద్దేశింపబడినా ఈ ధర్మాలు చిలవలనూ పలవలనూ కలిగించినవై వెలుస్తున్నాయి, స్వార్థంకొరకు ఇతర్లను చంపరాదు అనేదిధర్మం. దుష్టులను చంపి ప్రపంచక్షేమం స్థాపించడం ధర్మం, ఇదిస్వార్థంకాదు కనక. శిష్టులను చంపరాదనిధ్వని. భీష్మద్రోణులు అప్రక్కనున్నారు. వారుశిష్టులు. రాజ్యం జయించడానికి వీళ్ళను చంపవలసివస్తున్నది. ఇలా సంక్లిష్టధర్మాలు గజిబిజిచేస్తున్నాయి. అర్జునుడు సమాజసంక్షేమందృష్ట్యా ధర్మపక్షం గెలవడం ధర్మం అనేదాన్ని ఇదమిత్థంగా తెలిసికోలేక తికమకపడటం అవుపడుతోంది.

మరి కర్తవ్యమేమిటి? ఈ ఊడలుగానున్న ధర్మాలనుండిబయట పడేదెలా? అందుకు శ్రీ కృష్ణుడు చెప్తున్నాడు—మార్గం· "ఈ ఊడలను అసంగము అనే కత్తితో నరికివేయాలి. అనగా ఏధర్మంవల్ల అభిలాష తృప్తి అవుతూ క్రొత్త అభిలాషకలుగుతోందో దానిని కోసివేయాలి. దేనివల్ల భగవదిచ్ఛ అవిచ్ఛిన్నమై నడుస్తుందో ఆ ధర్మం అలా లక్షణంగా ఆచరించబడుతునె ఉంటుందిగాక. నరకబడేది సంగము. ఆచరింపబడేది ఈశ్వర ప్రకర్ష అనే ధర్మము అనచ్చు· ఇచ్ఛ, వదల గొట్టి

బడవలసింది. ధర్మంగా ఒకప్పుడు చెప్పినట్టిదె. కోరిక ఆధారంగా ఆధి ఉన్నక్షణాన కోసేయబడవలసింది అవుతుంది. భగవత్తత్వమో ప్రధానంగా ఉన్నదేదో అదెధర్మం. దాన్నితెలియాలంటే సక్తినిచంపి అనాసక్తతతో జడ్డిలాగావిచారించాలి అనిబోధ. భగవత్తత్వమేదో తరువాతి శ్లోకాల్లో చెప్పుతున్నారు.

4. 'సక్తి, భగవంతుడినుంచి విడగొట్టుకొని పరిమితికిలోనైన 'నేను'కు కలిగినట్టిదనిన్నీ దాని వల్లనే ప్రపంచం వెలిగిందనిన్నీ చెప్పారుగనక, ఈ ప్రపంచ ధర్మాలనుంచి వచ్చే చిక్కు తొలగించాలంటే మళ్ళి మొదటి చోటుకు వెనక్కు ప్రయాణంచేయాలి. అంత ర్దృష్టినికలిగించుకొని పురోగమించాలి బుద్ధితో. బీజంలోంచి ఛందస్సులు పుట్టాయి అన్నారుగనుక, ఈ ఛందాలను (ఇచ్ఛలను) వదలి బీజం అయిన భగవత్పదంలోకిపోవాలి. అక్కడకు వెళ్ళినట్లయితె తిరిగియీ సంగంలో మునుగుతామేమో అనేభయం ఉండదుట. ఆపదం అనుభూతి అవుతుంటె ఈప్రపంచాన్ని అనుభూతిచేయాలి అనే సంగము ఉద్భవించదు. అలాంటి అంతస్థమైన భగవత్పదాన్ని అన్వేషింగాలి. ఈ దృష్టి, "లోదృష్టి" బాహ్యదృష్టికాదని అర్థం. బాహ్యదృష్టి అభిలాష పూర్వకమయిన దృష్టిఅవుతుంది. ఈలోదృష్టి ఇచ్ఛను వదలి భగవంతుని పొందడానికయిన దృష్టి అంతర్గతదృష్టి అవుతుంది అని అర్థం. సక్తి వదలగొట్టుకొని 'నేను (తత్)అసలెలా ఇలా అయిందనేదాన్ని ధ్యానంచేసి ఆ అసలు స్థలాన్ని (పదమును) పొందవలసినదనిబోధ.

5. అలా భగవత్పదాన్ని అన్వేషించి చేరగలగడం ఎవరికి సాధ్యము అనేది శ్రీ కృష్ణభగవానుడు చెప్తున్నాడు—మానమోహాలులేని వారికి, అహంకారంగాని అవివేకంగాని లేనివారికి, జిత సంగదోషులకు అంటే 'సక్తి' అనే దోషంలేనివారికి, అధ్యాత్మనిష్ఠులకు—నిష్కామకర్మనే చేసేవారికి—సుఖదుఃఖాలనే ద్వంద్వములనుండి విడివడినవారికి—జ్ఞానులకు. వీరికే అక్షయమైన ఆ 'పదం' అందేది.

అయితె మరి యీ సుఖదుఃఖాలూ మానమోహాలూ లేకుండా పోయేదెప్పుడు? ఈ ప్రపంచం సృష్టి పరిణామం అన్నీ భగవత్పర మనే వివేకం కలిగి 'తాను' అనే అహంకారం(పరిమితి) ని, కర్తృత్వ మునూ వదలి సక్తిని ఛేదించినప్పుడు, ఎల్లప్పుడూ అధ్యాత్మ యందే నిష్ఠ లైనవారికి. ఈ యోగ్యతలన్నిటినీ ఆలోచించగా ఆలోచించగా- వెనకచెప్పిన అధ్యాయాలలోని సారమే పునః పునః మెదులుతుంది మనసులో.ఈ పదాలు చదివి మళ్ళీ వెనకటి అధ్యాయాలసారం అను సంధానం చేయటంతప్ప ఇంకోదోవలేదని పిస్తుంది.

భగవంతుని తెలుసుకోవటం కీలకమని వెనకచెప్పారు. అదెలా గంటె 7నుంచి 12 అధ్యాయాలలో చెప్పినవి, తెలియటమేనని అర్థ మవుతుంది. అంతర్దృష్టితో శోధించటం ఇదె జ్ఞానం.భగవంతుడు ఒకే ఒకడు అతడిని తెలిసేదే జ్ఞానం అనుకొనేటట్లయితె ఈజ్ఞానం తెలియ టమె భగవంతునెరగడానికిగాను ముందున్న పథం అనిపిస్తుంది. ఆ జ్ఞానం ఏమని? ఆ భగవంతుడె మన ఆత్మలో బుద్ధిలో మనసులో శరీరంలో ఇంద్రియాల్లో ఇంకాచుట్టూనూ ప్రపంచమంతానూ రూపాలు మార్చుకొంటూఉంటున్నాడనేదే జ్ఞానం.లోపలినుంచి బయటకు భగవం తుడె వస్తున్నట్లుతెలియక పోవటంచేత ఇన్నిరూపాలు అనిపిస్తున్నయి. ఈ ఇంద్రియతత్త్వం, శరీరం, చుట్టూ ఈ గాలి, ఈ వస్తువులతో సంబంధం,ఇలా వ్యాపిస్తూరూపాలుగానయి ఉంటున్నాడు భగవంతుడు. ఈ సంగతి తెలిసి యీ రూపనామాలకే కేవలం ప్రాధాన్యమివ్వక— స్నేహితుని దుస్తులకు ప్రాధాన్యమివ్వక స్నేహితునకె ప్రాధాన్యమిచ్చి నట్లు—భగవత్పదానికి ప్రాధాన్యమివ్వాలి. అప్పుడాయన పదము—స్థితి తెలుస్తుంది. ఆసంగతి ఎప్పుడో తెలుస్తుంది అనడమెందుకు ఇప్పుడు తెలిసిందిగదా ఇది విన్నప్పుడు అనిపిస్తుంది. కాని ఇది తెలిసిందిమన బుద్ధికి.కార్యకారణసంబంధమైన హేతువాదపూర్వకమైన చర్యవల్లబుద్ధి

ఈవాదాన్ని ఒప్పుకొనడం వరకె ఇప్పుడు జరుగుతున్నపని. అదిచాలదు దానిని మననంచెయ్యాలి, అంటె మనసుకు కూడ తెలియాలి. శరీరానికికూడ అలవాటుకావాలి. ఈ మూటినీ ఏకముఖంగా అంతర్ముఖంచేసి పయనించి సమష్టి భగవంతుని అనుభూతిచేస్తే అప్పుడూ సాధనపూర్తయేది. అందుకు అనుసంధానం కావాలి. అనుభూతికావాలి. ప్రహ్లాదుడు వంటి వాళ్ళకే కలిగింది. భయంవల్ల హిరణ్యకసిపుడికికూడ కలిగిందా? స్తంభంలో ప్రత్యక్షంగా నరశింహ్వామూర్తిని చూడగలిగినాడు కదా. భయంతోనే మననం అతడికి జరిగిపోయిందా అనిపిస్తుంది. కాదు అతడికి బాహ్యదృష్టిద్వారానే కనపడిన దేవునిరూపం అతడికి ముక్తినీయదుగాక అతడు రావణాసురుడుగా మళ్ళీజన్మించాడుకదా. కనక అంతర్దృష్టికావాలి మనకు. అంతటి మననంకావాలి. అదీ సాధన.

6. కనుక,—లోదృష్టికలిగి, మొదటపుట్టిన ఇచ్ఛలకు-పూర్వస్థితికి పోగలిగి-అలా పోతె,—ఆబీజంలోకి వెళ్ళితె—అక్కడి పదం ఎలా ఉంటుంది అనే సంగతి చెప్తున్నారు. సృష్టి అంతా భగవంతుడె అయినట్లు తెలుస్తుంటుంది—సూర్యుడు, చంద్రుడు, అగ్ని అన్నీనీ. వీటికి కలిగిన శక్తితేజం. భగవచ్ఛక్తి వల్ల కలిగినవి. ఆ శక్తిని వెతుక్కుంటూ అక్కడకు మనం వెళ్ళినప్పుడు వీళ్ళకు ఆప్రకాశం ఉన్నది అనే అనిపించదు. సూర్య శక్తి భగవంతుడయి అవుపిస్తుంది. అంతె_ కవిత్వం వ్రాస్తుంటావు. అవ్రాస్తున్నదినీకలమా? నీవా? నాకలమేను అనేభావం ఎన్నడూనీకుఎలా కలగజాలదు—కానితెలియనిపసివాడికి ఎలా కలగవచ్చునో-అలా—సూర్య చంద్రులకు అక్కడ అస్తిత్వమేలేదు. భగవంతుడె ఉన్నాడు అనిపిస్తుంది. అక్కడకు వెళ్ళిన అనంగులకు తిరిగి అధోగతి కలుగదు అంటే అర్థం అది. భగవంతునిలో ఐక్యం అవడంజరుగుతుంది. దీనితోసరా? అనికూడ ఇప్పుడు మనకు సందేహంరావడం అబ్బురం కాదు; లేదంటే ఓస్ ఇంతేనా అని కూడ అడంకద్దు. కాని అంతేకాదు, తాముగాక మిగతా సృష్టిలో ఉన్న జీవు

ఉదంతంకూడ తెలుస్తూనె ఉంటుంది. సర్వం అవగతమవుతుంది.సర్వ మూతానే అని తెలుస్తూనె ఉంటుంది. తనగోరూణానే: పైగా అది పెరిగితె తునిగిపోతుంది. పోవాలి—అనుకోవడం కూడ ఉండటం అసంభవమెందుకవుతుంది?

7—9 ఇంతకూ ఆ 'పదం' లో (స్థితిలో) అహంలేదు. నేను అయిన తత్ అనే భగవంతుడె ఉంటాడు. శ్రీకృష్ణుడు ఆ పదంచేరి అక్కడ నుంచి మాటాడబోతున్నాడిప్పుడు—"ఈ (తత్) 'నేను'—లో అంశాలే ఈ జీవులు. ఈ అంశ అలా నాలోనేఉంటూ ఉండగానే, ఈ యిచ్ఛ, అభిలాషల వల్ల పరిమితి కలిగి,దానిచుట్టూ ప్రకృతి ఆకారమై చుట్టుకొంటుంది. చేతులు కాళ్ళు ఇంద్రియాలు కలుగుతున్నాయి. జ్ఞానేంద్రియాలు బయటకు తెరుచుకొని ఉంటున్నాయి. మనసు ఉంటున్నది. ఇవన్నీ భగవంతుడైన నాశక్తిలోంచి వచ్చినవె.జ్ఞానేంద్రియాలలోంచి ప్రేరణలు లోపలకు—మనసుకు—ప్రవేశిస్తవి. అక్కడి ఈ"నన్ను"ను ఆ కర్షిస్తవి. దేహం, మనసూ, ఇంద్రియాలకు జీవుడే ఈశ్వరుడు. సర్వలోకమహేశ్వరుడే యీమూడింటిమీద ప్రేమను పెంచుకొని,వీటికి మాత్రమే ఈశ్వరుడైన కారణంచేత, జీవుడని పిలువబడు తున్నాడు. జీవుడుగానుండి సర్వలోక మహేశ్వరుడుతానని మర్చిపోతున్నాడు.కాని పేరు ఏదయితేనేం? ఉన్నది ఈశ్వరుడే సర్వత్ర!! గుణాలకూడలిని—ప్రేమించి, అవే తానను కోవటంవల్ల ఈ ప్రమాదం కలిగింది.

శరీరం నశిస్తె ఇంకొక శరీరం వస్తుంది. అతడికి మనసుక్షణక్షణానికీ మారుతున్నా దాన్నేపట్టుకొని నాది నాది అంటూ కూర్చుంటున్నాడు పరమాత్మ—జీవునిస్థితిలో—పరిమితిలో. ప్రేమకొద్దీ నేనుపుట్టాను నేను చస్తానే మొనంటాడు. పువ్వులమీదనుంచీవచ్చే వాసననుగాలి మోసుకొని పోతున్నట్లే జీవుడు ఈ ఇంద్రియ విషయాసక్తిఅనేమనోగుణాల్ని అల్లా మోస్తూఉంటూ జీవభావం పోషిస్తూ ఉంటున్నాడు. ఈ సక్తి ననుసరించే ఈ గుణాల ప్రకారం శరీరధారణం కలుగుతున్నది.అలా చెప్పుతా

చర్మం కళ్ళు, నాలుక ముక్కులద్వారా శబ్దం, స్పర్శం మొదలైన విషయాలను ఆస్వాదిస్తూ ఉంటున్నాడు. అదేపని అతడిది. ఇంకోపేదీ కన్పడటల్లేదు.

10. ఇలా జీవుడి గుణాలసమూహం అంటే సూక్ష్మశరీరం అనచ్చు ఒక శరీరాన్ని వదలి ఇంకొకస్థూల శరీరాన్ని పొందటం అవుతున్నది. జీవుడే ఈ విషయాలను అనుభవిస్తూ ఉండటం అనేదేమిటంటే—గుణాలు చేస్తున్న పనులు తనపనులేనను కొనటమె. ఇదీ జీవుడు పరిమితుడై చరిస్తున్నస్థాయి. ఎవరు (ఏజీవుని అంతరంగం) అసంగమనే శస్త్రంతో సంసార వృక్షన్ని తెగవేసి—అంటే ఇచ్ఛలు పుట్టకుండా చేసి—బీజస్వామియైన భగవంతుడ్ని అన్వేషించి వానిచేరుకొందో, వానికి ఈ సంగతంతా—మనంపడే ఈ బాధలకు మూల మయిన "ఇచ్ఛ" సంగతంతా—తెలుస్తుంది. అలాచూడగలిగే వాళ్ళు జ్ఞానచక్షువులు కల వాళ్ళు అన్నమాట. ఇక్కడ ఫలాన అని తెలియటమె ప్రధానం. "ఓహో ఇది పుస్తకం" అని తట్టదు. ఇది భగవంతుడు అవిపించి, పుస్తకరూపంలో ఉన్నాడు అనేది తరువాత కంగాలి. అదీ జ్ఞానచక్షువు ఉన్నందుకు పర్యవసానం.

11. ఈ అనుభూతినికొందరు సాధకులైన యోగులు మాత్రమే పొందుతారు. ఈ జ్ఞానం తెలిసికోనివారు ఎంత ప్రయత్నించినా అనుభూతిని పొందనేపొందలేరు. ఈశ్వరుడు తనయందె ఉన్నాడనీ, సాక్షిరూపంలో ఉంటున్నాడనేది కలుగవలసిన అనుభూతి. ఇది కలిగేది చిత్తశుద్ధి ఉన్నప్పుడె. చిత్తశుద్ధి ఎలా కలుగుతుందంటే నిష్కామకర్మను సాధనగా చేసినవారికి కలుగుతుంది అని వెనకచెప్పారు. నిష్కామకర్మంటే ఏమిటి? భగవంతుని కర్మనే చేసేవాడు. అంటె భగవంతుడు నడిపించేయీ ప్రపంచ చక్రంతోపాటుగా, దానికొరకుగా, కర్మచేసే వాడని అర్థం. కేవలం తనకొరకు తన బ్రతుకు కొరకు మాత్రమేకాదని చేయుటంకొద్దు. పరోపకారార్థమిదం శరీరం అనె సూత్రం ఈనిష్కామ

కర్మకు అనుకూలంగా చెప్పబడినట్టిదెనని తెలియాలి. అలా పనిచేయక స్వార్థచిత్తులయి చేసేవారికి అశుద్ధ చిత్తమే మిగులుతుంది గాని శుద్ధచిత్తమేర్పడదు. వారు తమయందు సాక్షిగా మాత్రం ఉంటున్న భగవంతుని దర్శించలేరు.

12-15. భగవంతుని పదం జేరిన జీవుడు భగవంతుడే అయి పోతాడు—అని శ్రీకృష్ణుడు చెప్పుతూనే తానాస్థితికెక్కి మాటాడుతున్నాడు అర్జునుడితో:—"నేనే—ఈ సర్వప్రపంచానికీ ఆధారమను.సూర్యుని తేజస్సుగా ఉదయించి సర్వ ప్రపంచాన్నీ భాసింపజేస్తున్నాను.ఈచంద్రుడు ఈ అగ్ని ఈ తేజస్సునాదే. ఐశ్వర్యమైన శక్తిచేత పృథివిలో నేను ప్రవేశిస్తున్నాను. ఈ చరాచర భూతాలను ఆకర్షించి, ధరించి. భరిస్తున్నదినేనె.ఔషధాలలో చంద్రునిద్వారా ప్రవేశిస్తున్నది నెనె.ఇంతేమిటి: చరాచరాల్లో ఉన్నదినేనే. భూతాల్లో జఠరాగ్నినై ప్రాణాఽపానాలనే వాయువులతో కూడి,అవి తింటున్న చతుర్విధాహారాలను పచనంచేస్తున్నాను. అన్ని బ్రతుకులూ నావల్ల జరుగుతున్నాయి." అన్నాడు.

అలా జ్ఞాని అనుభూతిచేస్తాడు. ఇంకా"పిపీలికాదిగా బ్రహ్మ వరకూ ప్రాణుల హృదయంలో ఉన్నవాడిని నేనే.వారియందు నేనుండటం వల్లనే వారికి స్మృతి అనేది, తెలివి అనేది, విస్మృతి అనేది, ఇన్నికలుగుతున్నాయి. క్షణంనేను లేకపోతె వీళ్లేమీచేయలేరు. ఏమీజ్ఞాపకముంచుకోలేరు. ఏజ్ఞానంనిలవదు. హఠాత్తుగ జ్ఞానం పోయిందంటె ఇక పిచ్చి ఆస్పత్రిలో లేదా కాటికో శరీరం చేరాల్సిందేగదా.నెనులేకపోవటం అనెదాని అర్థం"నెను"కూక్షేత్రునికీగల ప్రేమ లేకపోవటమె. సంయోగంలేకపోవటమె. అదెనిశ్చితవ్యం. వేదాలు నాల్గింటి చేత తెలియదగినది ఆ భగవంతుడైన నెనె .వేదాంతసంప్రదాయాన్నినడవజేసేది నేను. వేదార్థాన్నికూడనేనే. ఇలా అనిపిస్తుంది జ్ఞానికి.

16. ఇంత పనిచేస్తున్నాడా భగవంతుడనిపిస్తుంది మన కించిజ్ఞబుద్ధితో ఆలోచిస్తె. భగవంతుడు ఇంత పనీకూడ నీద్వారాచేస్తున్నాడు చూశవయ్యాఅని శ్రీ కృష్ణుడు అర్జునునకు చెప్తున్నాడు. తన

ఎదుటి దుర్యోధనాదులకు ప్రత్యేక ప్రత్యేక వ్యక్తిత్వమిచ్చి చూస్తున్న అర్జునునకు చెప్తున్నాడు, తత్త్వదర్శనంచేయుమని.

"నీ ఎదుటనున్న ఈ ప్రపంచంలో నీమనసు చూసేది రెంటిని, ఒకటి క్షరపురుషుడు. రెండు అక్షరపురుషుడు. క్షరుడంటె మార్పును, క్షణక్షణానికీ పొందుతూ ఉండే ఈ దృశ్యమానమైన జడం-శరీరాలు సహా. అక్షరుడంటే శక్తిపరంగా ఈ ప్రపంచంలో ఉండి సర్వమూ భాసింపజేస్తున్నదేదో అదీ. క్షరుడు కాలాను సారంగా నశించిపోతు వ్నట్లువుపడతాడు. రెండవవాడు కూటస్థుడై ఎల్లప్పుడూ ఉన్నట్లుతెలుస్తుంటాడు. వీరిద్దరూ ప్రపంచంనడిపించడానికి అయినవారు. వీరిద్దరి ప్రేమ కలయిక ఉంటేనే ఈ ప్రపంచచైతన్యం నడుస్తుండేది.

17. కాని ఈ ఇద్దరేకాక మీటనొక్క చైత్యమొకటి ఉంది. అతడు పురుషోత్తముడు-పరాత్పరుడు-ఆత్మ అంటె తెలిసి ఉంటె-పరం అంటెస్వతంత్రం అని అర్థం కనక-స్వతంత్రమనే లక్షణాన్ని మించిన స్వతంత్రం కలిగిన పరమాత్మ అతడు. అతని ఆజ్ఞచొప్పునె ఈ క్షరుడూ అక్షరుడూ-అంటేపరా ప్రకృతీ అపరా ప్రకృతీ-ఈమూడు లోకాలనూ విశ్వాన్నంతటినీ ప్రవేశించి విశ్వమై వెలుస్తున్నవి. పరం-అపరం అయిన ప్రకృతులు మారిమారి అతడిలో ఐక్యమై ఉండచ్చు కాని అతడు మాత్రం ఎప్పుడూ ఉంటున్నవాడె. అవ్యయుడు. ఈశ్వరేశ్వరుడు. పాలించేవాడు. పరాత్పరద్భావం: అనచ్చు.

18 ఈ ప్రపంచం క్షరుడిలోభాగం, అశ్వత్థవృక్షంవంటిది. దాని కంటె భగవంతుడే అయిన "నేను" (తత్) ఎందుకు గొప్పవాడినో తెలిసికొను. అలాగే ఈ అశ్వత్థవృక్షానికి బీజశక్తి అయిన అక్షరుడికంటెకూడ "నేను" గొప్పవాడినె, 'నేను' అనే భావం చాలసూక్ష్మం. అందుకె అదిగొప్పదంటే పదార్థశాస్త్రజ్ఞునికికూడ అభ్యంతరముండదు. ఈ క్షరాక్షరాలకంటె నేను ఎందుకు గొప్పవాడినో అందు వల్లనె నేను పురుషోత్తముడుగా వేదాల్లో ప్రసిద్ధుడై ఉన్నాను. ఈ రెంటికీనాకూ

భేదముందంటున్నానని అర్థం చేసికొనకు నాచేతికీ నాకూతేడా ఉన్నదని ప్రవర్తించాల్సిన సమయం వేరు. నన్నుఅన్నప్పుడు నాచేతినికూడ అని ప్రవర్తించాల్సిన సమయంవేరు. సందర్భమెరిగి తెలిసికొనడం అవసరం.

19. ఎవరయితె పరబ్రహ్మమైన నన్ను, అభిమాన రహితుడై తెలిసికొంటాడో అతడి స్థితిగొప్పది. అతడి ప్రవర్తనం ప్రపంచంలో ఎలా ఉంటుందంటె సర్వభావాల్లో కూడ అతడునన్నే ధర్శిస్తూ ఉండటంగా ఉంటుంది. ఇదిగుహ్యతమమైన శాస్త్రం. దీన్ని తెలిసికోవాలి. అనుభూతిచేయాలి. అలాతెలిసికొని అనుభూతిచేసినవాడు బుద్ధిమాన్ అవుతాడు. కృతకృత్యుడవుతాడు.

మరి సర్వభావాల్లో భగవంతుడ్ని తెలియటమెలా?నువుచెప్పావు నేను నమ్మతాను గుడ్డిగా అంటె చాలునా? మరి సర్వత్రభవంతుడై అవుపడుతున్నాడనే అనుభూతికలిగేటంతనమ్మకం ఉంటె అదితప్పిపోయే వరకూ చింతలేదనుకోవచ్చు–కాని, కార్యకారణసంబంధరీత్యా బుద్ధికి తెలిస్తేనేకాని అది స్థిరంగా ఉండదుగదా. అందుకు తెలియాలి. సర్వభావాలాననటం. తెలియటం ముఖ్యం.బుద్ధి ఇక ఎన్నడు తిరగబడలేనంతగా తెలిసిపోవాలి. బుద్ధి అలా స్థిరమయితె మనసు బుద్ధికిలొంగిపోవటం అలవాటు చేసుకొంటూపోతే, కొంతకాలానికి మనసూ ఇంద్రియాలూ అన్నీ ఒకేఒక పంథాకు వస్తై అప్పుడు చేతికి, కాలికి తగిలిందల్లాభగవంతుడని తెలిసినాచేయి–కాళ్ళెక్కడ పెట్టితెఅక్కడ భగవంతుడున్నాడనే సర్వభావేన భజనచేకూరుతుందిఅనిధ్వని. అప్పుడూ అనుభూతి అయింది అనగలగటం.

భగవంతుడె ప్రపంచంగా అయి అలావాన్ని సృష్టించాడు. అలా సృష్టించక పోయినా భగవంతుడు ఎప్పుడూ ఉండేవాడే. సృష్టికీ, ప్రపంచానికి భగవంతుడు అతీతుడు–అనేది ప్రధానజ్ఞానం. ఆయనకు సత్ చిత్ ఆనందమనె లక్షణాలు ఉంటవి. సత్ ఉంది కనకనె అతడు ఎప్పుడూ

ఉంటాడనేది సత్యం. చిత్ అనేది ఈశ్వరేచ్ఛకు క్రియారూపం. తానే ఆవస్తువై అనంతమైనఆనందాన్ని అనుభవిస్తుంటాడు భగవంతుడెల్లప్పుడూ. ఇది తెలియాలి.

ఈ ప్రపంచం చూడటంలో తాకడంలో వినడంలో ప్రవర్తించడంలో వేరుగాఉండే ఏ ప్రపంచాన్నీకాదు అతడనుభవిస్తున్నది. భగవంతుడైన తననె. పదార్థశాస్త్రజ్ఞుడు మనుష్యుల్నిచూస్తూ ఎలెక్ట్రానులూ ప్రోటానులూ వాళ్ళల్లో ఎలా కదులుతున్నాయో ఆలోచిస్తూ అనుభవిస్తూ ఉంటాడనుకొందాం ఆవిధంగానేజ్ఞాని 'సర్వత్ర భగవంతుడ్నిచూసి 'సర్వభావేన భజతి' అనే దానికిసమంగా ఉంటాడు. తాను అణువెగనక శాస్త్రజ్ఞుడికి ఏమీతెలీదు, అనేపసివానిమాటకీ, జ్ఞానివట్టిపిచ్చివాడు అనే మన మాటకీ తేడాలేదు. జ్ఞానం కావాలనేవాళ్ళకు ఈ అనుభూతిని మనసులో అనుసంధానంచేయడం చేతకావాలి. అప్పుడె అర్థమయేది జ్ఞానం. జ్ఞానం బుద్ధికి, మనసుకు, శరీరానికీ కూడాకలిగి అర్థంకావాలి. ఇంద్రియాలు కూడ ఈ జ్ఞానంలో మున్కవేయాలి. అలాటి అనుభూతి అయినప్పుడు ప్రపంచంలో జరిగే పనులన్నీ—స్వంతపనులుగా—తన శరీరంలోని పనులే తాను చేస్తున్నట్లుగా అనుభూతి అవుతుంది.

20'నేసి శ్లోకాన్ని గుహ్యతమమైన శాస్త్రం చెప్పాను. అంటే కేవలం [illegible] మాట. [illegible] కొంచెం కృతకృత్యు [illegible] చేయాలో [illegible] పోతావని [illegible]

ఈ భగవత్తత్త్వం [illegible] కారణం మనం [illegible] మిగతా ప్రపంచాన్ని చూస్తున్న [illegible] రణమే [illegible]

సుమా అనుకొనడం అవుతున్నది. తాను అంటే తన శరీరం, మనో, బుద్ధులు అనే ధ్యాసే ఉండి ఉండటం దీనికి మూలం. అందుకే నేను అనడానికి బదులు ఒక కుటుంబం ప్రమాణంగా పెట్టుకొని మేము అనుకోమనడం, ఒంటరిగాని మన సత్త్వం కంటె కుటుంబీకుని మన సత్త్వం మెరుగు అనటం. మేముహిందువులం మేము ముస్లిములం అనే సామూహిక భావం మెరుగు అనటం, దేశమే నేను అనే దేశభక్తులు మనందరికంటె ఎంతో మెరుగు అనడం. సర్వప్రపంచమూ వర్ధిల్లాలి అనే బుద్ధి శంకరాచార్య ప్రభృతులు ఇంకా పెవాళ్ళు అనడం. వాళ్ళకు ఈ సచ్చిదానంద తత్త్వంతోసహా భగవంతుడే ఈ ప్రపంచంలో ఆవహించి నిలిచినట్లు అవగతమవుతుంది. ఆస్థితిలో బ్రహ్మమే సత్యం. జగత్తు అనే ఈ సంసారజంజాటం అంతా మిధ్య. అది పరాకాష్ఠస్థితి. జగత్తు ఎలా మిధ్య అని శంకవస్తుంది. సర్వమూ భగవంతుడేను అని తెలిసినక్షణాన అది మరొకటికాదు అని తెలిసినప్పుడు-జగత్తు అనే మాట మిధ్య అంటే తప్పేమిటి? స్వప్నంలో అనుభవంపొందినవ్యక్తి స్వప్నం అబద్ధమనటల్లేదా! దానిపుట్టుక కేవలం పరిమితమైన భ్రమాత్మకమైన "నేను" అనే అహంవల్ల అని తెలిసినప్పుడు జగత్తు మిధ్యగాకేమిటి?

క్రిందటి అధ్యాయంలో గిరి గీసికొన్న అహంకృతి నుంచి పశాలను విడగొట్టి తనను తను వేరుచేసికొనవలసిన అవసరం చూపించారు. తాను, "అహం" భగవదంశమనే భావబలంకోసం చేసినపని అది. అంతటితో చాలినట్లయితె, భగవంతుడని తెలిసికూడ త్రిగుణాలు ప్రత్యేకం అనే భ్రమలో పడకూడదు. అవి సమ్యక్ పంథా కాదు. ద్వంద్వంకలుగుతుంది.

మరి వాటి నెలా అర్థంచేసికొనాలి? నీకు కనపడే సత్త్వగుణం భగవంతుడి "సత్" లక్షణమనీ, రజోగుణంవాని 'చిత్" లక్షణమనీ, తమోగుణం ఆనందస్థితి అనీ తెలియాలి. ఈ శరీరం మనసూలు ఏర్పడవం చేసే ఈ సత్ చిత్ ఆనందాలు అవతరించి వచ్చినవని అర్థం.

కాన ఈ సంగతులు అనుభూతి అయేదెలా? తెలుస్తవి బుద్ధికయితే. అది అనుభూతి కావడంకాదే!! అందుకే—అ-సంగమును ఆధారంగాచేసి ఈ ఊడలవృక్షాన్ని నరికేస్తేనే తెలుస్తుంది ఆత త్త్వం—అని ఈ ఆధ్యాయంలో చెప్తున్నారు. ఇప్పుడు మనకున్న అహం పరిమితి నశిస్తేతెలుస్తుంది ఆత త్త్వం.

పధ్నాలుగవ అధ్యాయంలో జీవునినుంచి విడగొట్టబడిన ఈ గుణాలు భగవంతుని సత్ చిత్ ఆనందాల వికృతులే. అనితెలియాలి.

ఈ పరిహేనో అధ్యాయంతో జ్ఞానవిషయం స్పష్టంగా విశదీకరించడమయిపోయింది. దీనిని బ్రతుకులో అన్వయించి అనుభూతిచేయటమె మిగిలినపని. చాల పై స్థాయిలో చెప్పదగిన మాటలన్నీ అర్జునుని ఆ స్థాయికి తీసికొనిపోయి శ్రీ కృష్ణుడు అర్జునునకూ మనకూకూడచెప్పేశాడు. మళ్ళీ అక్కణ్ణించి అర్జునుడు క్రిందికిదిగి వచ్చాడంటె ఆ చెప్పిన జ్ఞానాన్ని వర్తింపజేయగలడోలేదోనని తిరిగి శ్రీకృష్ణుడు మూడధ్యాలు క్రింది స్థాయిలోని ఆవిద్యనుగూర్చి చెప్తూ జ్ఞానాన్ని (విద్యను) పూర్వ రంగంగాచేసి ప్రపంచంలో ఎలా నాటకం ఆడాలో, అంటె, ప్రవర్తించాలో చెప్పబోతున్నాడు. దైవాసుర సంపద్విభాగయోగంలోనూ శ్రద్ధాత్రయ విభాగయోగంలోనూ వరుసగా అవిద్యాత్మకమైన జనులు ఎలా ప్రవర్తించుతుంటారో ఎలా ప్రవర్తింపవలసి ఉన్నదో చెప్తూ చివరి ఆధ్యాయంలో బుద్ధిమంతులెలా తమ తమ నైతిక ప్రవృత్తిననుసరించి నియతిననుసరించి. జ్ఞానాన్ని బుద్ధిలో అనుసంధానంచేసి తమ తమ కర్మలను చేస్తారో అలాగే. తమ దైనిక కర్మలను. కర్తవ్య కర్మలను, నియతి ననుసరించిన కర్మలను,చేసి జీవన్ముక్తులు కావాలిఅనే బోధ చేశారు. అత్యున్నత స్థితికెక్కి "నేను"ను (అహంను)నశింపజేసి తత్‌లో చేరటం ఈ ఆధ్యాయంలోని పరాకాష్ఠ.

ఇది పదిహేనవ అధ్యాయం.



# శ్రీ మద్భగవద్గీతా మననము

## పదునారవ అధ్యాయము

## దైవాసుర సంపద్విభాగ యోగము

## నిదిధ్యాసనాయుతమైన బ్రతుకుబాటకావాలి



భగవానుడు ఇంతవరకూ సృష్టితత్త్వాన్ని బోధించాడు. తత్త్వమంటే—తత్ అయిన్న ఆపరబ్రహ్మమే, త్వం అయిన నీవుగా ఉండిన సంగతిని తెలియచెప్పేది. ఈ తత్త్వం తెలిసిన మీదట ఏపని చేసినా ఏ ఆలోచన చేసినా "సర్వభావేన మాం భజతి"అని కూడ భగవానుడు చెప్పాడు. "అన్ని విధాలా నన్నే భజిస్తూఉండు" అన్నాడని చెప్పడం. ఇదె గుహ్యతమమైన శాస్త్రం. ఎందుకనంటే బుద్ధి, హృదయం అనే యీ రెంటి అంతరాంతరాల్లోనూ అనుభూతిచేయవలసియుండే జ్ఞానమే భజనం కనుక, ఇది తెలిస్తే—అనగా ఈజ్ఞానం కలిగినట్లయితే—ఈ బాహ్యప్రపంచంలోని సర్వమైన కార్యాలూ "అదివరకె చేయబడినట్టివి" అవుతవి. నీలోనున్న త్వం అయినవాడు ఊరికె అనుభవిస్తూ ఉండటమె అవుతున్నదన్నమాట. అందుకె అతడుకృతకృత్యుడయినాడన్ని చెప్తారు. అంటె చేయబడినవాటినె అతడు చేస్తున్నవాడవుతున్నాడని అర్థము.

కాని అన్నిపనులూ అదివరకె చేయబడినవి అన్నప్పుడు ఇక మానవుడు ఏలానిపనిచేయాలి. అది చేయటల్లేదు. ఇది చేస్తున్నాడు అని అనవలసిన అవసరంరాదే! ఈమంచిచెడుల మతలబులేమిటింకానూ అని శంకవస్తుంది.

ఇక్కడి కీలక విషయం యేమిటంటె భగవంతుడే మానవుడయి ఉన్నాడు. అతడొకసారి ఈ పనులన్నీచేసేసి తిరిగి వాటినే ఈమానవుని చేయుమంటున్నాడనుకోవటం సరికాదు. భగవంతుడు మానవుడుగా అయిన క్షణాన యీ పనులన్నిటినీ చేస్తున్నాడు. ఐతే ఈక్షణాన భగవంతుడా చేసేదిలేక మానవుడా? ఇద్దరూ ఒకటే నన్నప్పుడు ఈ విభాగం

ఎలా వస్తుంది గనక ఇంకా? ఏ పని జరిగినా అది భగవంతుడే చేస్తున్నాడనేమాట నిజము. పైగా అది మానవుడే చేస్తున్నాడనేది కూడ నిజమే. ఈ రెంటికీ తేడాలేదు.

ప్రభుత్వంలో మనం ఉద్యోగం చేస్తున్నాం. మనం చేస్తున్నపని ప్రభుత్వంచేస్తున్నట్లా? లేక మనమే చేస్తున్నట్లా? ఏది కాదు?

అందుకె ఈ ప్రపంచంలో జరిగేపనులన్నీ దేవుడే చేస్తున్నాడు, మానవుడూ చేస్తున్నాడు.ఆ రెండు పేర్లూ ఇద్దర్ని తెలియ చెప్పటల్లేదు. రెండు హోదాలనే తెలియజేస్తున్నవి. మానవుడు చేసినమేర పుణ్యాపాపాలు మానవుడికి చెందుతవి.అతడుగా గాక దేవుడుగా చేసినపనుల మేర పుణ్యాపాపాలేవీ మానవునికి తగులుకోవు, మానవుడుగా కోరికలతో పనులుచేయ వద్దన్నదందుకనె.

కర్మ శరీరంతో చేయాల్సింది. మనః పరిస్థితిలో అసక్తత కలిగి ఉండటం వల్ల చిత్తశుద్ధి కలుగుతుంది. బుద్ధితో తత్ పదార్థ విషయం తెలిసి సర్వత్ర వ్యాపించి ఉన్న ఆతత్‌ను ప్రపంచంలో ఎక్కడచూచినా జ్ఞాపకం చేసికొంటూ ఉండాలి. అలాచేస్తే హృదయంలో, అంటె అంతర్దృష్ట్యా, తత్ అనె భగవంతుడు అనుభూతి అవుతాడు. అదె జ్ఞాన దృష్టి. ఈ విశ్వమంతా అభగవంతుడనీ ఈ సర్వ విశ్వాలూ మనడానికి అతడె ఆధారమైన వాడనీ అనుభూతి కలిగితె, అది భక్తికీ జ్ఞానానికీ కూడ పరాకాష్ఠ.పదిహేనధ్యాయాలలో ఈ ప్రక్రియలు సమగ్రంగా విశదీకరించి మనసు భగవంతునితో తాదాత్మ్యమ్మయిన స్థితిని కూడ వర్ణించారు.

ఇక మిగిలింది సాధకులం—మనం-తాదాత్మ్యం కావటమె.ఎలా ఎప్పుడు? ఈ ప్రశ్నకు సమాధానం సాధకుని శ్రద్ధమీద ఆధారపడి ఉంటుందని శ్రీకృష్ణుడెప్పుడో చెప్పాడు.అతాదాత్మ్యత పరాకాష్ఠ నందే వరకూ వ్యక్తి బ్రతుకుతూ ఉండాల్సిందె కనుక, ఎలా బ్రతకాలి అనేది ప్రస్తుత ప్రశ్నఅవుతుంది. బుద్ధికి, మనసుకు, శరీరానికి తెలిసిన

అవగతమయిన, అలవాటయిన జ్ఞాన, భక్తి, కర్మలను, సమన్వయించి బ్రతుకులో చొప్పించటమె ఇప్పటి కర్తవ్యం. అదె బ్రతుకుబాట. దానినె నిధిధ్యాసన మనె సాధనగా చెప్తారు.

మననం పరిపూర్తి అయిన క్షణాన ఈ నిధిధ్యాసన మనెసాధన వైపునకు వ్యక్తి తిరగాలి. బ్రతుకు నడుపుతూ ఈ నిధిధ్యాసన చేయటం సాధ్యమా అనే సందేహం కలుగుతుందిగాక. అందుకె ఈ అధ్యాయంలో బ్రతుకులో కలిగే రెండు పంథాలువిశదీకరించి ఒకటి ఆసుర సంపద అనీ ఇంకొకటి దైవీ సంపద అనీ చెప్పి, కేవలం దైవీసంపద ననుసరించటం వల్ల ఈనిధిధ్యాసనమనేదాన్ని మననానికి ప్రతిఫలంగా చేసి నడపవచ్చునవనే సూచనను ఇస్తున్నారు.

మానవులలో రెండు రకాలయిన మనుష్యులుంటారు. తానుచేసే పనులన్నీ భగవంతుడె యథానియతిగా జరుపుతున్నాడనుకొంటూ క వ్యాలు చేసుకొని పోయెవాడొకరకానికి చెందుతాడు. అలా అనుకోక మానవుడైన తనగొప్పతనం, గౌరవం, పదవి, కోసం తన స్వార్థం కోసం తన మనసు చెప్పినట్లు పనులు చేసేవాడు రెండోరకానికి చెందుతాడు. మొదటివాడి దైవీసంపదకు చెందినట్టి గుణము. రెండవవానిది కాదు. ఈ రెండోవారు కేవలం ఆసుర సంపత్తికి చెందిన వారు. ప్రపంచంలో ఎక్కువ ఈ సంపదె ఉండటం పరిపాటి అయింది ఇప్పుడు.

ఈ దైవీగుణాలు గాని, ఆసుర గుణాలుగాని వ్యక్తియొక్క సూక్ష్మ శరీరంలో మనసులో ఉంటూ ఉండేవి. వాటి ననుసరించె అతడి ప్రవర్తనం ఉంటుందిగాక, అందుచేత ఆగుణాలు అతడికి పుట్టుకతో వచ్చేవేననేది ముఖ్యమైనమాట. ఇది నిజమైనంతమాత్రంచేత శరీర త్యాగం వరకూ అతడు అలాటివాడే ననడానికీ వీల్లేదు. ఎందుకంటే మనిషికి భగవంతుడు ప్రసాదించిన బుద్ధికారణంగా అతడు తన గుణాలలో మార్పుతెచ్చుకోగలడు, ఏలాటి మార్పుతెచ్చుకొన్నా అది అతడి అంత రాంతరాల్లో జరుగ వలసిన మార్పేగాని బాహిరంగా పవిత్ర

ం శరీరంమీమ్మీద చల్లటం వల్లగాని,పాపపరిహార పత్రాలు కొనటం గాని, కొబ్బరిముక్కల ప్రసాదం తినటం వల్లగాని జరుగదనేది నీయం.

మూడునుంచి ఐదుశ్లోకాల్లో "దైవీమ్‌సంపదమ్ అభిజాతస్య" "ఆసురీమ్ సంపదమ్ అభిజాతస్య" అనీ"దైవీమ్ అభిజాతోని" శ్రీకృష్ణుడు అన్నప్పుడు "లోపలినుంచి, అంటె,అంతరాంతరాల్లో పుట్టుకు వచ్చిన దైవీసంపదగలవారని, లేదాఆసురీ సంపదగల అర్థం అనిపిస్తుంది. కేవలం బాహ్యంగా వేషంవేసుకున్నవారు నైజంగాగల సంపదను త్రోసివేసి మరొకసంపదను పొందిన వారని అర్థము.అంతరంగంనుంచి మారాలంటె శ్రవణమననాలు సరం. శ్రవణ మననాలు ఇతః పూర్వపు పదిహేనధ్యాయాల్లోనూ చర్చితమయింది, ఆవిషయాలు అనుసంధానమై నీఅంతరంగంలో గుణాల పాళ్ళు మారి సత్త్వగుణాధిక్యతనీకు కలిగితె అప్పుడు అభ్యాసనమువల్ల ఆ సత్త్వస్థితిని స్థిరంచేసికొని,శుద్ధ సత్త్వస్థుడు టానికి అవకాశమున్నది అనిబోధ.బ్రతుకయితె నడుస్తూనేఉండాలి. టి ప్రవర్తనతోననే శంక మళ్ళీరావటం కద్దు.

1—2 భగవంతుడు చెప్తున్నాడు.సర్వభావేన భజించే వాడు తానే వంతుడు అని కదా సూత్రం.అప్పుడు ఆ'తాను' ఎలాఉంటాడంటే, అభయంతో కన్పడుతాడు. కనబడటం కాదు కీలకం—అలాంటి స్థితి ఉండటం అనేది ముఖ్యం. తనయందు భగవంతుడున్నా —కాదు—తానే భగవంతుడని అనుకొనే స్థితి అనుసంధానమై త తనే ననే స్థితి అనుభూతి అవుతుంది,అలాంటి వానికి అభయం మిటిః ఇక రెండవది త్రికరణశుద్ధి.దీనినె సత్త్వ సంశుద్ధి అంటారు. వాక్కాయ కర్మలలోనూ సత్ పదార్థాన్ని తెలిసి వ్యక్తం చేయ అదె జ్ఞానయోగ స్థితిని కలిగి యుండటమని అర్థము. ఇంకా—

దానం, దమం (ఇంద్రియ నిగ్రహం) యజ్ఞం స్వాధ్యాయం తపస్సు ఋజుత్వం, అహింస, అప్రియమూ అనృతమూ అయినదానిని వదలివేసి చెప్పటం, అక్రోధం—అనగా కోపంలేకుండటం—త్యాగం, శాంతి, ఇతరుల తప్పులను పట్టకుండటం, దయగలిగి యుండటం, విషయాలను చూచి కూడ చలించకుండ ఉండటం, మృదుత్వం, చెడ్డ పనులు చేయడం అంటె సిగ్గు పడటం, వ్యర్థమైన పనులుచేయక యుండటం. ఇవన్నీ దైవీసంపదలోవి. ఇవన్నీ జ్ఞానం వల్లకలిగేవి, ఆ జ్ఞానం లేనివారికి కూడ ఇవి ప్రధానమైనవిగా బోధించేది వారికయిన మతము. ఏ మతమయినా ఈ పై పదాలలోని పరమార్థాన్ని (spirit) ను చెప్పితీరటం గమనిస్తాము. వీటి మూలం చెప్తున్నట్టిది ఈ భగవద్గీత. ఇది కేవలం హిందూమతమనీ అందువల్ల దీనికి భారతరాజ్యాంగచట్టరీత్యా ప్రాపకం ఇవ్వరాదనీ మనం అప్పుడప్పుడూ అనుకోవటం ఎంత పొరపాటో—చెప్తేతెలీకపోవచ్చుకాని—బుద్ధి కలిగి ఆలోచించేవారికి అర్థంకాని విషయమేం కాదు.

3. ఇంకా దైవీసంపదక్రిందకి వచ్చేవి చెప్తున్నారు. తేజస్సు, క్షమా, ధృతి, శౌచంకలిగి యుండటం, ద్రోహమూ, అతిమానితమూ లేకుండా ఉండటం, కూడ అందులో చేరుతయి.

బ్రతుకులో ఎన్నో విషయాలు, వస్తువులు, వికారాలు భావాలు తగులుతయి. వస్తువులన్నీ భగవంతుడేననుకొనడానికి ఏమంత కష్టమనిపించదనిపిస్తుంది. కాని మనసులో కలిగే భావాలన్నీ భగవంతుడేననడానికి వీలులేదు. అలా అన్నా, మనసులో భగవంతుడంటే అర్థంతెలీకవాడెవరోననుకొని వానిపైఅపేక్షలేకుండా వ్యతిరేకంగా కలిగేభావాలన్నీ దైవీసంపత్తిక్రిందకురావు. మానవుడూ భగవంతుడూ ఒకటే నయిన భావం సత్ భావం. ఇద్దరూ వేరనీన్నే హితులనీ అనుకోవచ్చు కాని వానిపై చెయ్యితీసి వేసి ప్రక్కకు తిరిగి వ్యభిచారంచేసేటప్పుడు తనస్వార్థం చూసుకొన్నవాడవుతాడు మానవుడు అప్పుడున్న ఆసంపత్తి అసుర సంపత్తి అంటున్నారు.

4. ఈ అసురసంపత్తి ఏమిటనేది సూచనప్రాయంగా కొన్ని దుష్ట భావాలను ఉదహరించి తెలియచెప్పవచ్చు. దంభం, దర్పం, అభిమానం, క్రోధం, పరుషత్వం, అజ్ఞానం ఇవి అసురసంపత్తి ఆధారంగా కలిగేవి.

5. శ్రీకృష్ణుడు చెప్తాడు— దైవీసంపదకలవారికే మోక్షం కలగటమనేది సంభవం. ఆసురీభావం కలవారికి బంధమేకలుగుతుంది. పాండవా! నువ్వు దైవీసంపదతోనే పుట్టావులే. పుట్టటం అనేదానికి శరీరం పుట్టటం అనిమాత్రమే అర్థంచెప్పితే తత్త్వమే కుంఠితమయి పోతుంది. జన్మ స్థూలశరీరానికె కాదు. సూక్ష్మశరీరానికీ ఉంటుంది. శారీరిక మృత్యువూ-జన్మా-ఇవి పరమేశ్వరుడి అనంతమైన ప్రపంచంలో మైలురాళ్ల మాత్రమే. భగవంతునితో తాదాత్మ్యం పొందినప్పుడు జన్మఅనేదిలేదు-త్వం అనేదానికి.శరీరం ఉన్నాసరె-ఈ బ్రహ్మతాదాత్మ్యం కలిగినప్పుడు అతడుదేవుడే. జన్మలేనివాడే జీవన్ముక్తుడే. అలా తాదాత్మ్యం కానప్పుడు, అంటే, తాను తనగిరిలో కళ్లుమూసికొని దేవులాడుతున్నంతకాలం క్షణక్షణానికీ జన్మే. అసురసంపదలో చెప్పిన భావం వచ్చినప్పుడల్లా అసురజన్మ, దైవీసంపదలోని భావం కలిగినప్పుడల్లా దేవతజన్మ, [illegible] శరీరం వస్తేగాని [illegible] పొందలేమని అనుకోనక్కరలేదు. [illegible] జన్మేను అనేది ఇక్కడి [illegible] అనిపిస్తుంది.

అందుకే శ్రీకృష్ణుడు అర్జునుడితో “దైవీం సంపదమ్ అభిజాతోసి” అని, నీవు దైవీసంపదలో జన్మించావు అని అంటున్నాడు. దీని అర్థం నీశరీరజన్మ “రాజుల” అనే [illegible] వంశంలో [illegible]. అదా? ఆమాత్రపు సంగతి అర్జునుడికి చెప్పాల్సిన పనేమిటి? దాని అర్థం ఏమిటంటే—నీవు ఇప్పుడు తత్త్వవిషయం వినటానికి ఉన్ముఖుడవైనావు. ఇది దైవభావము. [illegible] పుట్టావు అనుకోండి—[illegible]

వ్రతంలో మునిగి ఉంటాడు. అందుకని చింత కామభోగ పరాయణత్వం ప్రళయాంతంవరకూ నడుస్తూ ఆశాపాశబద్ధుడై వెనలిగి పోతూ నశించిపోతూ ఉంటాడు. అలాగే జనాభా అంతా తయారయితే అంతా అలా నశించిపోతూనే ఉంటారు. వారి వారి ఆశాపాశం వల్లనే వారు నశించి పోవటం అవుతుంటుంది.

13–16 "ఇవాళ ఇంత సంపాదించాను. నాకోరికనెరవేరింది. ఇంత ధనముంది. ఇంకా ఇంత ధనం వస్తుంది. ఈ శత్రువునాచేత చంపబడ్డాడు, మిగిలిన వారిని కూడ జయించేస్తాను. వీళ్ళందరికీ నేనూ నేతను. భోగిని. బలవంతుడను సుఖుడను ధనవంతుడను, కులీనుడను. నాతో సమానమైన వాళ్ళు ఈ పరిసరాల్లో ఎవరూ లేరు. యజ్ఞంచేస్తాను. దానంచేస్తాను ఆనందిస్తాను." ఇలా ఎవరికి వారు అనుకొంటూ అనేకచిత్త విభ్రాంతులచేత విక్షిప్తమునకలవారై—మోహంచేత కప్పబడినవాళ్ళై విషయభోగాల యందు ఆసక్తులై మలినమైన నరకాన్ననుభవిస్తున్నారు.

17–21. వాళ్ళు తమ గొప్పతనం, వాళ్ళే చెప్పుంకొంటూ వినయంలేనివాళ్ళై ధనమదాంధులై విధిరహితంగా నామమాత్రమైన యజ్ఞాలను చేస్తూ ఉంటున్నారు. వారికి కావలసినంత అహంకారం! పరులను పీడించడానికి వీలున్నంత శక్తి, బలం వాళ్ళకుంటయి! అంతకు మించి గర్వం! స్త్రీ విషయిక మయిన—ఆదె—రతిపూర్వకమైన కామం. తమ ఇచ్ఛనెరవేరకుంటె అపరిమితమైన కోపం ఇన్నిఉంటయి. తీరా వారి దేహంలోనే ఉన్నట్టి "నన్ను" (భగవంతుని) ఎవరైనా జ్ఞాపకంచేస్తే ద్వేషించుతూ ఉంటారు. సన్మార్గుల్ని నిందిస్తూ ఉంటారు. అలా వాళ్ళు ఈ క్రోధం, ద్వేషం, కామములలో ఉండటమంటే అర్థం నరకంలో ఉండటం కాదూ? అంతే వారు చేస్తున్నపని. ఇంతకూ ఇలా ప్రవర్తించరాదనీ దైవీసంపదకలిగి ప్రవర్తించాలనీ బోధ.

ఈ ఆసురీసంపదకు మనసే కారణం. మనసు ఎలాచెపితె అలా నడుచుకొనేటప్పుడె మనసు స్వార్థానికె సతతమూ ఆలోచించటం వల్ల ఆసురీ సంపద ఆవహిస్తుంది. దానిని బుద్ధిచేత నియమించి దైవీసంపద వైపునకు త్రిప్పితే తప్ప లేకపోతె అధోగతిలోనె ఉంటుంది.

“నామనసు ఎప్పుడూ సరిగానే ఆలోచిస్తుంటుంది” అనుకొంటున్నావేమో. నీ ఇంద్రియాలు తెలిపె వస్తుజ్ఞానాన్ని బట్టి మాత్రమె నీమనసు ఆలోచిస్తె ఎలాంటి ప్రమాదంలో దిగిపోవటమవుతుందో ఆలోచించు. కిటికీలోంచి నీ బంధువు నొకామె గుండెపై ఎవరో చేయి వేసినట్లు చూసి కత్తి దూస్తావు. అతడు వైద్యుడని, ఆమె అపస్మార స్థితిలో ఉన్నదనీ నీకు తెలీక ఎలా చేస్తావు. నీమనసును అనుసరించి వెంటనే నీవు ప్రవర్తించటం సమర్థనీయమౌతుందా? కానీ చేసినా దానిని “ప్రాణులేవీ నిష్కారణం” అనే శాస్త్రవిధిని పాటించకపోతె నీ ప్రవర్తనెలా దైవీసంపద ప్రతిఫలిస్తుంది? అసలు నీమనసు పెట్టుతున్న భ్రమవల్లనే కదా ఈ సర్వప్రపంచం ఇలా నీకు కన్పడుతున్నది. ఈ భ్రమాత్మకమైన మనసునే ఆధారంచేసి నీవు నీ ప్రవర్తనను ప్రచోదయించేటట్లయితె ఇక దైవీ సంపద ఎలా కలుగుతుంది? ఎల్లప్పుడూ ఆసురీ సంపదేతప్ప!! అర్జునా! కర్ణుడు ఎదురైతె చంపుతానంటావు, భీష్ముడు ఎదురించినా చంపనంటావు. నువు జాతికి చేసే సేవ గనక నేనిలా యుద్ధం చెయ్యాల్సిందే—చంపాల్సిందె— అనుకోకపోతె నీమనసు పై ఆధారపడటం సరియైన పనవుతుందా?”

అందుకని మనసు ప్రమాణం అనవానికి వీల్లేదు. ఈ సంసార సాగరాన్ని తరించిన వారు చెప్పిన శాస్త్రజ్ఞానమొకటే ప్రధానమనేది గ్రహించాలి నువ్వు.

మరి సర్వప్రపంచం తమ మనసె ప్రధానమని యోచిస్తూ ఇలా తిరోగమిస్తుంటే—భగవంతుడైన నీనుంచి—నీవేంచేస్తున్నావు వారి విషయంలో అనబోతావేమొ, వీళ్ళల్లో నేనున్నా నన్ను చూడకుండా నావైపు

పృష్ఠంతిప్పి తమ గౌరవాలు తాము చూసుకొంటున్న వీరిని నేను ప్రత్యేకంగా ఏమీచేయనుగాక. సూర్యుడి క్రింద అనేకమైన పనులు జరుగుతుంటే అతడు చూస్తూ వెలుతురిస్తూ ఉన్నట్లే నేనూ ఉంటున్నాను. వారి దోవన వెళ్ళే వారిని నేను కదిలించి అనవసర ప్రసక్తికిదిగను గాక. ఆ చిత్రం గమనించటం చేస్తూంటాను. అందుకని విద్వేషులూ, క్రూరులూ, నరాధములూ అమంగళకరులూ అయినవారు వారిదోవలోనే ఉంటారు. దైవసంపత్తికలవారు నావైపునకు ఎలా వస్తుంటారో, అసుర సంపత్తికలవారు నాకు దూరంగా పోతుంటారు. వీళ్ళిద్దరూ నాలో భాగాలే. నాకు వీళ్ళిద్దరూ సమమే. నా వైపు వచ్చేవాళ్ళను అడ్డగించడం గాని దూరంపోయే వాళ్ళను నాకోసం రాబట్టటంగాని సర్వసాధారణంగా నా ఉద్యమంకాదు-ధర్మసంస్థాపనంకోసం అవతారం ఎత్తినప్పుడు తప్ప!

అందుకనే వాళ్ళు క్షణానికొక అసురభావం ఆవహింప జేసికొంటూ క్షణక్షణానికీ పుట్టటం చావటం అనే యీ సంసారంలో తిరుగుతూ దుఃఖిస్తూ ఉంటారు. ఈ సృష్టి ఇలాజరగడానికి కర్తను నేనుగాని అలా వాళ్ళు దుఃఖమార్గంలో ఉండటానికి కారణం వాళ్ళే. వాళ్ళనుమరి అలాగే ఉండనిస్తాను గాని, నేను ఇచ్ఛగించి, వారికేబాధాకలిగించటల్లేదు.

వీళ్ళు ముఖం నా వైపునకు త్రిప్పరు-అంటే-అంతర్ముఖులు గాక ఇంకో వైపు త్రిప్పి నడపటం చేత జన్మ జన్మానికీ-అంటే క్షణక్షణానికీ—నాకు దూరం వెళ్ళుతున్నట్లు అవుతున్నది. "నేను" పైనున్న వాణ్ణనుకొంటే వాళ్ళు క్రిందికి పోతున్న వాళ్ళన్నమాట. అధోగతికి పోతున్నారనటం ఈదృష్ట్యానే.

22. పై చెప్పిన భావాలు—స్థితులు మనస్థితులే అవుగాక. కాని అవే నరకమనే సంగతి తెలిసికొను. ఈ నరకానికి ద్వారాలు మూడు. కామం—క్రోధం—లోభం. ఈ మూటిని వదలటమే నా వైపునకు తిరగడం. తమోద్వారాలైన ఈ మూటినీ వదలి తప్పించుకొంటే నరుడు

తన శుభాన్ని తాను పొందినవాడవుతాడు. ఆ శుభాన్ని అనుష్ఠించటం వలన మోక్షాన్ని పొందుతాడు.

23. ఈ అనుసరించదగినదేది దేన్ని? ఏ ప్రవర్తనని? అనేదానికి సమాధానం శాస్త్ర విషయాలనే తెలిసి పాటించవలెనని శ్రీకృష్ణ పరమాత్మ చెప్తున్నాడు. శాస్త్రమెలా చెప్తే అలా చేయాలి. నేనింతవరకూ శాస్త్ర విషయాలెన్నో చెప్పాను. అన్ని శాస్త్రాలనూ ఎలా అర్థం చేసికొనాలో చెప్పాను. ఈ శాస్త్రాన్ని వదలి ఎవరైతే యథేచ్ఛానువర్తియై కామ పూరితుడై కర్మలను చేస్తాడో అతడు ఉత్కృష్టపురుషార్థాన్ని పొందడు. ఐహికసుఖాన్ని కూడ పొందడు. మోక్షాన్ని పొందే ప్రసక్తేలేదు.

24. కనుక, ఈ బ్రతుకు నడపటానికి కర్తవ్యాకర్తవ్య నిర్ణయం చేయడానికి శాస్త్రమే ఒక ప్రమాణం. ఆ శాస్త్రాన్ని నేనెలా చెప్పానో అలా అర్థంచేసికొని గ్రహించి ఆ శాస్త్రాను సారమే కర్మలను నిర్వర్తించాల్సి ఉన్నది. శాస్త్రమేది కర్తవ్య కర్మగా చెప్తోందో అది తెలిసి చేయుటమె కీలకమని బోధ.

శాస్త్రం అంటె ధర్మశాస్త్రాలు. ఫలాని ధర్మశాస్త్రం ప్రవచనం చేస్తున్నాను అనకుండానే శ్రీకృష్ణపరమాత్మ శాస్త్రాలకు శాస్త్రమైన తత్త్వశాస్త్రం చెప్పాడు. శాస్త్రం చదివినా ఈ తత్త్వ శాస్త్ర పూర్వకంగా అర్థం చేసికొనటం అవసరం.

మానవ వ్యవహారంలో కూడ ఎన్నో శాసనాలు, విధులు నియమాలు ఉన్నాయి, అయినా వీటిని అర్థం చేసుకోవటంలో, కోర్టులు వాటి అర్థం చెప్పటంలో, వ్యాఖ్యానించటంలో సూత్రాల వినియోగించినా అర్థం చేసికొనటమ్లోనూ అలాగే శాస్త్రాన్ని ఈ తత్త్వ శాస్త్రాన్ని ఆధారంగాచేసి తెలిసి ఆచరించాలని బోధ. బ్రతుకు బ్రతకటమెలాగో కీలకం.—శాసించి—అనుగ్రహింపబడిందిక్కడ భగవంతుడిచేత—అనిపిస్తుంది.

మనసుకాదు నీకు ప్రమాణం! అది భ్రమాత్మకమైనది కనుక దానిని ప్రమాణంగా తీసికోవద్దు. బ్రహ్మసాక్షాత్కారమందినవారుచెప్పిన శాస్త్రమేనీకు ప్రమాణం. దాన్నే ఆధారంగాచేసికొని నీవు శాస్త్రాన్ను గుణ్యంగా మలచి చివరకు నశింపజేయటం సాధన.

పదిహేను అధ్యాయాలలో ఆధ్యాత్మిక విషయాలను అనేక సాధనలను వివరించి కర్తవ్యమేదో అదె,—బుద్ధి యోగాన్ననుసరించి, అనగా అసక్తతను పాటించి,—చేయాలని చెప్పి శ్రీకృష్ణపరమాత్మ ఇక కర్తవ్యమేమిటనే ప్రశ్నకు ఈ అధ్యాయంలో శాస్త్రవిధియేదో అదేవని చెప్తున్నాడు, శాస్త్రాలను తాను చూపిన పంథాలో అర్థంచేసికొని వాటినె అనుసరించటమనేదే సర్వస్వమూను అని బోధించారు. ఎవరికి ఇష్టమొచ్చినట్లు వాళ్ళ శాస్త్రాన్ని అనుసరిస్తూనేఉన్నాము అనుకొనటం వల్ల ఏలాటి ప్రయోజనమూలేదనీ, శాస్త్రానికి శాస్త్రమయిన తన బోధలోని విశేష విషయాలపై ఆధారపరచి దానిని పాటించాలనీ బోధ— ఆయన వివరించిన విశేషవిషయాలు—బుద్ధియోగం అంటె సక్తి లేకుండా శాస్త్రోక్తవిధులు చేయటం. నిష్కామ కర్మచేయటం. శరీర వికారాలను అణచి అంతర్దృష్టికలిగి సమష్టి భగవంతుడే తాననితెలిసికొంటూ శాస్త్రోక్తమైన కర్తవ్యకర్మలను మాత్రమే ఆరంభించివేస్తూ సర్వత్రగల సమష్టిభగవంతునిచూస్తూ, తాను చేసేపనుల్లో(అవి అప్పుడు యజ్ఞాలె అనబడుతవి.) "బ్రహ్మార్పణం బ్రహ్మహవి ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతం" అని ప్రవర్తించాలి, జీవితాన్నే యజ్ఞంచేయాలి. చేతులుదేవ నర్చిస్తేనే చేతులు; ఆయన్ను వర్ణిస్తేనే జిహ్వ: ఇలాటి అనన్య భక్తిని సంతరించాలి. ఇదీ సందేశం.

శాస్త్రాలు అని ఎందుకంటున్నావయ్యా నీవుచెప్పేది చెప్పక? అనేదానికి 17వ అధ్యాయంలో సమాధానం చెప్పబోతున్నారు.

ఇతి పదియారవ అధ్యాయం.

# శ్రీ మ ద్భ గ వ ద్గీ తా మ న న ము

## ప దు నే డ వ అ ధ్యా య ము

## శ్రద్ధాత్రయ విభాగ యోగము.

### శాస్త్రమే ఏకైక ప్రమాణం



క్రిందటి అధ్యాయంలో శాస్త్రవిధిని వదిలేసి కామకారతులై ప్రవర్తించే వారికి సిద్ధి కలుగదనీ ఒకానొక శాస్త్రప్రకారం—అంటే—నియతి ప్రకారం కర్తవ్యాలైన పనులను చేసికొని వెళ్తూ బ్రతుకు నడుపుకొనటమే జ్ఞానులైన వారికి పరమమైనదనీ చెప్పి, కర్తవ్యమేమిటి అనే విషయం చర్చకు వచ్చినప్పుడు శాస్త్రమె దానికి ప్రమాణమని శ్రీకృష్ణపరమాత్మ చెప్పినాడు. పదిహేను అధ్యాయాలు కర్మ, భక్తి జ్ఞాన విషయాలు విశదీకరించి పదహారో అధ్యాయంలో ప్రపంచంలో నడుస్తున్నతీరుల్నీ నడవవలసిన పద్ధతినీ సూచించారు, దైవీ సంపదను పొందినిధిధ్యాసనా పూర్వకంగా మనవలసిందని చెప్తూ అందుకుగాను కేవలం కర్తవ్యమైన పనినే చేయాలి అనే సూత్రాన్ని చెప్పి. శాస్త్రమే కర్తవ్యమేదో నిశ్చయించాలని వ్రాకుచ్చినాడు. అన్నిటికంటె ముఖ్యమైనది ఆశాస్త్రాన్ని శ్రీకృష్ణుడు చెప్పిన తత్త్వ దృష్ట్యా—అంటే అనక్తపూర్ణమైనట్టి నిష్కాముకమైనట్టి పంథాలో అర్థం చేసికొని అందులోని కర్మలను ఆదృష్టితో చేస్తూ భక్తి యోగంలోచెప్పిన అంతర్దృష్టిని ఆధారంచేసి జ్ఞానం తెలిసి మనవలసి యుండటం ప్రధానమైనది,

నరక ద్వారాలు మూడనీ అవి కామం క్రోధం లోభం అనీఅన్నారు. వీటిద్వారా వెళ్ళితె నరకం కలుగుతుంది. వీటిద్వారా వెళ్ళట మంటే అర్థంభగవత్ప్రసక్తి వదలి,ఇతరాలను ఆలోచించటమె.భగవంతుడైన తనకు వీపుపెట్టి ముందుకు పడిపోవటమె నన్నాడు పరమాత్మ. ఎందు

కనంటె అవి బహిర్దృష్టియుతమైనవి. భగవంతుడు అంతర్గత దృష్టి ద్వారా పొందబడ వలసిన సమష్టిమనసు.

అలా బయటి వైపునకు పోవటం మాని, శ్రేయాన్ని మాత్రమె మనసా ఆచరించేవాళ్ళు మోక్షాన్నిపొందుతారు. శ్రీకృష్ణుడు చెప్పిన ఈ తత్త్వ శాస్త్రాన్ని వదలివేసి, కామనారతులై కర్మలను చేసేవాళ్ళు సిద్ధినిపొందరు. సుఖాన్నీ పొందరు. మోక్షాన్ని పొందే ప్రశ్నేలేదు. అందుకని శాస్త్రమును శ్రీకృష్ణుడు చెప్పినతత్త్వ దృష్ట్యా అర్థంచేసి కొని కర్తవ్యకర్మ చేయటం ప్రధానమైన విషయం. ఇదె మనుష్యు డెవడుగాని దైవీ సంపదను కలిగి యున్నాడు అనడానికి గీటురాయి. అనుభవం గడించిన మీదట బుద్ధిమంతులచే చెప్పబడినట్టివి శాస్త్రాలు. వాటిని తెలిసి పాటించాలి. అదే సరియైన మార్గమని శ్రీకృష్ణుడు నిశ్చయించి చెప్తున్నాడు.

1. ఇప్పుడు అర్జునునకు సందేహం కలిగి అడుగుతున్నాడు. "శ్రీకృష్ణా: ప్రపంచంలో ఎంతో మంది శాస్త్రవిధానంగా ఎన్నో క్రతువులు చేస్తున్నారు. ఎవరికి వాళ్ళు వాటిని తమ శాస్త్రవిధి ననుసరించి చేస్తున్నామనె అనుకొంటున్నారు. వాళ్ళ శాస్త్రాలు అలా చెపుతున్న సంగతి కూడ వారిమాటల దృష్ట్యా సత్యమె, కాని వీళ్ళు నీవు చెప్పిన ఈ తత్త్వ శాస్త్రాన్ని తెలిసిన వాళ్ళగా ఏకోశానా అవుపించటల్లేదు. ఈ మొత్తం ప్రపంచం నీవు చెప్పిన ఈ తత్త్వాన్ని ఉత్సర్జించి తనకు ఇష్టమైన విధంగా అర్థం చేసికొంటున్నారనిపిస్తున్నది, వాళ్ళయితె ఎంతో శ్రద్ధగానే ఆ క్రతువుల్ని చేస్తున్నారు. దివ్యుడు చేయదగినట్లుగా చేయక త్రిగుణాత్మకమైన నిష్ఠనే వెలయిస్తున్నారు. మరి-శ్రద్ధగా చేయబడే ఈ కర్మ—నిష్ఠ—సత్వగుణాత్మక మనవచ్చునా అంటే దైవీసంపద క్రిందకు వస్తుందా—లేక కనీసం రజోగుణాత్మకమనాలా? అలాగాక—కొంపముంచి—తమోగుణాత్మకమా?

2. అప్పుడు శ్రీకృష్ణుడుచెప్తున్నాడు. "అర్జునా యీ గుణాత్మల విభజన మెలా చేయాలి అని మాత్రమె యోచిస్తున్నావా? ఒక్క మాటగా దానికి సమాధానంచెప్పటం కష్టం. వాళ్ళు శ్రద్ధగాచేస్తున్నారంటున్నావుగాని ఆ శ్రద్ధకూడ మూడురకాలు. అతేడా మనసునుబట్టి అంతరంగాన్నిబట్టి ఉంటుంది, సక్తినిబట్టి ఉంటుంది. అంతరంగమనేది భావపూర్ణమై ఉంటుంది. ఆ భావపూర్ణతననుసరించె శ్రద్ధ ఉంటుంది, అంటె వ్యక్తి యొక్క స్వభావాన్ననుసరించె శ్రద్ధ ఉంటుందనేది ముఖ్యంగా తెలిసికొను. శ్రద్ధ సాత్త్వికమా, రాజసికమా లేక తామసికమా అనేది. అందుకనె స్వభావాన్ని చూచి నిర్ణయంచేయాలి. అంతర్దృష్ట్యా ఉండవలసిన భావాన్ని ఎంతవరకు ఎవరు అనుసంధానంచేస్తే అంతవరకె అతడు గుణాలను దాటుతుండగలడు.

3. అంతరంగంలోనుంచీ బాహ్య కార్యాలవరకూ ఏకరూపంతో ఉండే భావం ఏదయితె ఉందో అదీ శ్రద్ధ. అది సత్త్వాను రూపమైనది· స్వభావం ఎలాగో అలానే ఉన్నడని అర్థం, అందుకని వ్యక్తియొక్క అంతరంగం నుంచీ బయలుదేరి బుద్ధి–మనసు–శరీరం చేసేకార్యాల వరకూగల అధిష్ఠానం ఏగుణానికి చెందిందని చెప్తామొ అతడి శ్రద్ధకూడ ఆగుణానికే చెందిందనాలి. పైపైనితోచిన మాటనమ్మి అలాచేస్తున్నాను గనుక నాదీ సాత్త్విక శ్రద్ధేను అనటం సరికాదని ధ్వని. అంతర్దృష్ట్యాత్మకమైన సాధన అయినపుడె అది సాత్త్విక శ్రద్ధఅనాలిగాని బాహ్యభావమాత్రాన అది శ్రద్ధేకాదని బోధ.

4. సాత్త్విక గుణస్వభావులు దేవతలను (సాత్త్వికవృత్తులని అర్థం) ఆరాధించడానికి ఇష్టపడుతారు, రాజసికులు యక్షులనూ రాక్షసులనూ యజిస్తారు. తామసికులు పిశాచులను అర్చిస్తారు. వీరందరికీ అపరిమితమైన శ్రద్ధాభక్తులున్నవనె మన మంటాము. శ్రద్ధలేదని గాని తక్కువ అనిగాని అనలేము. ఎందుకనంటె వారు మనోవాక్కా

యుకర్మలా—దానిని సమ్మిశ్రచేస్తున్నారు గదా. వారు బాహ్యదృష్టితో మాత్రమే ఆ భక్తి చేస్తుంటే వారి మనసును బట్టి గుణంచెప్పాలి. అలా గాక ఆయక్షుడు, పిశాచము, కేవలం పరమేశ్వరుడుగా యెఱిగి అర్చిస్తుంటె అది అంతర్దృష్టియుతమై సాత్త్వికమవుతుంది. అంతర్దృష్టి పూర్ణమైన జ్ఞానం ఆ కర్మతో మిళితంకాకపోతె అదిసాత్త్విక శ్రద్ధేను అని చెప్పటం వల్ల ప్రయోజనమేమిటి, ఏమెట్టులో ఉన్నాడని తెలియడానికితప్ప!

5-6. ఆ శ్రద్ధ తీవ్రతవల్ల వారు శాస్త్రిమే ఊహించరాని, ఘోరమైన తపో కార్యాలు చేస్తుంటారు. మనసు నియమించాలి అనే సూత్రం చదివి. తమను తాము తలక్రిందులుగ వ్రేలాడ దీసికొని ఆ బాధలో మనసు ఇంకెక్కడికీపోవటల్లేదని సంతృప్తిపడి తపసు చేస్తుంటారు. ఎందుకు ఆ తపసు చేయడం అన్నప్పుడు కామరాగ వర్జితలు కారు గనక ననే సమాధానమె వస్తుందిగాక. దంభం, అహంకారం కలిగి, "నేనిలా చేస్తున్నాను చూడండి" అంటుంటారు. వీరు మూర్ఖులు. తమ శరీరాన్ని కష్టపెట్టడమలా ఉంచి, వారిలోనున్న నన్ను కష్టపెడుతూ ఉంటారు. అదేమిటి నిన్నెందుకు కష్టపెట్టారంటావేమొ! వారిలోనున్న "నేను" అదంతా అనుభవించటల్లేదా: వాళ్ళ దివిచారించరు. అంటే వారికి అంతర్దృష్టిలేదని చెప్పటం. అలా అంతర్దృష్టి కలిగే ఉన్నట్లయితే వారు నరకద్వారాల వైపునకే వెళ్ళరుగదా! కాని ఇప్పుడు 'నేను' వేరుగా నీతో వాళ్ళగురించి మాట్లాడుతున్నానుగనక "అయ్యోపాపం" అంటున్నాను. కాని అంతకంటె పట్టించుకోననుగాక. చిరునవ్వుతో చూస్తానుగాక వారిని,

ఇంతకూ వీరు త్రిగుణాత్మకులే అయినా యజ్ఞదానతపః కర్మలు చేస్తారుగదా అనబోతావు. ఆచేయటంలోని కీలకం—ఒక విధంగా దోషాదోషాలు—తెలియాలి. నీకు చెపుతానువిను. యజ్ఞం దానం తపస్సు—ఇవి ఎవ్వళ్ళకూ తప్పవి. చేయవలసినవి. ఆహారం ఇది వదలజాలనట్టిదెలాగో,

అలాగ అవికూడ చేయక తప్పనిసరి అయినట్టివి, వీటన్నిటిలోకూడ వ్యక్తి ఇష్టాయిష్టాలను బట్టి గుణాలు ప్రతిఫలిస్తవి. ఆహారం సంగతి విను ముందు.

7-10. సాత్వికులు ఆయుస్సత్వబల ఆరోగ్య సుఖప్రీతివర్ధనాలైనవీ, రసవంతమైనవీ, మెత్తని శుభ్రమైన, చెడని మనోహరమైన ఆహారములనే తినడానికి ఇష్టపడతారు.రాజసికులు చేదు, పులుపు ఉప్పు వేడి,కారం,ఎండిన వరుగులు ఇవి తినడానికి ఇష్టపడతారు.కాగా, తామసికులకు దుఃఖశోకామయ ప్రధానమైన,శుష్కమైన దుర్గంధమైన పులిసిన న్నవైన వస్తువులూ, ఎవరోతినివదలగా మిగిలిన వస్తువులూ తినాలని పిస్తుంది.ఈతేడా వారివారి బుద్ధి,మనసులలోనున్నతేడా అని తెలియాలి. వస్తువులవి కాదు.వస్తువులకు సక్తి రేదు కదా! సక్తిఉన్నప్పుడె ఈ త్రిగుణాలుఉంటవిగాని అదిలేని,వస్తువులకు గుణాలంటగట్టడం సరికాదు గదా!

11-13. ఇక యజ్ఞాల సంగతి. అవిచేయడంలోగల అంతరంగ స్వభావాన్నిబట్టి ఆ చేయబడినది సాత్విక యజ్ఞమనీ రాజసిక యజ్ఞమనీ చెప్పవచ్చుఫలం కాంక్షించకుండా యజ్ఞంచేస్తారు కొందరు. ఎందుకు చేస్తారంటాషేమొ. ఇది చేయవలసిన కర్తవ్యమై ఉందికనక చేయాలి అని మనసును సమాధాన పరచుకొని మరీచేస్తారు. పైగా శాస్త్రం ఎలాచెప్పిందో ఆలాచేస్తారు. అవి సాత్విక యజ్ఞాలు. దొరికిన పర్సు ఎవరిదో తెలిసికొని వారికి అందజేస్తాడు ఒకడు.అలా చేసినందుకు తనకెంతోతృప్తిని అనుభూతి చేస్తాడు. ఇది సాత్విక కర్మ లేదా యజ్ఞం.

మరికొందరు ఆ యజ్ఞఫలం ఫలాన అని తెలిసి అది పొందాలి అని దానినిచేస్తారు. అది రాజసికమైనపని అవుతుంది. ఇంకా కొందరు దంభంతో పొగరుమోతు తనంతోచేస్తారు, అదీ రాజసికయజ్ఞమె.

మూడవ రకం వారు దానిని శాస్త్రంలో చెప్పినవిధంగా చేయరు. విధిహీనంగా చేస్తారు. మంత్రహీనంగాచేస్తారు. ఇతరులకు పితృప్తినీ-కనీసం-భోజనతృప్తికూడ కలిగింపక చేస్తారు, శ్రద్ధతక్కువగాచేస్తారు. అదక్షిణ పూర్వకంగాచేస్తారు. అదక్షిణ అంటె కుటిల బుద్ధి అని అర్థము. అలాంటి కుటిలబుద్ధితో చేయటం తామసిక యజ్ఞమని పించుకొంటుంది.

14-16. ఇక తపస్సు సంగతి. తపస్సు మూడు రకాలు-శారీరిక తపస్సు, వాచికతపస్సు, మానసిక తపస్సు అని. దేవద్విజగురు ప్రాజ్ఞులను పూజించడం, శౌచం, ఋజుత్వం, బ్రహ్మచర్యం అహింసలను కలిగి పాటించటం ఇవి శారీరిక తపస్సు యొక్క లక్షణాలు. వాచిక తపస్సు అంటే-ఇతర్లకు దుఃఖాన్ని కలుగచేసే మాటలు మాట్లాడ కుండ ఉండటం, సత్యమూ ప్రియమూ అయిన మాటలనే మాట్లాడడం-వేదాధ్యయనం వాచికంగా చేయటం అనేవి-అన్నమాట. ఇక మానసికమైనతపస్సు ఎలాటి దంటే మనః ప్రసాదత్వము చిత్త నైర్మల్యము కనికరము కలిగియుండటం, మౌనం కలిగి వాఙ్నియమం కలిగియుండటం, మనోనిరోధం అభ్యాసం చేయటం భావశుద్ధి కలిగి యుండటం వంటివి భావశుద్ధి అంటే అంతః కరణ శుద్ధి అని అర్థము. దీనిని తెలియడానికి ఒక విధంగా నిష్కామ కర్మపై నిశ్చయమైన బుద్ధి కలిగియుండటం అనేది తెలియటం మార్గమనిపిస్తుంది. ఇదె మానసిక తపస్సు.

17-19. తపస్సుకూడ అదిచేయడంలోగల అంతరంగ స్వభావాన్నిబట్టి త్రిగుణాత్మకమైనదె. ఏకాగ్రచిత్తులై ఫలాపేక్ష లేకుండా శ్రద్ధతో అనుష్ఠించినట్లయితె అది సాత్వికమె. అలాగాక ఆచేయడం వల్ల సత్కారం గౌరవం పూజలను పొందాలెననిగాని దంభంతోగాని తపస్సు చేసినట్లయితె అది రాజసమనబడుతుంది. కొందరు మూర్ఖమైన పట్టుదలతో తమకే పీడ కలిగించు కొంటూ చేస్తారు. లేదా ఇతరుల వినాశం కొరకు చేస్తారు. వీళ్ళు పరమ తామసికులు వారి తపస్సు ...సిక తపస్సు.

20-22. అలాగె దానం విషయం. ఏ ప్రదేశంలో ఏకాలంలో ఎవరికి ఇవ్వవలసిన అవసరం ఉంటుందో వారికి ఆ ప్రదేశంలో ఆ కాలంలో ఇవ్వడం సవ్యమైనదానం అనిపించుకొంటుంది. ఇప్పుడు ఫలానివారికి అత్యవసరమై యుండగా స్నానంచేసి సంధ్యవార్చుకొని తీరికగా వస్తాను కూర్చోమని అనడంకాదు. లేదా ఫలాని తీర్థం దగ్గర కు రా-అప్పుడిస్తాను.సద్బ్రాహ్మణుడెవరైనా వస్తే అప్పుడిస్తాను అన టం కాదని ధ్వని. ఫలితంలో తేడాలనుబట్టి చేసేదానం సాత్వికమైన దెలా అవుతుంది గనక!

అలా అన్నామని,ఒక త్రాగుబోతు రాంగానే వానికి ఇచ్చివేయ మని కాదు ఆదేశం, అతడది తీసికొనిపోయి త్రాగేస్తాడు. మరికా స్తచెడి ఇంకా చెడు దోవలుపట్టగలడు.మరి ఇది ఎలా తీర్మానం చేయడం అనే దానికి శ్రీ కృష్ణుడు చెప్తున్నాడు. ఒక గుర్తు చెప్తున్నాడు.ఆ సమయాన "ఇతడికి ఇప్పుడే ఇది ఇవ్వక తప్పనట్టిది" అనే పరిస్థితిలో ఇచ్చిన దానం సాత్వికమైనదానం. ఆ దానం విషయంలో ప్రత్యుపకారం ఆశించకపోవటం కూడ ముఖ్యమె ఈ పావలా దానం చెయ్యాలని బడ్జెటులో పెట్టుకొన్నాంగనక దానిని వీధి జోలెలో పడేద్దాం అనేది యథాతథంగా సాత్వికదానం కాదు. వాడికా పావలా వెంటనే ఉపయో గించాలి అని చేసేదానం సాత్వికం.

ప్రత్యుపకారం పొందు దామనిఇతరులకు చేసినదానం రాజసికం అవుతుంది, ఇస్తూ ఎంతో బాధపడటం కద్దు, ఇదీ రాజసికమైనదె,

ఒకప్పుడు దేశకాలాలను గమనించకుండా దానం చేయటం కద్దు.అప్పుడు అక్కరలేని వారికి దానం చేయడం జరుగుతుంది, పైగా సన్మాన పూర్వకంగా కాక, తిరస్కారయుతంగా దానం ఒసగ బడు తుంది. తిట్టి తిట్టి ఒక పైసా వేస్తారు ముఖాన ఇది తామసికమైన దానం,

23. ఇలా, ఆహారం, యజ్ఞం, దానం, తపం అనే కర్మలు చేయటంలోగల అంతరంగ భావస్థితినిబట్టి ఆ కర్మలు సాత్విక, రాజసిక తామసికములుగా విభజించాల్సి ఉంటుంది. అంతేగాక నీచుట్టూ నీవు చూసే, ఉత్తములని పిలవబడుతున్న వారి యజ్ఞదాన తపః కర్మలన్నీ వట్టి పనికి రానివి అనిగాని గొప్పవి అని గాని అనటానికి వీలు లేదు. తామసికమే ననడం సబబూకాదు. అవి చేసే వారి అంతరంగ విషయం ఎఱిగిన వాఱికి తప్ప, వాటిని (కర్మలను) గురించి వ్యాఖ్యానం చేయడానికి ఎవరికీ అవకాశం లేదు.

కాని శాస్త్రాల్లో యజ్ఞ దాన తపః కర్మలు ఎన్నో చెప్పినప్పుడల్లా ఓం, తత్, సత్ అనే పదాలు చెప్పబడే ఉన్నాయి. ఆ శబ్దాలలో అనంతమైన అర్థం ఇమిడి ఉన్నది. అది తెలిసికొనడమె నే చెప్పిన పంథాను అనుసరించడమన్నమాట. అందుకే శాస్త్రాలను ప్రమాణంగా పురోగమించాల్సిన అవసరం ప్రజలకు సాధనగా చెప్తున్నాను.

సృష్టి ఆరంభంలోనె బ్రహ్మ వేదాలను యజ్ఞాలను సృష్టించడంతో ఊరుకొనక, బ్రహ్మపదార్థ తత్త్వవేత్తలను కూడ తయారు చేశాడు. ఈ వేదాలు, యజ్ఞాలు బ్రాహ్మణులు (అంటే ఆ తత్త్వవేత్తలు) తమ తమ పవిత్రత పావనత్వములకు గాను ఈ ఓం, తత్ సత్ అనే శబ్దాలపైననె ఆధారపడి ఉన్నారు.

24. ఆ శబ్దాల్లో 'ఓం' అనేది సమస్త సృష్టినీ సూచిస్తుంది, ఈ శబ్దంతోనె యజ్ఞదాన తపః క్రియలన్నీ అరంభించాలి. బ్రతుకులో ఏ కర్మ చేసినా అది యజ్ఞకర్మగా చేయాలనె చెప్పాను. ఈ ప్రపంచంలో బ్రతుకు అనే యజ్ఞ కర్మ ఆ 'తత్' అయిన వానికోసం జరుగుతోందనె దృష్టి రావడం ముఖ్యం. కేవలం "ఓం" అని అరవడం కాదు ఇక్కడి అవసరం!

25. 'తత్' అనేది మోక్షకాముల మనసులో ఉండాల్సినది. ఓం ను స్మరించేవారు ఈ తత్ దృష్టిని పొందాలనేది పరమమైన విషయం. మీరు చేసే యజ్ఞ ఫలం ఆ తత్ నకేను అనే మనఃస్థితిఉండాలి.

తమకు ఫలం ఆశించనిస్థితి అది. నేను ఈ కర్మ చేస్తున్నాను. ఫలం వస్తుంది. అనుకొనేటంతవరకూ ఆఫలం ఆ తనదే అనుకొను చుంటున్నాడు భగవానుడు. ఓం తలచి నేనూ,ఆతత్, ఆఫలంఅంతా ఓం మాత్రమేననేది అనుసంధానం చేస్తూనే కర్మచేయాలి.అది సత్ కర్మ అని చెప్పబోతున్నారు.

26. ఓం అనుస్మరణంచేస్తూ,ఫలాసక్తిలేక ఉన్నా అది'తత్' దేనని ఎఱిగి కర్మలు చేస్తే అది ఆ అంతర్దృష్టి కారణంగా సత్కర్మ అవుతుంది. అది ఇతరులకు అవుపడినప్పుడు''సత్ కర్మ" అని వారంటారు. ఎందుకంటె అది వారిపై సత్ప్రభావాన్ని కలిగింప జేస్తుంటుందిగనక. ఇలా ప్రవర్తితమైన యీ జగచ్చక్రం ఒకానొక సత్తావల్ల–ధర్మంవల్ల–ఎల్లప్పుడూ ప్రచోదయింపబడుతున్న దనేభావమే సత్.

అంతే కాదు. సాధుభావం ఎక్కడ ప్రకటిత మవుతుందో అది సత్. సాధు భావమంటే 'తత్' పదార్థ చింతన మన్నమాట. ఇదిగ శుభ కర్మల విషయంలో కూడ యీ సత్ అనే పదం ఉపయోగింపబడుతున్నది. శుభకర్మ లంటే భగవత్ప్రీత్యర్థమై. యీ ప్రపంచమునకంతకూ శుభాన్నియిచ్చే నిష్కామ కర్మలన్నీ [illegible] సత్ అని అనటానికి అవకా[illegible] [illegible] ఈ మూడు పదాలూ చెప్పేది ఒకటే అయినా, మూడు [illegible] వివరణ అవి. వివిధ కర్మలలో ఉండ వలసిన [illegible].

27. యజ్ఞమందు [illegible] [illegible] యందుగల నిష్ఠ,–నిర్వహణ–సత్. అలా తెలియాలనే శాస్త్రంలో [illegible] పదాలుపయోగించారు యజ్ఞ దాన తపః కర్మలకు చెందిన అంతరంగ శుద్ధి సత్ అన్నమాట. ఈ యజ్ఞాలు తత్ అనే ఆ భగవంతునికి అర్పిస్తూ చేస్తుంటే అవి సత్ కర్మలవుతవి.ఈ పనులిలా ప్రపంచంలో జరుగుతూ ఉండటం శాస్త్రాల మూలానవె.సత్ కర్మల వల్లనే–ఈ ప్రపంచం సత్ అయినదై శాశ్వతమయినదై నిలుస్తున్నది అనేది ఇంద్రియాతీతమైన భావం.మరి దుష్క–

ర్మలు ఎక్కువగా యీ ప్రపంచంలో జరుగుతున్నట్లు అవుపడుతున్నది కదా అనిపిస్తుంది. కాని మన ప్రమాణాన్ని బట్టి ఒకానొకకర్మ దుష్కార్మ?సత్కార్మ?అని చెప్పటం—మనసంస్కారం మీద ఆధారపడి చెపవటం మామూలుగా జరిగేపని. శాస్త్రపరమైన సత్ కార్యాలు నడుస్తున్నవై వాటి ఫలితమె ఈ ప్రపంచం అనేదినిజం అనిపిస్తుంది కూడ.

28. ఐతె ప్రజల బ్రతుకంతా (ప్రపంచం) సత్ అయినట్లయితె ఇక అసత్ ఏమిటి? అని సందేహం రావచ్చు. బ్రతుకు అనేది క్రింది స్థాయి కావటంవల్ల తత్ పదార్థరతి లేని దృష్టితో నడిపే బ్రతుకు మాత్రం సత్ కాదు అనాలి. అంతరదృష్టితోనడిచిన బ్రతుకు సత్. ఇంతకూ శ్రద్ధగా తత్ పదార్థముకొరకు శాస్త్రరీత్యా బ్రతకడం లేదా పనులు చేయటం అనేదే ముఖ్యం.

శ్రద్ధగా చేయబడక, అంటే తత్ పదార్థము కొరకుగాక స్వార్థం కొరకు మాత్రమే చేయబడే పనుల వల్ల—లేదా బ్రతుకువల్ల—ప్రయోజనములేదు. అది 'అసత్' అవుతుంది. అవి ఇహంలోకూడ ఏఫలితాన్నీ ఈయవు అంటున్నాడు పరమాత్మ. అంటే అర్థం మోక్షంకొరకు దారిచూపగలిగే యోగ్యతవాటికి లేదని ధ్వని.

ఇదేమిటి ఇహంలో కూడ ప్రయోజనంలేదంటాడేమిటి అని శంక—మనంచేసే స్వార్థపుపనుల ప్రయోజనం కేవలం ఆ పనివల్ల కలుగుతున్న ధనానికి ఎలా పేలు! ఇంట్లో పాలుకావాలని అనుకొంటాం. దానిపాలు, స్వార్థకార్యం చేసినందువల్ల కలిగిన ఫలితం అనద్దా? కాని దానిని ఇతరులకి పంచిపెట్టడమనేపనివల్ల కలిగిన ఫలితం అనడం సబబేమో అనిపిస్తుంది. కర్మచేసే వాని మేలు కంటె ఇతరుడు—పరుడి మేలు కోసం ఉపయోగపడిన డబ్బువల్ల—ఇది సత్ కార్యం—దీని వల్ల ఫలితం ఇహంలోనైనా దక్కుతుంది అనటం మెరుగు అనిపిస్తుంది. ఈ దృష్ట్యా అసత్ కర్మలు,—అశ్రద్ధతో చేసిన కర్మలు సరేసరి—ఇహంలో కూడ ఏఫలితాన్నీ ఈయవనటం అందుకే.

కనక, ఓం తత్ సత్‌లో ఓం అనేది బ్రహ్మపదార్థ తత్త్వమును సూచిస్తున్నదనుకొంటే ఆ సర్వంలోను కూడ తత్ ఒక్కటే సత్ అన బడుతున్నది. అనగా బ్రహ్మపదార్థమే బ్రహ్మమనే 'తత్' అని తెలిసి తాను అందులో ఒకడై ప్రవర్తిస్తె అదె సత్. అంటె భగవత్పరమైన మనః స్థితి ఒకటె సత్. ఎక్కడ ఆ తత్ మనఃస్థితిలేదో అది అసత్ అని దృష్టిలో నుంచుకొనుమని బోధ. బ్రతుకునంతా పరమార్థ తత్త్వంతో బ్రతికి అనుభవించుమని బోధ.

ఇది పదునేడవ అధ్యాయము



# శ్రీ మ ద్భ గ వ ద్గీ తా మ న న ము

## పద్దెనిమిదవ అధ్యాయము

## మోక్ష సన్న్యాస యోగము



ఎఱుక (జ్ఞాన భక్తి) కలిగి మననమే నిధిధ్యాసనామార్గము

పద్నాలుగో అధ్యాయంలో "ఈ ప్రపంచం త్రిగుణాలతో సతమత మవుతూ ఇలా ప్రచలితం అవుతున్న" దని చెప్పారు. ఈ మూడు గుణాలూ సరిసమానంగా ఉంటే, సముద్రమధ్యమంలో నీరులా గంభీరంగా ఉండి పరాత్పరుని లక్షణమై అవుతుంటవి. అప్పుడవి సత్ చిదానందాలు అంటాము. అలా సరిసమానం గాక—హెచ్చు తగ్గులు వాటిలో కలిగి ఉంటె, అదె ఈ ప్రపంచంలోని—జీవునిలోని ప్రకృతి అనబడుతుంటవి.

తత్ పదార్థాన్ని అవగాహన చేసికొని తనలోని సత్త్వరజస్తమో గుణాలను మాటిసీ నియంత్రించి సమంచేసికొని పరాత్పరుని స్థితిని వడసి నట్లయితే అది ఉత్కృష్టస్థాయి. ఆ తరువాత త్రిగుణాల సమ

న్వయ స్థితి పొందిన జీవుడు బ్రతుకుతూ ఉంటాడు గదా. ఆ బ్రతుకు నెలా నడపటం అనేది శంకగా కలుగుతుంది. కామ సంకల్ప సమారంభాలైన కర్మల్ని వదలి, కర్తవ్య కర్మల్ని చేస్తూ వాటి ఫలాలను త్యాగం చేస్తూ ఉంటూ బ్రతకాలి అనే ప్రవర్తనాత్మకమైన సంగతిని ఈ అధ్యాయంలో స్థిరంచేసి చెప్పబోతారు.

అధ్యాయం మొదట్లో అర్జునుడు మళ్ళీ సన్యాసమేమిటి త్యాగమేమిటి అని శ్రీకృష్ణుని చెప్పమంటాడు మందగొండి విద్యార్థిలా. మందగొండులం మనం, కనుక మనకోసం మళ్ళీ అడిగి నాడంటం మాట కద్దు. కాని ఈ సందేహం మందగొండి సందేహ మేం కాదు. పరిపూర్ణజ్ఞానాన్ని ఎరుక కలిగిన తరువాత ప్రపంచంలో బ్రతుకు ఎలా నడుస్తుందో తెలియటం అత్యవసరం కదా!

అర్జునుడు మొదటి అధ్యాయంలో నావాళ్ళనెలా చంపనూ? అనీ, చంపటం అనేది పాపం కాదా అనీ అడిగినాడు భగవానుని. 'నా' 'నీ' అనేవి పెట్టుకొని సమాజానికి వ్యతిరేకంగా చేయటం వల్ల ఆ వ్యక్తి శిక్షింపబడటం తప్ప మరో ఫలితం లేదనీ, పాపం రాకుండా కూడ, 'చంపటం [illegible] పనులు కర్తవ్యంగా చేయవలసి వచ్చినప్పుడు సక్తిలేకుండా వాటిని చేయడం వల్ల పాపం అంటదనీ చెప్పి, సందేహాలు పరమాత్మ తీర్చినాడు. ఐతే కర్తవ్య కర్మలేమిటి అన్నప్పుడు శాస్త్రం ప్రమాణంగా తీసికొని దానిని తాను చెప్పిన తత్త్వరీత్యా అనుసరించటమే కర్తవ్యమన్నాడు. ఐతే ఫలత్యాగమనేదేమిటి అని ప్రశ్న ఉంది. కర్మ చేస్తున్నప్పుడు ఫలం కార్యకారణ సంబంధ రీత్యా కలుగుతుంది. దానిమీద బుద్ధి పెట్టుకొని పనులుచేయవద్దనీ, వచ్చే ఫలం అనుభవిస్తున్నది నీలోని భగవంతుడనీ చెప్పారు.

అలాటప్పుడు పనిచేసేది మాత్రం ఎవరు? అతడే. అందుకే కర్తృత్వం కూడ వదలి మరీ కర్మచేయవలసిందనేది నాల్గవ అధ్యాయంలోనే చెప్పారు. 'అకర్మణిచ కర్మయః' అని నేను చేయటల్లేదు

ఏ కర్మగాని. ఈ పరికరాలైన అవయవాలు చేస్తున్నాయి, దీని ఫలం అంతస్థుడైన పరమాత్మ అనుభవిస్తాడు. నాదేమీలేదు. నేను ప్రత్యేకంగా ఎక్కడా లేను. నేను చేయను. నేను అనుభవించను: అనే తత్త్వంతో కర్తృత్వాన్ని కూడ వదలి ఉండుమన్నారు.

అ, ఉ, మ, ం-ల స్థాయిలలో, ప్రపంచం, మానసికం (తైజసం), బౌద్ధికం (ప్రాజ్ఞ) చివరకు పరాత్పరమనే స్థితులు అన్నీ ఒక్కని వె-అవి నీవె-అహంకారం లేనినీవే-అయిన వైయున్న సంగతి నెఱిగిన మీదట కూడ బ్రతుకుతుండటం తప్పనిసరి. అది ఏలాజరపాలి అని అర్జునుడు ఆలోచించి, సన్న్యాసం, త్యాగంతో నడపాలనె నిర్ణయం తెలిసి.వాటిని స్పష్టపరచుకోడానికి ఈ ప్రశ్ననడిగాడనేది మర్చిపోరాదు.

భగవంతుడు ఎప్పుడో సూచించాడు "నీకొఱకుకాదు బ్రతుకు; భగవంతునికొఱకే బ్రతుకు" అని. మత్పరాయణః అని భగవంతుడె ఇతరులనబడెవారు కూడాను అనె భావంతో ఇతరుల కొఱకు బ్రతకాలి యుద్ధం చెయ్యాలి. అది కర్తవ్యం అయినట్లయితె అది చేయడానికి అర్జునుడికే ఏఅభ్యంతరం లేవదీయడు, ఆతడిప్పుడు జ్ఞాన భక్తుడై ఉన్నాడు.

అసక్తత, సన్న్యాసం, త్యాగం, కర్తృత్వ రాహిత్యం ఈ మాటలు తాను చిన్నప్పటి నుంచీ ఎన్నో సార్లు విన్నాడు. కాని అవేవో చిన్న చిట్టి గడ్డిపూవుల్లా మాత్రం తన అంతరంగంలో ఏమూలనో పడి ఉన్నాయి. ఇప్పుడవి ఉద్యాన వనంలో బంతిపూల్లా వికసించినట్లుంది అర్జునునికి. ఇప్పటికి తనకు కనువిప్పయి నట్లుంది. అవేస్థిరపడి జీవితానికి ఆధారం కావాలి. నిధిధ్యాసనా సాధనకుగాను వాటిని మళ్ళీ వినాలని అందుకె అర్జునుడు శ్రీకృష్ణుని ఆవిషయాలు చెప్పుమని అడిగినాడు, చెప్పినసంగతులనె సింహావలోకనం చేయాల్సిందని కోరినాదన్న మాట,

2. శ్రీ కృష్ణుడు చెప్పుతున్నాడు. అర్జునా! పండితులు, కామ్య కర్మలను వదలివేయటమె సన్న్యాసమంటారు. త్యాగమంటె కర్తవ్య కర్మలను చేస్తూనె ఫలంత్యాగం చేయటం అని అర్థం. ఈ త్యాగం చేసేది బుద్ధిలో. చేసిన కర్మకు ఫలితం రాకపోదు, అది తనలోని పరమాత్మ అనుభవింపకనూపోదు. మరి, యిక త్యాగమేమిటి అంటె ఆ ఫలం మీద ఆశతో ఆపని చేయకుమనె. గాలి పీల్చటమనేకర్మ ఎలా కోరిక సక్తితో చేయమో అలాగే కర్తవ్యకర్మ లన్నిటిని చేయాలనిబోధ.

కర్తవ్య కర్మంటే ఏమిటి? ఆయా పరిస్థితుల్లో చేయవలసియున్న పనేదో అది. ఈ దృష్టిరావాలి. దాని ఫలం కోసం కాంక్షతో చేయటల్లేదన్నమాట. కర్మం వల్ల తప్పించుకుపోవటం మాత్రం కాదు. ఒక కర్మకు ఏమి ఫలం రావచ్చు ననేది బుద్ధి చేసేపని. అది కర్తవ్యమవునా కాదా అని నిర్ణయించేది బుద్ధి. ఆ బుద్ధిచేసే నిర్ణయం తత్త్వశాస్త్రోక్తమై యుండాలిగాక. అది అలా కర్తవ్యమైనపుడు ఆపని చేయక తప్పదు. ఆ చేసేది ఫలం కోసం అనుకొని చేయద్దు. కర్తవ్యం కనక చేస్తున్నానని చేయాలి.

అలా స్వార్థ కర్మలను-కాదు కర్తవ్యంకాని కర్మలను-వదలివేయటం కర్మ ఫలత్యాగాన్ని మనసులో నిశ్చితం చేయడం, కర్తృత్వమే భగవంతునిదనె జ్ఞానం కలిగి నిరంతరం ఉండటమె బ్రతుకు సాధన. ఓగంట నిద్రపోయిలేచి నేను పనులు సన్న్యసించానంటె అది సాధన కాదు.

3-5. కొందరు కర్మలన్నీ త్యజించాల్సినవేను అంటారు. అందులోనె కొందరు యజ్ఞదానతపః కర్మలు తప్ప-అన్నీత్యజించాలి అంటారు, నేనూ యజ్ఞదానతపః కర్మల్ని వదలరాదనె అభిప్రాయపడుతున్నాను సాధకుని స్థితిలో. ఎందుకంటె అవి చిత్తశుద్ధిని కలిగించుతవిగదా! గుణ స్వభావమైన ఈ దేహానికి గాను ఆశించి పనులు చేయక, అంతర్దృష్టి కలిగి పరమాత్మకుగాను బ్రతకటం చిత్త శుద్ధి

కలిగి బ్రతకటం. చిత్తశుద్ధే వద్దంటె ఇక సాధనేలేదు. చిత్తశుద్ధిలేని వాడు పతితుడై పోతాడు భగవద్గీత చదివేపనేలేదు, జంతువుకు సహచరిగా బ్రతకవచ్చు. మోక్షం పొందటం జీవికి కర్తవ్యం గనుక,చిత్తశుద్ధికి ప్రయత్నంచేయటమూ కర్తవ్యమే. అందుచేత యజ్ఞదాన తపః కర్మలు కర్తవ్యాలు.

6. ఈ యజ్ఞదాన తపః కర్మలు చేయటంలో ఫలమందలి సంగాన్ని వదలివేసి కర్తవ్య కర్మలు గనక వీటిని చేయక తప్పదని చేస్తూ ఉండటమె ముఖ్యము—మానవునకు—అని నాఅభిప్రాయం. చిత్తశుద్ధి అందరికీ కావలసిందె. "కావలసింది" అన్నాము కదా అని, అది కామ్యకర్మ అనుకోవద్దు. భగవంతుడయిన నా ప్రీత్యర్థం—అంతా చిత్తశుద్ధి కలిగినస్తుచేయాలి. ఇది భగవంతుడయిననా ఆదేశం. చిత్తశుద్ధి అంటే నేను కోరి కామ్యం ప్రదర్శించను గదా అనటం సరికాదు. చిత్తశుద్ధి కోరదగింది గనక ఈ యజ్ఞదాన తపః కర్మలు నీ కర్తవ్యాలయినవి అనిపోయి. కర్తవ్యాలే గనక చేయుటతప్పదనిష్ఠాని.ఇది నా గీతాలో చెప్తే నీకు తెలియని చిక్కు ప్రశ్న ఏమీకాదు, ఆలోచించుకోతె అర్థం కాలేదని అనాల్సినపనిలేదు. అందుకనె శాస్త్రయుక్తమైనయజ్ఞదానతపః కర్మలు చేసితీరాల్సినవి అనటం.

7–8. త్యాగం—వస్తుతః ఫలత్యాగమె అయినా ఫలమే అక్కరలేదన్నట్లయితె ఏ కర్మకూడ కర్తవ్య కర్మేకాదు, వద్దు అనే పరిస్థితి రావచ్చు.చిత్తశుద్ధి అనేది కూడ ఫలమె గనక దాన్ని వద్దంటె ఇక ఏ కర్మ కర్తవ్యమవుతుంది? ఆ కర్మ కూడ చేయవలసినపనుల్లోనుంచి తొలగించివేయబడటం అవుతుంది. అలాటి త్యాగంతోసహా—త్యాగం మూడురకాలు.చేయవలసిన కర్మచేయకపోవటం వల్ల బ్రతుకుదుర్భరమవుతుంది.ఐనాసరె కర్మత్యాగిస్తాడొక మానవుడు. ఎందువల్ల? మోహవశంచేతకావచ్చు. అంతపని చేయటం కష్టమై మానివేయవచ్చు. దీనివల్ల త్యాగమయితె జరిగిందిగాని దానివల్ల ఫలంయేమీ సంక్రమించదు.

కర్మేలేదు కదా. చిత్తశుద్ధి అయినా అవదు. కర్తవ్యమా కాదా అని తెలియకనే మానివేసినాడు గదా! ఇది ఒక రకం. ఇది చీకటిలో తిరగటం వంటిది. తామసత్యాగం. ఇక శరీరం కష్టం కలుగుతుంది అని పనిమానివేయటం కద్దు. అది రాజసికత్యాగం. దీనివల్ల దుఃఖమేరావటం కద్దు. ఎందుకని? శరీరసుఖంకోరి పనివదలటమయింది. ఈ చేతకు ఫలితం లేనందున కలిగేడి ఫలం దుఃఖమేకదా. ఇది రాజసిక త్యాగం.

9-10. మూడవది సాత్త్వికమైన త్యాగం. ఇందులో కర్మచేయడమనేది జరిగితీరుతుంది. పైగా అది కర్తవ్య కర్మె అయియుండటం ప్రాథమిక నియమం. ఇక లేనిదేమిటి? అపని కర్తవ్యంకనక చేయడమె కాని, ఫలంమీద ఆసక్తితో కాకపోవడమె ప్రధానం. ఐతె కార్యంపూర్తి అయినపుడు కార్యకారణ సంబంధ సూత్రంవల్ల భౌతిక ఫలితం రానే వస్తుంది, ఇక త్యాగం చేయబడిందేమిటి అంటె. దాని పట్లగల "ఆసక్తి" ఒకటే త్యాగంచేయబడింవనేది గమనీయం. పుణ్య ఫలమూ పాప ఫలమూ మాత్రంరావు. వచ్చిన భౌతిక ఫలితం తక్కువని కుంచడం గాని ఎక్కువని ఉలకడంకాని ఉండదు. వచ్చింది అనుభవిస్తాడుగాక. ఈస్థితి పరాకాష్టకుచేరితె అది మహత్తరమైన మనఃస్థితి అదేచిత్తశుద్ధి. ఈ స్థితిని పొందడానికె వాంఛాగం భగవద్గీతలో ఈయబడిన సందేశం. తత్త్వ శాస్త్రానికిది మూలం. పునాది పట్టం. ఈ స్థితినాశించే భగవద్గీత చదవటం. కాదెవద్దంటె పుస్తకం ఈమంత్రాలు విసిరివేయవచ్చు.

11. కర్మలను అన్నిటినీ త్యాగం చేయటం జీవునకు చేతకాని పని. సర్వకర్మ ఫలత్యాగం చేయటమె అసలైనత్యాగం. కాషాయ వస్త్రం కట్టినవాడల్లా త్యాగి అనీ, సన్న్యాసిఅనీఅనుకోవటం కంటె 'సాధకుడు' అనుకొవటం వల్ల, "నిజానికి" దగ్గరగావుండగలం.

12. త్యాగికీ మామూలు వ్యక్తికీ కూడ కర్మఫలం అనుభవించడం కలుగుతూనె ఉన్నప్పుడు వీరిద్దరికీతేడా ఏమిటి? కర్మకు భౌతిక ఫలం ఎలా వస్తుందో అలాగే దాంతోపాటుగా పాప పుణ్యఫలాలుకూడ

వస్తువి. అవి త్యాగికి వుండవు. ఇతరవ్యక్తికి ఉంటవి. ఒకడు మరొకని వస్తువును జేబులోవేసికొంటాడు, ఇది కర్మ. దీనికి పుణ్యాపాపాలు కూడ ఉంటవి-భౌతిక ఫలంతోపాటు త్యాగి ఈపనిచేస్తే ఏమవుతుంది అని ప్రశ్న. మొదట-త్యాగి ఆపని తన కర్తవ్య మనుకున్నప్పుడే చేసి ఉంటాడు. కర్తవ్యంఎలా అవుతుందంటే-ఒకడు పర్సు పారేసుకు పోయినాడు-దానిని తాను జాగ్రతచేసి వానికి చేర్చటం తన కర్తవ్యం అయి ఉంటుంది. అప్పుడు దానిని తాను తీసికొని భద్రపరచినమాత్రం చేత పాపం అంటదు, కర్తవ్యం మాత్రమే చేశాడుగనక పుణ్యమూ అంటక పోవచ్చు. ఈకర్మనే ఇతని వ్యక్తి చేస్తే దానికి అనుబంధంగా పుణ్యమో పాపమో అతడికి తగుల్కొంటూ ఉంటుందని అర్థము. సూక్ష్మంగా ఆలోచిస్తె ఇది మానవులయిన మనకు తెలియని విషయమేమీ కాదు.

పర్యవసానమయినదేమంటే "నేను" అనేవాడు ఎటుటగా వచ్చిన ఫలాన్ని అనుభవిస్తున్నాడు. ఈ నేను ప్రక్కనె నిలచిన మనోబుద్ధులు ఆశను, ఆసక్తిని ఈ పాపపుణ్యాల రంగులు "నేను" కు కూడ అంటు కొన్నట్లుంటవి. తన వస్త్రాలయిన మనోబుద్ధులు రంగులను ఈ "నేను" ఇలా తప్పనిసరిగా అనుభవిస్తూ ఉంటుంది. ఇది గమనీయం!

సక్తివల్ల పాపపుణ్యాలు కలుగుతవి. సక్తిలేకుండా ఉండటమే సాధన. సక్తివల్లచేసినపని యొక్క పర్యవసానం ఒకప్పుడు అనిష్టంగా, ఇంకొకప్పుడు ఇష్టంగా, మరొకప్పుడు మిశ్రమంగాను ఉంటుంది. ఈ తేడా త్యాగికి కన్పడదు.

ఇక కర్మ ఎలా చేయబడుతోంది అనే విషయం శ్రీ కృష్ణుడు విమర్శచేసి, అది యంత్రాత్మకమైంది అంటున్నాడు. ఇందెందుకు చెప్తున్నాడంటె కర్తృత్వాన్ని బుద్ధిద్వారాతీసికొనిపోయి ఈ "నేను" మీద పడవేయకుండా ఉండేందుకు చెప్తున్నాడు ముందు శ్లోకాల్లో. కర్తృ

త్వంకూడ త్యాగం చేయాలనటం 4వ అధ్యాయంలో చెప్పిన సాధన. "కర్మణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మయః," అని.

13–16. సాంఖ్య సిద్ధాంతంలో ప్రతీ విషయం ఫగలగొట్టి విడి విడిగా పరిశీలించటం ఉంది. 'నేను' వేరు 'బుద్ధి' వేరు మనసువేరు శరీరంవేరు, ప్రపంచం వేరు, విశ్వంవేరు, భగవంతుడువేరు అని విడగొట్టి రెండవ అధ్యాయంలో చెప్పినది కూడ సాంఖ్య సిద్ధాంతపరమె. ఈ ప్రత్యంగాలకు సంబంధించిన విశేష విషయాలు లక్షణాలు తెలిసికోడానికి సాధనలో భాగంగా అలాచెప్పారు. ఒకడె ఒకప్పుడు ప్రభువు ఇంకొకప్పుడు భర్త మరొకసారి తండ్రిగా చెప్పబడటంఎలాగో ఇదీఅలాగె. ఇప్పుడు కూడ కర్మను చేయడంలోగల కర్తృత్వం మానవుడు తన బుద్ధిలోనుంచీ వదిలించుకోవడానికి గాను, సాధనగా శ్రీ కృష్ణుడు ఈ కర్మచేయడం అనేదానిని పంచధా–విడగొట్టి చెప్తున్నాడు.

ఒక పని అవుతున్నదిఅన్నప్పుడు అందుకు కారణాలు కేవలంగా ఏఒక్కడూ కాదు. ఐదున్నాయి (1) అధిష్టానం అంటె ఇంద్రియాలు, మనసూ బుద్ధి అంతాను. (2) కర్త–అంటె అహంకారము–అంటె బుద్ధి, ఇంద్రియాలతో ఏకమయి 'నేను అంటున్నప్పుడు అది అహంకారము, అధిష్టానమన్నారుకదా అనద్దు అది ఆశయభాగం మాత్రమె. ఇది కర్త భాగం (3) కరణములు–జడమయిన వస్తుసంచయం, కలం కాగితం, పూవులు ఇలా (4) ప్రాణము లెదు. చైతన్యభాగమిది. (5) అన్నిటినీ మించి భగవంతుడు–అంటె మీట నొక్కేవాడు, వ్యక్తిచే శరీరంద్వారా గాని వాక్కుచేగాని మనసుతోగాని చేయబడే ప్రతీపనీ–అది న్యాయం కావచ్చు విపరీతంకావచ్చుగాక–ఈ అయిదు కారణాల వల్ల జరుగుతున్నది. ఇలా ఐదుగురిచేత పూర్తి అవుతున్నపనిని అహంకారరూపంలో ఉండి "నేనే" చేశాననటం తెలివిమాలినతనంగాదా! కనుక ఇది తెలిసి అలా అనుకొనడం మానివేసే సాధన చేయుమని

బోధ.కర్తృత్వం నీమీద వేసికోకుండా ఉండవలసింది. భగవంతుడైన నేను చేసినపనె జరుగుతున్నప్పుడు కృతకృత్యుడవై నిమిత్తమాత్రుడవై ఊరుకోవటమె బ్రతుకంటె.

17. కర్మ కర్తృత్వం తనమీదనే వేసికొనక,ఫలం ఆసించక కర్తవ్యకర్మలనుచేసే సాధకుడు, ఆ కర్మవల్ల-జగత్తులోని ప్రాణులందరూ లేదా ఎవరైనా చావడం జరిగినా వారిని చంపినవాడేకాదు. డాక్టరు, కడుపులో పిల్లనుకోసి తల్లిని రక్షిస్తాడు. పిల్లనుచంపినపాపం ఉండదు.ధర్మపక్షాన యుద్ధంచేసి అనేకమందిని చంపుతాడు యోధుడు. ఆపాపం అతడికుండదు. ఈ కర్తృత్వం నెత్తిన వేసికొనకుండా కర్తవ్యాన్ని చేయడమనే సాధనను సులభంచేయాలని పైన ఐదు విధాలైన కారణాల విషయంచెప్పి అలా చేస్తే పాపంలేదనిచెప్పుతున్నాడు భగవానుడు. అర్జునుడు ప్రథమాధ్యాయంలో వేసిన ప్రశ్నకిది సమాధానం.

18. ఈ శ్లోకం నుంచి 39 వ శ్లోకంవరకు త్రిగుణాలు అనేవి ఎలావివిధ విధాలుగా మానవునిలోని ఊహలను ప్రభావితం చేస్తుండటం మూలంగా వివిధాలైన ఫలాలను కలిగిస్తున్నవో, ఒకేపని ఒకరు చేస్తే ఒక ఫలం, ఇంకొకరుచేస్తే మరోఫలం రావడానికెలా దోహదమవుతున్నదో శ్రీ కృష్ణులు చెప్పారు. గుణాల చెయిద మెలాంటిదో తెలియజెప్పితె వాటికతీతంగా ఎలా ఉండాలో తెలియకలుగుతామని ధ్వని. ఫలానివానికి ఫలాని ఫలితంవచ్చింది; మరినాకీ ఫలితం రావటానికి కారణం భగవంతుడేను అని భగవంతుడ్ని తిట్టడం ఆరంభించే వారికి నిజమైన సమాధానం ఈ శ్లోకాలవల్ల తెలుస్తుందనిపిస్తుంది. ఆ ఫలం తమ తమ వివిధ వికారాల్లోగల త్రిగుణాల చిత్రనర్తనమని తెలుస్తుంది.

కర్మ ప్రేరణ, కర్మకు మొదటి మెట్టు. దానికి కావలసినవి మూడు,-జ్ఞానం-జ్ఞేయం-పరిజ్ఞాతా. ఫలాని పనిచేయడం అనేఎరుకను

జ్ఞానం అంటారు. విషయ జ్ఞానమన్నమాట. ఏది తెలియబడిందో అది జ్ఞేయం. దానిని తెలిసికొనేవాడు పరిజ్ఞాత. అలాగే కర్మజరగడానికి ఆశ్రయంగా, "ఇంద్రియాలు," "పని," "పనిచేసేవాడు" ముగ్గురుండాలి

19–22. ఈ జ్ఞానం, కర్మ, కర్తలలో ఒకొక్కటి మూడరకాలుగా వాటిగుణభేదాలచేత తయారవుతవి. జ్ఞానం ఉన్నది.విభక్తంగా ఉన్నయీ సర్వభూతాలూ అభిన్నభావంతో వెలసి అద్వితీయమూ అక్షయమూ అయిన ఆత్మవస్తువు ఒకే ఒకటి అని తెలిసేజ్ఞానం సాత్త్విక జ్ఞానం. ఇవన్నీ–భూతాలు–వేటికవేప్రత్యేకాలు–అని తెలిసేజ్ఞానం రాజసికజ్ఞానం. ఒకానొక శరీరంలో ఉన్నదే అంతాను అనుకొనేది,తామసిక జ్ఞానం. సత్త్వగుణంలో ఉండి ఇలా ఆలోచించు అని నేనుచెప్తానేగాని తామస రాజసాల్లో ఉన్నశ్రోతకు ఎలా ఆ మాటలు అర్థమై నిజమేననిపించేది? అడిగావుగనక చెప్తాను వింటూఉండు.

23–25. కర్మకూడ అలాగే, నియత కర్మచేస్తూ ఫలాసక్తిలేకుండా ఉంటూచేసిన కర్మ సాత్త్వికకర్మ. అహంకారపూర్వకమైఉండేది రాజసికము. మోహవశమై ఉండేదీ, శక్తిక్షయంతో కూడినదీ హింసాపూర్ణమైనవీ తామసికము. ఈ భేదాలు కేవలంలౌకిక కర్మలకేగాదు తాత్త్విక కర్మల విషయంలో కూడ అంతె.

26–28. అలాగే కర్త ఫలాసక్త రహితుడై ధైర్యోత్సాహయుక్తుడై లాభనష్టాలకు హర్షవిషాదాలులేనివాడై ఉంటే అతడు సాత్త్విక కర్త. రాగపూర్ణుడైనవాడు,కర్మఫలాకాంక్షలుబ్ధుడు అపవిత్రుడు అయిన కర్త రాజసికుడైన కర్త,ఇష్టం జరిగినప్పుడు సంతోషిస్తూ అయిష్టము జరిగినప్పుడు దుఃఖిస్తూ ఉంటాడు. ఇక తామసిక కర్త ఏకాగ్రతలేక మూర్ఖుడై, వినయంలేక,మాయావియై వంచకుడై ఉంటాడు.స్వార్థంతో వ్యాపారాలను పాడుచేస్తూ ఉంటాడు. ఉతరుల నవమానిస్తూ ఉత్సాహరహితుడై దుఃఖితుడై కాలయాపనచేస్తూ వుండేవాడు తామసిక కర్త. ఇంతేకాదు. ఈభేదాలకు ఇంకాలనోచిలవలూ పలసలూ ఉంటవి. నీకు

వినిపించడం నీవు సాత్త్వికుడవుకావాలనే నాభావంసుమా! ఆతరువాత నిర్గుణుడవు అవుదుగాని మోక్షకామనకూడ వదలి,

29_32, బుద్ధి_ధృతి_అనేవి కూడ ఈ కర్తలనుమలచడంలో ఎంతోపనిచేస్తవి. ఇవీ మూడురకాలవుతవి. ప్రవృత్తి మార్గమేదో నివృత్తిమార్గమేదోతెలిసి, కర్తవ్యమేదో తెలియగలిగే శక్తి ఉండీ, భయం అభయం బంధం మోక్షం ఇవన్నీ గ్రహించగలిగిన విచక్షణా శక్తి కలిగిన బుద్ధి సాత్త్వికబుద్ధి. అలాగాక ధర్మాధర్మాలు. కార్యాకార్యాలు నిర్ణయింపబడినట్లుగాగాక సందిగ్ధంగా అర్థంచేసికొనేబుద్ధి రాజసికమైనబుద్ధి. ఇక ధర్మాన్ని అధర్మంగానూ, అధర్మాన్ని ధర్మంగానూ గ్రహిస్తూ ఉండేది గ్రహించేది, తామసబుద్ధి అనబడుతుంది.

33_35, అలాగె ధృతి మనసు, ప్రాణాలు, ఇంద్రియాలు, క్రియలు వీటి నన్నిటినీ శాస్త్ర విధిననుసరించి నడిపించటానికీ తగిన పట్టుదల ఏదయితె వుందో అది సాత్త్విక ధృతి. ఫలం కోసమె పని చేయాలనే పట్టుదల ఉండటం రాజసధృతి. దుర్బుద్ధి, భయం, శోకం, మదం వీటితో కూడుకొన్నధృతి తామసికమైనది.

36_39. ఇక సుఖం. అదీమూడురకాలు. ఏ సుఖాన్ని పదేపదే ఆ నుభవించుతుంటే దుఃఖమనేది అసలే లేకుండా పోతుందో_మొదట కష్టదాయకంగా అగుపించినా పోనుపోను అమృతతుల్యం అవుతుందో అసుఖం సాత్త్వికసుఖం. అలాకాక ఇంద్రియ విషయాల్తో ఇంద్రియాలు తగులు కొన్నప్పుడు మొదట అమృతమా యిది అనేటట్లు కనిపించి చివరకు విషసమానమైపోయే సుఖం రాజససుఖం. మూడవది_ ఏ సుఖంవల్ల మొట్టమొదటనూ చివరనూ కూడ ఆత్మకు మోహము నావరింపజేసి నిద్రాలస్యప్రమాదాలను లేవదీస్తుంటుందో ఆసుఖం తామసమైన సుఖం. సుఖమంతా కూడ ఒకేరకం కాదని భావం.

40. ఇన్నిరకాలు ఒకదానితో ఒకటి కలిసి ఎన్నోవిధాలయి, కర్మ ఫలితాలను చిత్రవిచిత్రాతిచిత్రమహావిచిత్రాలుగా ఎలా విధ

జించివేయగలవో ఆలోచించు. ఈలాటి స్థితిలో నీలోని అహం నేను ఫలాని పనిచేస్తాను ఫలాని ఫలితాన్ని పొందుతాను అంటూ విషయమంతా తననెత్తినవేసికొని మోయటం-చివరకు వచ్చిన ఫలం వేరుగా అవుపించగా-అయ్యో ఇలా అయిందే అని ఏడ్వటం-ఎంతహాస్యాస్పదమయిన విషయం, ఇదంతా గుణాల చెయిదం కాదా!!

ఈ రకాలు పృథ్విలో సర్వత్ర ఉంటున్నవె, స్వర్గ మర్త్య పాతాళలోకాల్లో వీటిచే వదలిపెట్టబడిన ప్రాణి ఎక్కడాలేదు. ఈత్రిగుణాలే అన్ని ప్రాణులనూ నడిపిస్తున్నవి. ఇదంతానేనెందుకు చెప్తున్నానంటే త్రిగుణాలనుంచీ నీవు విడివడాలి. అతీతుడవుకావాలి. త్రిగుణాలను గమనించుతూ ఉండు, త్రిగుణాలకు నీవు భిన్నుడవని తెలుస్తుంది. చూడబడే వాడికి భిన్నంగా చూచేవాడుండటం నిజంగదా. అలా సాధన చేసి, త్రిగుణాలకు భిన్నుడవై వాటికి అతీతుడవుకావాలి. అందుకే ఈ విభేదాలన్నీ నీకు తెలియాలనటం. ఇది తెలిసి బుద్ధికి నచ్చినట్లయితె అహం అనేది మాత్రమె కర్మకు కారణము కాజాలదని తెలుస్తుంది. అది ఒకమెట్టు. సత్త్వప్రధానమై చరించటం సాధన,

ఈ త్రిగుణాల ప్రభావం తగ్గి సత్త్వప్రధానమై జీవితంనడుస్తుంటే అప్పుడు జీవుడు పరమేశ్వరునే అనుభూతి చేస్తూ ఉండటం జరుగుతుంది. మారని బుద్ధి నిలుస్తుంది. అహం అనేదిలేక పరమేశ్వరుడె ఉన్నాడు అని తెలుస్తుంది. అనుభూతి అవుతుంది. అప్పుడు గుణాతీతుడయినాడని అర్థం. శుద్ధసత్త్వ స్థితిఅది. దాన్నె నిర్గుణస్థితి అనచ్చుగాక.

41. కాని ప్రపంచంలో ఇలాటి త్రిగుణాతీతులు మనం చూద్దామంటే అవుపడటల్లేదు.అంతా త్రిగుణాత్మకులేననిపిస్తుంది.శ్రీకృష్ణుడు ఒక్కడున్నాడు త్రిగుణాతీతుడుగా ఇంకా కొందరుఋషులుండవచ్చు. ఈ పైచెప్పిన సాధన వల్ల తామసికంవదలి రాజసికంవృద్ధిచేసికొనటం, దానిసీ వదలి సాత్త్వికం వృద్ధిచేసికొనటం అప్పుడు వేదాంత

విచారణవల్ల పరమేశ్వరుడే తానన్నతత్త్వం తెలిసి గుణాతీతుడుకావటం చెప్పడమయింది.

ఇప్పుడీశ్లోకం మొదలు కొని 49వ శ్లోకం వరకూ ప్రపంచంలోని త్రిగుణాత్మకుల పరిశీలన గూర్చి చెప్తున్నాడు. గుణాతీతత్వమనె ఆదర్శాన్ని యీ ప్రపంచంలోని త్రిగుణాత్మకులు ఎలాపొందగలుగుతారనే దానికి సూచననిచ్చివదలుతాడు. త్రిగుణాత్మకులు ఎలామెట్టునెక్కాలనె సాధనలు చెప్పడమె శ్రీకృష్ణునిలక్ష్యం భగవద్గీతామంత్రాల్లో.

త్రిగుణాత్మకులు కూడ తమయందు వివిధమైన పాళ్ళలో ఈ సత్త్వరజస్తమో గుణాల మోతాదులను కలిగి ఉంటున్నారు, వీళ్ళ గుణగణాల దృష్ట్యానే వారిని బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రులు అనే నాలుగు రకాలుగా విభజన చేయడం అయిందని వెనక చెప్పాను. ఇది గుణ కర్మల వల్ల కలిగిన విభజనమేగాని పుట్టుక వల్ల కాదు.

కాని గుణాలను బట్టి ఇతడు బ్రాహ్మణుడని అతడు శూద్రుడని చెప్పటం సామాన్యమానవులకు-ముఖ్యంగా జనసంకరం గల పరిస్థితుల్లో-అసంభవమయింది, పరిపాలనలో వృత్తుల పోటీలేకుండా ఉండాలని మనువురాజుగా కులాలను పుట్టుక ఆధారంగా ఏర్పాటుచేసి వృత్తులను పంచి వారిలో కూడ అవైపేర్లే బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రులనే పేర్లను కూడ చేర్చేడు. ఈ పుట్టుక ఆధారంగా సంతానము తమ తలి దండ్రుల జాతిని,వంశపుపేరును, ఆవృత్తిని సంప్రదాయాన్ని వారినామ సంకీర్తనకుగాను పొందాలి అనే రాజశాసనం స్థిరంచేశాడు. ఆకులాలు పరిపాలనా సౌష్ఠవానికె ఆ రాజు చేసినాడు గాని,ఆధ్యాత్మిక విషయాలలో భగవానుడు చేసిన విభాగం గుణ కర్మలకి మాత్రమే ననేది మరువ వచ్చునని కాదు.

ఇప్పుడు చెప్తాను ఆ గుణ కర్మల విభాగం ఎలా ఉండాలిన వలసింది-బ్రాహ్మణ స్వభావమేదో, క్షత్రియ స్వభావమేదో, వైశ్య

స్వభావమేదో శూద్రస్వభావమేదో వారు ఏ ఏ కర్మలు చేయడానికి ఇష్టపడతారో చెప్తాను వినవలసింది—అంటున్నాడు కృష్ణుడు,

42-44. బ్రాహ్మణ స్వభావం కలవారెవ రవుతారంటె— అంతరింద్రియ నిగ్రహం, బహిరింద్రియ నిగ్రహం (అనగా శమ దమాలు) తపస్సు, శుచి, క్షమ, ఋజుత్వం, జ్ఞానందాని అనుభూతి, భగవంతునిపై విశ్వాసం—ఇవి కలిగినవారు అవుతారు. వశిష్ఠుడు జనక మహారాజు. శ్రీరాముడు, రామకృష్ణపరమహంస, ధర్మవ్యాధుడుఇలాటి వారిస్వభావమని అర్థం. క్షత్రియస్వభావం—శౌర్యం తేజం ధైర్యం కార్యదక్షత పలాయన మెరుగని యుద్ధనైపుణ్యం, దానం, శాసించే శక్తి—ఇవి ఖడ్గతిక్కన, శివాజీ, పన్నా, దుర్గాంబ వీళ్ళు వైశ్యస్వభావం —కృషి, గోరక్ష, వాణిజ్యం వీటియందు మన సుండటం, చారుదత్తుడూ తాతాకంపెనీవారు వారి వాణిజ్యస్వభావం. ఇలా ఇక శూద్ర స్వభావం సేవారూపమైనది. ప్రభుత్వోద్యోగులు అనచ్చు. ఇలా.

45-47. వీరు వీరికి సహజమైన కర్మలు చేస్తూనే తరించాలి. ఎందుకని అంటె—అది సులువు కనుక అని సమాధానం. కాదు. నేను ఇది వదలి మరొకటి చేస్తానంటే దానికి శాస్తి యేముంది? ఏమీలేదు గాక. నీకు పరమార్థస్థితిని పొందే సమయం నీకు కలిగే ఆ సులభ అవకాశం దూరంపోవటంతప్ప. నీబుద్ధి నీ మనసుకోరే ఫలాలకోసం నీవు బ్రతకటమె సరిపోతుందిగాని ఆధ్యాత్మికంగా మెట్టు నెక్కాలనే ప్రయత్నం ఎలాకలుగుతుందినీకు?—

(స్వధర్మమైనపని)గాక ఇతరుల కయిన పనినెఅంటెనిష్కామ కర్మనె నీవుచేసి పరమేశ్వరార్పణంగా జీవితాన్ని నడపగలితె—అంటే స్వార్థ బుద్ధి ఏమీలేక సమర్పణం దివ్యమైనడపగలిగితె పాపం అంటే ప్రశ్నలేదు గనక భరవావుండదు.

సర్వ సమర్పణం అనేసంగతి రెండవ మూడవ నాల్గవ ఐదవ, అధ్యాయాలలో చెప్పడం అయింది. ఈ ప్రపంచంలో నడిచే అన్ని

కర్మలూ భగవంతుని కర్మలు. అవిచేయడానికే ఈ జనాభాఉన్నారు. ఎవరికి కేటాయింపబడిన భాగం వారు చేయాలి. అలా చేస్తే సర్వ సమర్పణం అయినట్లే. ఇది ఒక దోవజనులు—వ్యక్తులు—సమాజంలో సభ్యులు, సమాజంకోసమె బ్రతకవలసినవారు! సమాజానికి వ్యతిరేక మైన పనేదీ జనులు తమ లాభం కోసం చేయడానికివీ ల్లేదు.వారు సమా జ సేవకోసమె బ్రతకాలి. ఎ ఏ పరిస్థితుల్లో వారు ఉండగా ఏ ఏకర్మలు కర్తవ్యాలెవారికి ఉంటాయో వాటిని—సమాజానికి తాము చేయవలసిన సేవాకర్తవ్యాలను—ఆదృష్ట్యానే చేయాలి.అదె వారి స్వధర్మం అనేది. అలా ప్రతి వాళ్లూ స్వధర్మాన్నే చేసికోవాలి. శాస్త్రాన్ననుసరించి రాజ శాసనాన్ననుసరించి బ్రతుకునడుపుకోనాలని బోధ.

స్వధర్మ మంటే కేవలం కులధర్మం కాదు ఈరోజుల్లో. పూర్వ కాలంలో అలాకావచ్చుగాక.సమాజమనే భగవంతునికి,వ్యక్తితన పరిస్థి తుల్లో చేయవలసిన సేవఏదో అదివాని స్వధర్మం. తండ్రి పోషించట ం, అన్న ఆదరించటం, తల్లి ప్రేమించటం, పిల్లలు గౌరవించటం, అనేవి స్వధర్మాలవుతవి. వారు ఇతరులకు చేయవలసినసేవ అదె. స్వధర్మాన్నుంచీ వికంపితుడవు కారాదు అనేది అందుకె.

అంతేగాని నేను ఉద్యోగంచేస్తానని స్వాధ్యాయంచేసేవాడు తన పనిమాని వచ్చినా నౌకరీచేసేవాడు వర్తకం తానూ చేయాలని ఉబలాట పడి తనపనిమానినా అది సమాజసేవ కయినట్లయితె ఫరవాలేదేమొ గాని—స్పర్ధతో నీవుచేస్తున్నప్పుడు—"అపనినేనే వెందుకు చేయరాద"నే మత్సరంతో చేసేటప్పుడు మాత్రం "తప్పు" అవుతుంది అని శ్రీకృష్ణుని బోధ. నేనూ—నీవూ—అనేతేడాలతో అది స్వార్థ చింతనం ఆధారంగా చేసేపనిగనక, పాపం కలగటం తథ్యమని బోధ—సమర్పణం జరగదు. పుణ్యావిషయంకాదు. సమాజసేవ కుంఠితమైపోతుంది స్మగ్లరుచేసే వర్తకంలా! ఇదీ ఇందులోని అంతర్యం.

48. ఒకడు మహారాజ వంశంలోవాడే అయి ఉండవచ్చు,కాని అతడి మనోబుద్ధులుసేవకావృత్తిపై ప్రసరించడం అసంభవమేమీకాదు. రాజ్యాలేల వలసినవాడు ఎక్కడో నౌకరీచేయటానికై ఇష్టపడవచ్చు. అతడి స్వభావమలాంటిదైతే, ఆ కర్మనే చేపట్టనీయవచ్చునుగాక. కాని అతడు ఆ కర్మను సమాజ సేవాబుద్ధితో చేయటం స్వధర్మం చేయడ మవుతుంది.లేదాభవంతునిపనినె నా కరచరణాది అవయవాలతో మనోబుద్ధులతోచేస్తున్నాననే సర్వసమర్పణ బుద్ధితో చేయాలి,అప్పుడె నైష్కర్మ్యసిద్ధి కలిగేది. అర్జునా! నీవు యుద్ధప్రవృత్తినీ అపలాయన ప్రవృత్తినీ కలిగినవాడివి. వెళ్ళిపోయి ముక్కుమూసుకు కూర్చుంటా ననటం నీ సహజకర్మను వదలి వేయుట మవుతుంది సుమా!

సహజకర్మలో దోషం ఉన్నదనే ఊహ,ఒక కర్మను మరొకరి కర్మతో పోల్చటం వల్ల కలిగేటటువంటిది. ఏకర్మను తీసికొన్నా దానిని మరొకదానితో పోల్చినప్పుడు ఏదో ఒక దోషం కనపడటంకద్దు అలా అగ్నిపైన పొగ ఆవరించియున్నట్లుగా కర్మలన్నిటికీ దోషం అవుపిస్తూనె ఉంటుంది. అది అహం అనే ఊహవల్లవచ్చి-చేరేటటు వంటిదిగాక.

49. మరి ఎలా అలా అన్ని కర్మల్లోనూ దోషముంటే-అని ప్రశ్న-దానికై ఉపాయం చెప్పటం. దోషాలెన్నకుండానే స్వకర్మ చేయ డం. ఆదోషం నీకుతగలదని బోధ. అదిఎలా చేయాలనేది ముఖ్యం. సక్తి లేకుండా చేయటం. ఇంద్రియాలు చెప్పినట్లు-కోరినట్లుగాక భోగ కాంక్షలేక సమ్యగ్దర్శనపూర్వమయిన కర్మ సన్న్యాసం చేయాలి.అంటే కర్మఫలత్యాగం కర్తృత్వాన్ని వదలివేయటం అనేవాటిని జోడించి పని చేయాలని బోధ.

సమాజసేవ అనే "స్వధర్మ కర్మ" చేయటం వల్ల లేదా "పర మేశ్వరుని కర్మను ఇదంతా" ననే సమర్పణ బుద్ధితో చేయటంవల్ల నైష్కర్మ్యసిద్ధినిపొందాలి. కర్తృత్వం వదలటం, ఫలం కోరక పోవ

టం ఈ రెండూ కలిగిన సాధనె పాపాన్నుంచి నిన్ను బయటకు వేయ గలిగే మార్గం ఉత్తమోత్తమమయిన కీలకం.

ప్రస్తుతకాలానికికూడ యీ బోధ ఉపయోగించేవిధంగా భగవంతుడు రెండు వేలేండ్లక్రిందట చెప్పటం అద్భుతం అనిపిస్తుంది.

50. ఈ నైష్కర్మ్యసిద్ధి వల్లప్రయోజనమేమిటి? లేదా ఆతరువాతి సాధన ఏమిటి అనేది 50 నుంచి 53 వరకూగల శ్లోకాల్లో చెప్పబడుతున్నది—బ్రహ్మాన్ని పొందేందుకు కావలసిన స్థితిని పొందటమె ప్రయోజనం. కర్మలు చేయటంలోగల కర్తృత్వాన్ని వదులుమని వెనక చెప్పినప్పుడు అలా వదలటమనే జ్ఞానం—ప్రక్రియ కయినజ్ఞానం మనసులో ఉంటుందేది కదా! దానిని కూడ వదలివేయాలి. అంటే కర్తృత్వం అనేది తనదని ఆలోచించడమే పోవాలని అర్థం. అలవాటుగా ఈ నైష్కర్మ్యం జీర్ణించిపోవాలి. అది చేసే దెలాగో 51–53వరకూ చెప్తారు.

51. త్రిగుణాత్మకులు తమ మనసును సన్మార్గంలో పెట్టుకొనాలి సన్మార్గమంటె స్వార్థభూయిష్టము కాని దైవీసంపత్ మార్గమన్నమాట. పరమేశ్వరునకయిన మార్గము—అని అర్థము, లేదా సమాజంక్షేమంగా బతికేమార్గమనిఅర్థము. అందువల్ల తమగుణాలలోని పాళ్ళను మార్చుకోకలుగుతారు. సత్త్వగుణానికయిన పాళ్ళు ఎక్కువచేసి తమోగుణం రజోగుణం వీటి పాళ్ళుతగ్గింపచేసికొంటారు. సత్వగుణం ప్రధానమై రజోగుణం కొద్దిగాఉన్నప్పుడు నిష్కామ కర్మలు పుష్కలంగా చేస్తుంటారు. నిధిధ్యాసనస్థితి ఇదె. నిద్రలేచింది మొదలు మనసు అంతర్దృష్టిలో లీనంచేసిబాహ్యంగా కాలకృత్యాలు నడుపుతాడు. భగవంతుడ్ని ప్రార్థన చేస్తాడు. శరీరంతో పూవులు పదార్థాలు తెచ్చి భగవంతుణ్ణి అర్చిస్తాడు తన తల్లీ తండ్రె భగవంతుడని అర్చించుతాడుగాక. తన ఆయుధాలు భగవంతుడని అర్చించుతాడుగాక, తన బ్రతుకు భగవంతునికోసం.

పీడొట్టి పిచ్చిలేదా వెర్రి వాడనేవాళ్ళ భావాలను అతడు లెక్కచేయడు. ఆపనివల్లతనకు ఫలితం మోక్షమైనా సరె! అది వస్తుందా రాదా అనే ప్రశ్నలేదు. పరమేశ్వరుని కర్మనె తాను చేస్తుంటాడు. అది కర్తవ్యం కనుక చేస్తుంటాడు. వచ్చిన ఫలం అనుభవిస్తున్నాననే స్పృహకూడ పోతుందతడికి. అప్పటికికర్తృత్వమూ, ఫలమూ రెండూత్యాగమవుతవి ఆతడు శుద్ధ సత్త్వంలో చేరటానికి ప్రాతిపదికదిః కేవలం పూజల కోసం బ్రతుకుతున్నవాడతడు—పనికోసం బ్రతుకున్నవాడతడు. బ్రతుకు కోసం కర్మవ్యంచేయటంకాదు! ఇది కేవల సత్వ ప్రధానమైన స్థితి. ఈ స్థితిలో నిష్కామకర్మ చేయాలనే సక్తి కూడ పోతుంది. సక్తివిపదలి గుణాతీతస్థితికి పోయేసమయం ఇది. సమాధిస్థితికి దగ్గరస్థితి.

ఆ స్థితిలో ఆత్మనుచూస్తూ ఆత్మనే బ్రహ్మముగానిశ్చయించి మన లేస్థితి ఉంటుంది. బుద్ధి, ఇంద్రియాల వైపుగల కిటికీలను మూసేసి, ఆత్మ వైపునకు గలకిటికీలను తెరచి ఆత్మను చూస్తూఉంటుందవచ్చు. సంశయంలేని స్థితి అది. వెనక్కుతిరిగితె ఎలావుంటుందోనని అనిపించనే అనిపించదన్నమాట. శరీరసంబంధమైన సక్తి ద్వేషం శబ్దాది విషయాల్లో ప్రేమ ఉండదు. అప్పుడు—ఏంచేయాలంటె,—

52. జనులు లేనిచోట ఉండాలి. అంటే లౌకికవ్యవహారాలకు దూరంగా ఉండాలన్నమాట. మితంగానె భోజనంచేస్తుండాలి. ఎక్కువ పనులు చేయనప్పుడు—మరి—ఎక్కువతిండి తింటేఎలాగ? మనోవాక్కాయాలను నియమించి ఉంచుకోవాలి. లేకుంటె శరీరంలోశక్తి ఎక్కువ కర్చయిపోతుంది కదా! ఇంతకంటె ముఖ్యమైంది—ధ్యానయోగ పరుడ వైయుండాలి,

53. దేహేంద్రియాలు ఆత్మకంటె భిన్నమైనవనె ఎరుక కలిగి, అహంకారం లేకుండా ఉండాలి. అంతా భగవంతుడె చేస్తున్నాడు అంటేనేగాని అహంకారంపోదు. మొండిపట్టుదల ఉండరాదు, యోగ బలం ఉందిగదా అని కుమార్గాన్ని అనుసరింపకూడదు. తనకు కలిగిన

విషయములందు లేదా వస్తువులందు కామం గాని-అవి కలుగక పోతే క్రోధంగాని లేదా ఇవి ఇక్కడ తేరగా ఉన్నాయి గదా స్వీకరించుదా మనుకోవడంగాని ఉండకూడదు. ఇలాచేస్తూ మమత్వంలేకుండా చిత్త విక్షేపంలేకుండా-శాంతిగా ఉంటే అప్పుడుబ్రహ్మత్వాన్ని పొందటానికి సమర్థుడవుతాడు. 51 నుంచి 53 శ్లోకాల్లో చెప్పిన లక్షణాలను సంత రించుకొంటె బ్రహ్మభూతుడవుతాడు. ధ్యానయోగపరుడై సతతమూ ఉంటె ఈ లక్షణాలుస్థిరపడుతవి.

అప్పుడెలా ఉంటాడు మానవుడు?-అనేది తరువాత చెప్పబోతు న్నారు. అతడు వెళ్ళి ఎక్కడో హిమాలయాల్లో సమాధిలో చేరిపోయి భగవంతుడయిపోయి మనకు కనపడటం మానేస్తాడా అనిపిస్తుంది. కన పడని భగవంతుని స్థితిని 5 నుంచి 11 అధ్యాయాలలో క్షుణ్ణంగా విమ ర్శించిమరీ చెప్పాడు పరమాత్మ,ఇప్పుడు,ఆస్థితికి ముందెగల మరోస్థితి మాట చెప్పబోతున్నారు. బ్రహ్మవిదుడైన మనీషి యొక్కస్థితి.

54. అలా బ్రహ్మజ్ఞానాన్ని పొందటానికి సమర్థుడైన బ్రహ్మ జ్ఞాన నిష్ఠుడు ప్రపన్నాత్ముడై, ఆత్మయందే సంతుష్టి నొందనవాడై- ఎందుకుగానీశోకింపనివాడై దేనినీ కాంక్షింపనివాడై సర్వభూతములం దూసముడై వర్తిస్తూ ఉంటాడు.ఇవి బ్రాహ్మీస్థితిపరునకుగల లక్షణాలే అంతేకాదు. మరియొక ప్రధానలక్షణమున్నది ఈ బ్రహ్మభూతునికి. ఏమిటంటే "పరాం మత్భక్తింలభతే' అన్నాడు శ్రీకృష్ణుడు. నాసం బంధమైన పరాభక్తిని పొందుతాడు అన్నాడు. అది అత్యంత విస్పష్ట మైన "భక్తి"అనిబోధ.

55. ఈ పరాభక్తి యొక్క విశిష్టత ఏమిటి? భక్తి అనంగానే చమటలు కారేదాకా చిందులుత్రొక్కే భక్తి జ్ఞాపకంవస్తుంది. అది కాక పోవచ్చు. ఈ భక్తి జ్ఞానలక్షణమైన భక్తి. ఈ జ్ఞాన భక్తివల్ల ఉపా ధుల్లో (శరీరాల్లో అని అర్థం) భేద కారణమేమిటో తెలుస్తుంది. ఈ

వివిధమైనరూపాలవెనుకగల ఆత్మ సంగతి తెలుస్తుంది. ఉపాధిశూన్య మైన ఆత్మ ఏది అనీ, అది ఎలా ఉంటుంది అనీ తెలుస్తుంది. పైగా ఇవన్నీకూడ ఆ భగవంతుడేనని-నేనేనని తెలుస్తుంది. అనుభూతి అవు తుంది. అంటే అంతర్దృష్టిపూర్వకంగా తత్త్వతః అనుభూతి అవుతుం దని అర్థం. భగవంతుని అలాతెలియటమె ఇక్కడి విశిష్టత. అదేజ్ఞాన భక్తి. అప్పుడతడు నాయందె ప్రవేశిస్తాడు. భగవంతుడె అన్నిటాఉన్నా డని విన్నవారు ఆతడు (భక్తుడు) నాయందె ప్రవేశిస్తాడన్న శ్రీకృష్ణుని మాట నెలా అర్థంచేసికొంటారో చేసికొనండి. అతడు నేనులో చేరు తాడు అంటారా? అతడెప్పుడూ నేనులో నున్నవాడే. నేను అంటాడు గదాపిలిసె: అలా ఆ నేనులో ఉంటున్నానని తెలిసికొంటాడనచ్చునేమొ

56. ఈ బ్రహ్మభూతుడు ఉపాధి (శరీరం) కలిగి ఉన్నంత వరకూ అందరిలా కర్మలను చేస్తూనే ఉంటాడు, గుండె కొట్టుకోవా ల్సిందె. జీర్ణకోశం పనిచేయాల్సిందె. శ్వాసనడవాల్సిందె. సమాధి స్థితిలో కూర్చోవటంకూడ కర్మేకదా! ఏపనిని మానేస్తాడు గనక! అతడు ఏలాటి పనులు చేస్తున్నా "నన్ను" శరణు పొందిన భక్తుడు కావటాన "నా" అనుగ్రహం కలవాడై సనాతనమూ అవ్యయమూ అయిన స్థానాన్నిపొందగలుగుతాడు. జీవన్ముక్త స్థితిలో తనను అడిగిన వాటన్ని టికి సమాధానం చెపుతాడు. గురువై శిష్యుని ఉద్ధరిస్తాడు,

57. అర్జునా! మనసు ద్వారా వివేక బుద్ధిద్వారా కర్మ లను "నా" యందు సన్న్యసించినవాడవు కావలసింది. "నా" యందు అంటె గురువునందు-అంటె పరమాత్మయందు అని అర్థం- ఆసక్తి కలవాడవుకావలసింది, బుద్ధి యోగాన్ని పాటించి మద్గత చిత్తుడవు కావలసింది. ఇదె ముఖ్యం.

58. ఈ లక్షణాలను సంతరించి, మద్గత చిత్తుడవయినట్లయితె సంసార బంధమైన-అంటే-జన్మమృత్యువులకు సంబంధించిన అన్ని దుఃఖాలనూ తరించుతావు. అలాగాక త్రిగుణాత్మకస్థితిలోనే ఉన్నవాడివై

పండితుడవనుకొంటూ దురభిమానం చేత, నేనుచెప్పిందిపాటించక,నీకు గల కర్తవ్యాన్ని వదలివేసేటట్లయితెపురుషార్థభ్రష్టుడవైపోతావుసుమా!

59. త్రిగుణాత్మకుడవైన నీవు అహంకారాన్ని ఆధారం చేసికొని "యుద్ధం చేయను" అని చేసిన నిశ్చయం వట్టి భ్రమాత్మకమైనదని తెలిసికొను. ఈ సర్వమును పనులూ త్రిగుణాలవల్ల జరుగుతున్నవని చెప్పానుకదా. నీకుగల త్రిగుణాల పాళ్ళు నిన్నుయుద్ధంచేయకుండ ఉండనీయవు. అవి నిన్ను యుద్ధంలోకే లాగివేస్తవి. సందేహంలేదు.

60. అవివేకంవల్ల నీవు "ఇప్పుడు యుద్ధంచేయనుగాక"అనుకొన్నావు.కాని నీస్వభావమెనిన్నుతిరిగి యుద్ధంలోపాల్గొనేటట్లుచేస్తుంది. నీవు సహజకర్మచేత బద్ధుడవయ్యా! నీ ఇష్టమిప్పుడు వేరువిధంగా ఉన్నా నీవుయుద్ధంచేయటం తప్పదుగాక. సహజకర్మ చేయటం తప్పనిసరి. ఈ విషయంలో నీవు అవశుడవుసుమా! నిజానికి కర్ణుడువచ్చి కృష్ణుని తనఎదట తిట్టటం ఆరంభిస్తే చూస్తూ ఊరుకోగలడా అర్జునుడు యుద్ధంచేయకుండా! ఊరుకోలేడుగాక! ఎందుకంటె అది అతడిస్వభావగుణం అని తెలిసికొనాలి మనం.

61. అర్జునా! ఈశ్వరునికి బ్రహ్మాండమైన ఒకానొక శక్తి ఉంది. ఈ దేహాభిమానులయిన జీవులనందరినీ యంత్రాల్లో అమర్చి బొమ్మలను త్రిప్పినవిధంగా తాను వాళ్ళహృదయాల్లో ఉండి త్రిప్పుతున్నాడు. ఈ శక్తినె చూచి మాయాశక్తా!అన్నట్లు ఆశ్చర్యపడిపోతాం నిజానికి త్రిగుణాలే ఆలా చేయిస్తున్నదిన్నీ. అవి మాత్రం ఎక్కడివి? భగవంతుడి సచ్చిదానందాలేగా! ఆయన యొక్క సత్ చిదా నందాలనే లక్షణాలే వీరియందునిల్చి త్రిగుణాలుగా పిలవబడి వ్యక్తులను నడిపిస్తూఉంటయి, ఐతే ఇకనేచేసేదీ చేయాల్సిందిలేదా అనద్దు. త్రిగుణాత్మక స్థితిలో ఉన్ననీవు కర్తవ్యంచేసి స్వధర్మం నెరపడం చేయాల్సి ఉన్నావు, ఈ కర్తవ్యంవదలి ఆపనిచేస్తే ఇంకామంచిదిగదాఅనే

తర్కించే నిష్పాక్షిక స్థితినీకులేదు· అలానీవీస్థితిలో చేసేనిర్ణయం నీకు గలవాసనలనేదోషాలవల్ల తప్పుదారిలోనే పడుతుంటుందిసుమా! అం దుకని శాస్త్రాన్ని అనుసరించి "అసక్తి"తో కర్తవ్యమని చెప్పిన కర్మ లను చేస్తూఉండు. అదె బ్రతుకు మానవుడికి. అర్జునా, ఆహారం, ధృతి, కర్మ, కర్త ఇలాటివాటన్నిటినీ చెప్పి వాటిలోని త్రివిధ భేదాలన్నీగుణ లక్షణాలని నీకుచెప్పింది ఎందుకో గ్రహించావా? ఇన్ని దృష్టులున్నా యనేది చెప్పడానికి, నేను శాస్త్రమే ప్రమాణమని చెప్పిఊరుకోంటె ఈ యీ విభిన్నగుణాల వ్యక్తుల దృష్టినీకు కలిగినప్పుడల్లా, శాస్త్రాన్ని మరో అర్థంతో చెప్పటానికి ఆరంభిస్తావేమోనని!-ఆదృష్టుల్నిపొంది శాస్త్రం ఇదమిత్థమని చెప్పి అందరిపై రుద్దటానికి ప్రయత్నించకు అంటున్నాను. నేనుచెప్పిన "తత్త్వతః" వాటిని అర్థంచేసికొని వాటిని అనుసరించటమే సాధన. గుణాత్మకమైన దృష్టితో వాటిని చూచి నప్పుడు, వాటిలోని కర్మలుచేసినప్పుడు, ఆయాఫలితాలను అనుభ వించేటప్పుడు-నేనుచెప్పిన ఈ(నిధిధ్యాసనాత్మకమైన)(సమాధివరకూ పోగలిగె) ఫలితం నీకు కలుగదని చెప్పటానికె ఇన్ని చెప్పాను. మరిచి పోవద్దీమాట. మళ్ళీ ఈ మాటలుచెప్పే సందర్భమె ఉదయింపకపో వచ్చు. నేను చెప్పిన తత్త్వదృష్ట్యోపనులుచేస్తే ఆ ఫలితం నీకు కలుగుతుంది,

62-64. అర్జునా! ఈ గీతా తత్త్వాన్ని మిగల్చకుండా అంతా చెప్పేశాను. ఏ ఈశ్వరుడు ఈ అనాత్మ అనబడే దానిద్వారా ప్రపం చాన్నంతనూ నడిపిస్తూ సర్వమైన ఉపాధుల్లో హృదయాంతస్థుడై ఉన్నాడో అతడిని శరణు పొందటం ముఖ్యం, అతడి కృపవల్లనే పరమమైన శాంతిని శాశ్వతమైన మోక్షాన్ని పొందగలవు, నేను చెప్పిన ఈ తత్త్వం, కీలకమైన మౌళికమైన ధర్మమని తెలిసికొను. ధర్మాలకు ధర్మమైనట్టిదిది. సంవిధానమన్ననూట. ఇది తెలిసి, ఆమీదట నీవెలాటి నిశ్చయం చేస్తావో చెయ్యి. ఈ తత్త్వమె సర్వశాస్త్రాల్లోనూ గల

పరమ గుహ్యమైన శాస్త్రం. నీవు నాకు ప్రియుడవు కనక నీకిది ఉప దేశించాను. పురుషార్థ ప్రాప్తిని నీవుపొందాలనే ఆంతర్యంతో నేను నీకిది ఉపదేశించాను. దివ్యుడు కావడమె చిట్టచివరి పురుషార్థానికిదోవ. త్రిగుణాత్మకుడు కర్తవ్యాన్ని అసక్త మనస్కుడైచేసిదివ్యుడుకావాలి. ఇది జ్ఞాపకముంచుకొను.

65. అర్జునా! నేచెప్పినదాని సారం మళ్ళీ చెప్తానువిను. మన్మనాభవ–"నా"యందే మనసు కలవాడవు కావలసింది. మద్భక్తః(భవ)–నాభక్తుడవుకావలసింది. మద్యాజీ(భవ)–నన్ను పూజించేవాడవుకావలసింది. మాంనమస్కురు–నాకు (భగవంతునికి) నమస్కరించు. శరణు పొందు. అప్పుడు నీవు(త్రిగుణాల్లో కూడుకొని యున్నవాడవు)దివ్యుడవవుతావు.–ఇదె శాస్త్రాలు చెప్తున్న పరమార్థం"నేను"ఎవరోతెలిసిజ్ఞాన భక్తితో అలానడుచుకొనుమని శ్రీ కృష్ణపరమాత్మ చెప్తున్నాడు. నీకు నేను ఈ సత్యాన్ని ప్రతిజ్ఞాపూర్వకంగా చెప్తున్నాను సుమా. నీవంటె నాకు ఇష్టంగనుక చెప్తున్నాను."అన్నాడు.

అర్జునునికె చెప్పినా జిజ్ఞాసువులందరకు ఇది పనికి వచ్చేదే, తెలిసికొనాలి–అనే ఆసక్తి ఉండాలి. దానిని తరిచి తెలిసిపాటించటం ప్రారంభించితె అప్పుడు భగవానుడు చెప్పిన మాటలభావాల వివరాలు మనసులో నిలుస్తవి.అప్పుడు ఆసలహా తప్పకుండా మనకుకూడ అవుతుంది మనం జిజ్ఞాసువులమయితె,

66. అంతెందుకు:ఈలోకంలో ఎన్నోధర్మ లక్షణాలున్నాయి. ఈధర్మశాస్త్రాలు ఎప్పటికప్పుడు అవసరమైన ధర్మలక్షణాన్నిచెపుతూ వచ్చినయి.వీటినన్నిటినీ ఒకేసారిమనం పాటించటం కుదరకపోవచ్చు. అందుకె ఈ ధర్మలక్షణాలకు ధర్మమైన తత్త్వంచెప్పేశానునీకు, తత్+త్వం ఈరెండూ అనగా భగవంతుడూ నీవు ఒకటే ననేదేతత్త్వం. దీని మీద ఆధారపడి సర్వధర్మలక్షణాలతత్త్వాన్నీ తెలిసి పాటించటమె

ధర్మం. ఏధర్మమైనా ఒకొక్కప్పుడు అనుసరణీయం కాకపోయినా కాకపోవచ్చు గాని ఈ ధర్మతత్త్వం సతతమూ అనుసరణీయమైనదే. ఇదె పరమార్థమైనది. ఈ ధర్మతత్త్వసారం ఏమంటే— "మామేకం శరణం వ్రజ" అని. నేను అనేవాడినె—ఆ ఒక్కడినె—ఆశ్రయించాలి అని. "నేను" అనే ఆ నీవే భగవంతుడు—"తత్"—అనేవాడు. అతడినె శరణుపొందు. నీవు — అంటె — శరీరంకాదు — బుద్ధికాదు— మనసుకాదు— ఇంకేవేవోకాదు. నీవు అంటె "నీవె"—అభగవంతుడివి. ఈ మనసూ బుద్ధిలతో తాదాత్మ్యం పొందకుండానే ఎంతో నేపునీకు ఏమోచెప్పేశాను. అలా తాదాత్మ్యంపొందని "నన్నె" శరణుపొందు. అలాచేస్తే ఆ "నేను" సర్వపాపాల నుండి మోక్షాన్ని ఇవ్వడమనేది జరుగుతుంది. ధర్మానికీ ధర్మానికీ వ్యతిరేకం ఉందిగదా. ఏధర్మాన్ని పాటించాలి అనికదా అడిగావు. అందుకె ధర్మాలకు ధర్మమయిన ఈతత్త్వ సందేశం చెప్పేశాను ఇకనీకుశంక రావలసిన పనిలేదు. శోకించాల్సిన పనిలేదు. కర్తవ్యం చేయడమె ధర్మం. నిన్ను ఆ "నేను"తో కలుపుకొని అంటె "భగవంతుని" కలుపుకొని అని అర్థం. గీతాసారం మూడుమాటలే. దేవుణ్ని (నేను'ను) నమ్ము. నీ కర్తవ్యం చెయ్యి. ఫలం పైన దృష్టి పెట్టుకొనకు. ఇదెఆసారం. (Believe in God. Do your duty. Don't aspire for the result).

ఈ శ్లోకాన్ని చరమ శ్లోక మంటారు. అంటె చిట్టచివరి స్థితిని కలిగించే శ్లోకమని అర్థం. చిట్టచివరి స్థితిని చేరిన మీదట పాటించాల్సినట్టి—పాటింప బడేటటువంటి వర్తన మేదో అది ఇందులో చెప్పినారు.

ఆ స్థితికి ఎలా రావడమో ఈ పద్దెనిమిది అధ్యాయాల గ్రంథంలో వ్యాసమహర్షి ప్రస్ఫుటీకరించాడు. "శరీరం వేరు, మనసూ వేరె, వీటన్నిటికీ విస్పష్టమై వేరుగా నేను అనేదిగా భగవంతుడుంటున్నాడు. ఈ మనసులో ఎన్నోవికారాలున్నాయి. అవన్నీ ఈ మనసులోనే ఉంటున్నాయి. నేనుకు సంబంధం లేదు. ఈ బయటి ప్రపంచాన్నిగూర్చి

ఆలోచించడం మాని, తనలోని వికారాన్ని మన్నించటం మానివేసేట్లయితె అప్పుడు మనసు అంతర్ముఖం చేయటం కలుగుతుంది. అంతర్ముఖమంటె "నేను" వైపునకు తిప్పగడమన్నమాట. అలాతిరగడానికి ఎన్నో సాధనలు చెప్పారు, "కర్మలో అకర్మచూడు"మనీ, పనిచేయకుండా ఉండటమనేదొక్కటే నేను అనేవానికి పనిఅనీ, ప్రాణాయామం చేసి అమనస్కత పొందుచుండుమనీ, బ్రహ్మమందే కర్మలు చేయడమనేది ఉంచేసి ప్రవర్తించుమనీ, సమత్వం నేర్వవలసిందనీ ఇలా ఇవన్నీ వ్యక్తి చేయవలసిన ధర్మాలు. మోక్షసిద్ధినిచ్చేవి, అందుకని కర్తవ్య కర్మలు చేసి తీరాల్సినట్టివి అనిచెప్పారు. "స్వధర్మం" అనే "సమాజసేవ" ఎల్లకాలం చేస్తుంటే చిత్తశుద్ధి కలిగి పరమాత్మను గూర్చిన జ్ఞానం కలిగి సర్వ సమత్వం కలిగి, "నేను"లో తాదాత్మ్యం పొంది మిగతావాటితో సంబంధంలేని స్థితి కలుగుతుందనె బోధను ఇంతవరకూచేశారు.

ఈ స్థితి కలిగిన తరువాత ఇకచేసేదేమిటనె శంక ఇప్పు స్థితిలో ఉన్నమనకు కలుగుతుందని ఊహించి శ్రీకృష్ణపరమాత్మ సమాధానం చెప్తున్నాడు. అప్పుడింతకుముందుచెప్పిన ఈ నేతి నేతి అనేసాధనలుగాని, అహం బ్రహ్మాస్మి అనే తీవ్ర తపసు గాని చేసేప్రయత్నాలేవీ అక్కరలేదు. చేసిన ప్రయత్నాలు ఫలించిన తరువాత ఇంకాదేని కోసం ప్రయత్నం? అందుకని ఆచెప్పబడిన పూర్వధర్మాలన్నీ ఆసాధకుడు—అతడిప్పుడు ముక్తస్థితిలో ఉన్నాడు—పాటించడు. "సర్వధర్మాన్ పరిత్యజ్య" అనే అర్థం అతడికి. మరిక ఏంచేస్తాడు? "మాం" "ఏకం" శరణం"నేనును మాత్రమె అనుసంధానం చేస్తాడుఅనిబోధ.

అప్పుడు అతడికి శరీరం ఉండదా? ఉంటుంది. శరీరం ఉంటుంది. మనసూ ఉంటుంది. కాని ఈ మనసు నేను లో లీనమయి ఉంటుంది. ఐతె అతడు మళ్ళి తిరిగి ఈప్రపంచం చూడలేడా? చూస్తాడు.

67.నీవు నాభక్తుడవు కావడంచేత గీతాశాస్త్రాన్ని నీకుచెప్పాను. నీవు దీనిని ఇతర్లకు చెప్పు–గాని,–ఎవరికి పడితే వారికి చెప్పకు.కర్మ యోగి అయినాసరె తపసు చేసేవాడైనాసరె–నాభక్తుడైనా సరె వాడికి చెప్పచ్చు. ఇతర్లకు చెప్పటం వల్ల ప్రయోజనం ఉండదు. ఈ విషయంపై ఈసడింపునూ, 'నా' పై ద్వేషమునూకలిగి ఉండే అసురసంపత్తి గలవారికి చెప్పినా వాళ్ళకిదితెలియకపోగా (నన్నే) భగవంతుణ్ణి తిట్టిపోస్తారు. ఇది పన్నీరు కనకయితే దానిని బూడిదలోపోయవద్దంటున్నాను.అంతె పైగా "సర్వధర్మాన్ పరిత్యజ్యమామేకంశరణంవ్రజ" అనే పైశ్లోకార్థం సందేహంలేకుండా వాళ్ళకు అర్థంకాదు. అందుకని చెప్పద్దంటున్నాడు.

తిట్టి పోయటం ఎందుకంటె ఇంత మోసం అన్యాయం ఈ ప్రపంచంలో నడుస్తుంటే దేవుడెందుకు చూస్తూ ఊరుకుంటాడు అంటారు. –వీళ్ళు ఆదేవుణ్ణి సేవకుడుగాచేసి అలాంటిది జరగకుండా కాపలాపెట్టారన్నట్లు!!లక్షరూపాయల లాటరీ ఇన్ని అవసరాలున్న నాకు రానీకుండా ఫలానివాడికెందుకొచ్చిందయ్యా దేవుడుంటే అంటారు–వీళ్ళతో ఏదో దేవునికి కాంట్రాక్టు ఉన్నట్లు. వాళ్ళు మూర్ఖులు కాదా!

68–69. నీకుతోచినట్లయితె నా భక్తునికి చెప్పుగాక. ఇది పరమగుహ్యతమమైన తత్త్వం.ఇది–అంటె 7వ అధ్యాయంనుంచి18 వ అధ్యాయంలో66వశ్లోకం వరకూను.అలాంటి వాడికి చెప్పినట్లయితె అతడికి జ్ఞానోదయమై సత్ఫలితంకలుగుతుంది. "నా" యందు భక్తి ఇనుమడిస్తుంది. జ్ఞానభక్తి కలిగి అతడు చివరకు "నన్నే" పొందటం అవుతుంది. అలా భక్తులకు ఈ గీతావివరణం తెల్పినవాని కంటె ప్రియమైనవాడునాకు ఈ జగత్తులో ఉండడు.

70–71. మన ఇద్దరిమధ్య జరిగిన ఈ సంవాదాన్ని ఎవరు అధ్యయనం చేస్తారో వారిచేత జ్ఞానయజ్ఞంచేయబడినట్లె. తద్వారా "నేను" పూజింపబడినవాడ నవుతాను, గీతాయజ్ఞం జ్ఞాన యజ్ఞాలలో

ఒకటి. గీతను చదివేవారేగాక చదువుతుంటె విన్నవారు కూడ యజ్ఞం చేసినవాళ్ళే అవుతారు. శ్రద్ధగా అసూయలేకుండా విన్నవారికి ఆయజ్ఞ ఫలితం దక్కుతుంది.

72-73. అర్జునా! నేను చెప్పిన ఈ గీతార్థాన్ని నిశ్చలమైన మనస్సుతో విన్నావా? నీకు కలిగిన సందేహంతీరిందా? మొదట్లో మోహవశంచేత ఏమేమోచెప్పావు. ఇప్పుడా మోహం వదిలిపోయిందా? అని అడిగాడు పరమాత్మ. అందుకు అర్జునుడు అచ్యుతా! నీప్రసాద వశంచేత నామోహం వదలిపోయింది. అప్పుడు మతిపోగొట్టుకొని మోహంలో పడ్డానుసుమా! తిరిగి సుమతికలిగింది నాకు. నిశ్చలమయిన మతి కలిగింది. నీవు చెప్పిందేనేను చేస్తాను. కాదు! నేనుచేయదల చింది-నీవు చెప్పినదేనంటున్నాను. ఇదె శరణుపొందట మంటె భగ వంతుని ఇచ్ఛ ఏదో నేనూ అదేచేయటం అదె శ్రేయోమార్గం. ఎంత ఆలోచించి తర్కించినా నీవు ఏంచెప్పావోదానినే చేయాలనే నిశ్చయం కలిగింది అంటున్నాడు అర్జునుడు. భగవంతుడవయిన నీ సంకల్పం తప్ప నాబుర్రలో విడిగా ఏదీ మిగల్లేదనే స్థితిలో ఉన్నాడు. ప్రపంచం లోతాను ఇక చేయబోయే ప్రతీపనీ భగవత్ప్రేరణతోనే చేస్తున్నట్లు అనుభూతి చేస్తాడికనుంచి అర్జునుడు. మనంచేయాల్సిందీ అదె. అదె శరణుపొందటం.

74-77 ఇంత వరకూగల సంగతి అంతా-సంజయుడు ధృత రాష్ట్రునకు సమాచారంగా చెప్పటం అయింది భారత కథలో. ఇప్పుడిక సంజయుడు తన మనసులోని సంగతి చెపుతున్నాడు. "రాజా! వాసు దేవార్జునుల మధ్య నడిచిన. ఈ అద్భుతమైనట్టిరోమాంచాన్ని కలిగించే సంవాదం నేను విన్నాను. వ్యాసమహర్షి ప్రసాదంవల్ల పరమేశ్వరు డైన శ్రీ కృష్ణుని వాక్కు నుంచి స్వయంగా చెప్పబడిన "గీతాశాస్త్రి మనే" ఈ యోగ శాస్త్రాన్నివినటం కలిగింది. రాజా! శుభకరమూ,

అద్భుతమూ అయిన ఈ సంవాదాన్ని తలచి తలచి మళ్ళీ మళ్ళీ ఆనం దిస్తున్నాను. ఆ మహానుభావుని విశ్వరూపాన్ని తలచుకొనితలచుకొని నేను ఆశ్చర్యానందాలతో తలమునకలై పోతున్నాను – సంజయుని కంట బాష్పాలు కారుతున్నాయి!!

78. ధృతరాష్ట్రమహారాజా; ఇప్పుడు ఈ యుద్ధం సంగతేమ యింది అని కదా అడిగావు! చెప్తానుగాక. అంతేకాదు. ఏంకాబోతోందో కూడ చెప్తాను. ఈ ఇతర సమాచారాల్ని చెప్పడానికేంగాక, రాజా! అవధరించు. ఎక్కడ యోగీశ్వరేశ్వరుడైన శ్రీకృష్ణుడున్నాడో ఏ పక్షాన ధనుర్ధరుడైన అర్జునుడున్నాడో ఆ పక్షాన, శ్రీ, విజయం, భూతి. ధృవ స్థితి, రాజనీతి అన్నీ సమకూరి ఉండి తీరుతవి–అని నాకుతోస్తోంది, మహారథుడైన భీష్ముడు పడిపోయినాడంటే ఇంతకంటె ఇంకేకారణం కావాలి!

ధర్మక్షేత్రమయిన ఈ కురుక్షేత్రంలో స్వార్థంకొరకు కర్మ చేయటం ఆరంభిస్తే కార్యకారణసంబంధాన్ననుసరించి ఫలితంవస్తుంది కదా అనుకొంటున్నావు! నీపుత్రులు స్వార్థంకోసం యుద్ధం చేస్తున్నారు గదా, పెద్ద సైన్యాన్ని కలిగి ఉన్నారుకదా అని వారికే జయం రావ టం స్థిరమని అనుకొన్నావు! తీరా ఈ పదిరోజుల పర్యవసానం ఇలా అయిందేమనీ, ఏమిటి కథ అనీ తెలిసికోటానికి నన్నుపిల్చావు. నీపు త్రులు పాటించే స్వార్థభూయిష్టమయిన లక్షణం తత్త్వదృష్ట్యా లొగ్గ యిన ధర్మం. ఆ ధర్మం ఈతత్త్వంముందు ఎంతటి స్వల్పఫలితాన్ని మాత్రం ఇవ్వగలదు గనుక! నీబిడ్డలు యుద్ధంలో మరణిస్తే స్వర్గం రావడం ఖాయం–ఈ స్వార్థధర్మాన్ననుసరించి. అంతెనని నాకు తోస్తు న్నది. నీబిడ్డలకు సక్తివుంది, పాండవులకు సక్తి కంటె భగవంతునె ఆదర్శంగా గలిగిన నడక ఉంది. వాళ్ళు భగవంతునె నమ్ముకున్నవాళ్లు. నీపిల్లలు స్వార్థాన్నే నమ్ముకొన్నవాళ్ళు. రాజా! యత్ర యోగేశ్వరః కృష్ణో యత్రపార్థోధనుర్ధరః. తత్రః శ్రీ ర్విజయో భూతి ర్ధ్రువా నీతి మతిర్మమ.

ఓం తత్సత్.

# ఉపసంహారము



శ్రీ మద్భగవద్గీత లోని పద్దెనిమిది అధ్యాయాల సారమయిన “సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ” అని ఆదేశించి శ్రీ కృష్ణుడు “అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః” అని అభయమిచ్చాడు. కర్తృత్వం పెట్టుకోవద్దని ఇంతసేపూ బోధించి, భగవంతుడుగా సమష్టి మనసుగా కర్తవ్యం ఆనె నెత్తిన వేసికొంటూ “మోక్షం ఇస్తాను” అంటున్నాడు భగవంతుడు!!! భగవంతుడైన సమష్టిమనసుకు ప్రత్యేక ప్రతిపత్తి ఉన్నదనేది గమనీయము. ఆ ప్రతిపత్తి నాధారం చేసికొని జీవన్ముక్త స్థితి నందిన ఆత్మలా అలామాట్లాడటం లోని నిజం—తెలియని అజ్ఞులకు ఈ సంగతులు చెప్పకుమనటం—అంటే భక్తిలేని వారికి ఇవి చెప్పవద్దనటం—అందుకే. నేర్వాల్సింది జ్ఞానం ఇక ఆ పైన చేయాల్సింది భక్తి!! అనిపిస్తుంది.

పద్దెనిమిదధ్యాయాల్లోని విషయాలు అర్జునునకు శ్రీ కృష్ణుడు చెప్పింది—అర్జునుడు తాను చేయవలసిన కర్తవ్యానికి అడ్డంకిగా వాని బుద్ధికాకుండా సమ్మతింపజేయడానికే. ఆ మీదట అర్జునునకు గలభక్తే మిగతాపని చూచుకొనాలి—కర్మచేయాలి. అనసక్తతతో చేస్తే చిత్తశుద్ధి కలిగి జ్ఞాన భక్తి నిలుస్తుంది. ఇదే ఈ పద్దెనిమిదధ్యాయాల్లో సాధించింది భగవానుడు.

ఐతే ఇది విన్నతరువాత ఏంచెయ్యాలిఅని మనకు సందేహం! జీవితాంతం దోవసరి చేసికొంటూ ఉండటమే తప్పనిసరి, భక్తి—జ్ఞాన భక్తి—చేయడమే కర్తవ్యం అవుతుంది. అది స్థిరంగా నిలవాలి మనసులో రామకృష్ణపరమహంసలా.

ఐతే రామకృష్ణ పరమహంసలా ప్రపంచంతో సంబంధం అక్కర్లేదా అనిపించటం కద్దు. జ్ఞాన భక్తి స్థిరం అయితే చెఱకుపిప్పిని వదలి బెల్లం మాత్రమే వెదికిపట్టే చీమలా భగవంతునే పట్టుకొనటం

నీకు స్వభావమె అవుతుంది. అలా అయితె ఎలా అని ఇప్పుడు నీవాలో చించాల్సినపనిలేదు. ప్రాపంచిక విషయాల వైపునకు మనసు వెళ్ళి పోతె భక్తి నిలవదు కదా! భక్తి చేస్తె ప్రాపంచిక విషయాలవిషయం ఏమవుతుందనే యోచన చేయటం తెలివితక్కువ అనిపిస్తుంది. ఏమీకాదు ప్రపంచం-చక్కగా వెళ్ళిపోతుంటుంది.

ఎఱుక కలిగినవారు శ్రీరామకృష్ణపరమహంసలా జ్ఞాన భక్తిని పొందాలి, లేనివారు మళ్ళీ మళ్ళీ భగవద్గీతా పఠనం శ్రవణం మననం చేయాలి. అదె నిధిధ్యాసన వైపునకు తీసికొనిపో గలిగినట్టిది. ఆభగవంతుని ఆశీర్వాదంకావాలి, అదె ఈ సర్వానికీసారం. దానికై ప్రయత్నమె ఇది.

## గీతా సారం

Do your duty. Believe in God. Don't aspire for result.

ఓం తత్సత్.



# శ్రీమద్ భగవద్గీతా మాహాత్మ్యము

1. మానవుల్ని బిడ్డల్లా చూచుకొంటున్న భూదేవి విష్ణుమూర్తితో ఒకసారి ఇలా అన్నది. "ఈ మానవులు దుఃఖాలు అనుభవిస్తున్నారు కదా. వీరికి జ్ఞానభక్తి కలిగేదెలా అనేబాధ ఉంది"అని

2. "ప్రారబ్ధం అనుభవిస్తున్నాగాని గీతాభ్యాసంలో సదా అనుభవం చేస్తుంటే కర్మలచే పట్టుబడక ముక్తుడవుతాడు' అని విష్ణుమూర్తి ప్రత్యుత్తరమిస్తాడు; ఇంకాఇలా అంటాడు —

3. మహాపాపం కూడ గీతాధ్యయనుని—నీరు తామరాకునంట జాలనట్లు—అంటలేదు, దూరమైపోతుంది.

4. గీతాధ్యయనం వలన పుణ్య తీర్థాల్లో స్నానం చేసినంత ఫలంకలుగుతుంది. అనగా దేశ దేశాలు తిరిగి సేకరించిన అనుభవం అనుభూతులు గీతా ధ్యయనం వల్ల కలుగుతవి అని అర్థం.

5. అలాంటి అనుభవం అనుభూతి ఎలా కలుగుతవనుకొంటావేమో. గీతను అధ్యయనంచేయటంలో ఆచోట దేవతలందరు, ఋషులు, యోగులు, నాగులు గోపికలు, నారదుడు, ఉద్ధవుడు, సునందాదులందరూ సహాయకులైఉండి జ్ఞానభక్తినితెలుపుతారు.

6. ఆచ్చోట నేను సదాఉంటాను కూడాను కదా! అనగా ఆ సత్సంగములో "నేను" అనేదాని "ఆత్మ" అనేదాని ప్రసక్తి తప్పక రాగలదని కూడ బోధ.

7. 'నేను' ఈ ముల్లోకాలూ ఏలుతున్నది గీతాజ్ఞానము నాశ్రయించేకదా! ఎందుకనంటే అందలిజ్ఞానం త్రిలోక పరిపాలనకూ మూలకందమై ఉన్నది.

8. గీత పరబ్రహ్మ విద్య. అందులో సందేహంలేదు. స్వానుభూతి వల్లనే ఇది తెలియగలరు ఎవరయినా. ఓంకారంలోని చివరి అర్ధమాత్రచే పరబ్రహ్మతత్త్వం సూచింపబడటం ఈ గీతలోఉంది.

9. గీత శ్రీకృష్ణపరమాత్మచే మూడువేదాలసారంగా చెప్పబడింది. పరమానందస్వరూపమైంది గీత. తన నాశ్రయించిన వారికి తత్త్వజ్ఞానాన్ని చేకూర్చుతుంది.

10. పద్దెనిమిది అధ్యాయాలనూ ఏకాగ్రమైన మనసుతో అధ్యయనం చేసినవాడు జ్ఞానియై పరమపదాన్ని పొందుతాడు.

11-13. తొమ్మిదధ్యాయాలే అలాచదివితె గోదానఫలం, ఆరధ్యాయాలే చదివితె గంగాస్నానఫలం. మూడధ్యాయాలు చదివితె సోమయాగ ఫలం, ఒక్కఅధ్యాయమెచదివితె రుద్రలోకంలోచేరి ప్రమథగణాల్లో ఒకడై ఉండగలగటం-ఈ ఫలాలువస్తవి. మొదట తొమ్మిధధ్యాయాలూ మొదటి ఆరధ్యాయాలూ మొదటి మూడధ్యాయాలూ అనే అర్థంకూడచెప్పవచ్చు అనిపిస్తుంది.చదివి చూడండిఅలా!!

14. ఒక అధ్యాయంలో నాల్గోవంతు చదివితె-భక్తితో రోజు చదవాలి-మానవజన్మదుగానే పుట్టకలుగడం అనేఫలం కలుగుతుంది.

15-17. ఇంకా తక్కువ సంఖ్యలో శ్లోకాలు రోజూపఠించినా కనీసం ఒకటి చొప్పున చదివినా మానవుడు చంద్రలోకంచేరుతాడుగాక ఇంతేమిటి? గీతను ఉచ్చరిస్తూ శరీరంవదలితే సద్గతిపొందుతాడు.

18. ఘోరపాతకాలు చేసినవాడైనా ఈ గీతను అర్థంచేసికొనటం ఆరంభించినట్లయితె వైకుంఠం చేరిసుఖపడుతాడు.

19. కర్తవ్యకర్మను సక్రమంగా చేస్తూ గీతార్థాన్నిమననం చేసేవాడు జీవన్ముక్తుడు కాగలడు.

20. జనకాదులెందరో గీతనాశ్రయించే జీవన్ముక్తులై పరమపదంపొందారు.

21. గీత చదవటమేగాక ఈ మహాత్మ్యాన్నికూడ చదవాలి, గీతను రోకంటి పాటగా పారాయణం చేయటంవల్ల సంస్కృతం వచ్చినవారికి ఒకప్పుడు కాకపోతె ఇంకొకప్పుడు అంతాకాకపోతెకొంత మేధకెక్కి సత్సంగ ఫలాన్ని కలిగించటం విడ్డూరమేమీకాదు. కాని ఈ మహాత్మ్యం చదివితెలియడంవల్ల గీతను అధశీయనం చేయాలనే ఆసక్తి పఠితునకు కలగటం నిజం.

22. కేవలం మహాత్మ్యం చదివి ఊరుకున్నా ప్రయోజనంలేదు. గీతామహాత్మ్యంతోపాటు గీతాభ్యాసంచేయాలి అనిశ్లోకంలో ముఖ్యంగా చెప్పబడింది.

23. గీతాధ్యయనంచేసింతరువాత గీతామహాత్మ్యంకూడచదివితేదాంట్లో చెప్పిన ఫలమంతావచ్చేది ఖాయం అనిసూతమహాముని చెప్పియున్నాడు.

ఇట్లు వరాహపురాణంలోని శ్రీగీతామాహాత్మ్యమ్

# సవరణ పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 11 | చేస్తూనే ఉండాలో | ఎలాచేస్తూనేఉండాలో |
| 2 | 10 | తెలియడం | తెలియడంవల్ల |
| 4 | 25 | కారణమైనవాడిని | కారణమైనవాడినీని |
| 6 | 20 | మారిపోయిగనక | మారిపోయేదిగనక |
| 6 | 25 | అనుకొాత | అనుకొాను |
| 14 | 12 | అనుభూతులను | అనుభూతులని |
| 19 | 22 | మొక్కల్లావేచి | మొక్కల్లాలేచి |
| 22 | 23 | చూనినాతత్అని | చూచినాతత్ అని |
| | | గ్రహించడం | గ్రహించడంవల్ల |
| 30 | 20 | ఆసందం | ఆనందం |
| 30 | 23 | జీ అంటావుగాక | జీవుడుఅంటావుగాక |
| 32 | 23 | అనువో కావు | అనుకోవద్దు |
| 35 | 16 | మనకు | మన |
| 36 | 13 | శక్తి | శక్తే |
| 35 | 20 | తేలిక | తేలిక |
| 36 | 22 | నిజానికి | నిజానికిమనసును |
| 39 | 21 | అనుకోనివారిసంగతి | అనుకొానేవారుసాధన |
| | | గదా యీ | చేయాలిగాక.ఇతర |
| | | | ములసంగతైతేఅవియీ |
| 40 | 9 | అజ్ఞానపూర్ణమైన | అ జ్ఞానపూర్ణమైన |
| 49 | 16 | ఏభూతంలో | ఏభూతంలోనైనా |
| 51 | 20 | విషయంపై అనుభూతి | విషయంపై అనుభూతి వల్ల |
| 54 | 21 | స్వరూపాలకూనేను | స్వరూపాలూనేనే |
| 56 | 14 | నడిచి ఈ | నడిచిఈది, |
| 63 | 13 | అంతలేదు. | అంతర్దృష్టికూడా కావాలి. |
| 64 | 8 | మతజీ | మత్వ |
| 64 | 18 | నాతు | నాకు |

| | | | |
|---|---|---|---|
| 72 | 3 | నదుల్లో నృపుడు | నరుల్లో నృపుడు |
| 75 | 13 | భగవంతుడనే | భగవంతుడని |
| 104 | 23 | అసంగతి | ఆ సంగతి |
| 105 | 15 | బ్రతును | బ్రతుకు |
| 115 | 12 | అనిపరమేశ్వరుడే వని తెనియాలి | అవి పరమేశ్వరుడేనని తెలియాలి |
| 116 | 7 | సాధనలనుగానువినక | సాధనలనుగాని వినక |
| 117 | 4 | అంతే బుద్ధివృ | అంటే బుద్ధి. వృ |
| 121 | 15 | ప్రకృతి. | ప్రకృతి, |
| 122 | 23 | అవగాహనచేసికొను న సాంఖ్య | అవగాహనచేసికొను, సాంఖ్య |
| 123 | 21 | నిలయిస్తూ | వెలయిస్తూ |
| 126 | 7 | పరిమితమైన ప్రకృతి | (పరిమితమైన ప్రకృతి) |
| 126 | 8 | వ్యాపించాలదే | వ్యాపించాలనే |
| 127 | 19 | ఉచ్ఛస్థితిని | ఉచ్ఛస్థితి |
| 128 | 13 | నేను అనేదె | నేను అనేది |
| 131 | 11 | నత్, సత్త్వ | సత్. సత్త్వ |
| 131 | 15 | మునిగినాకూ | ఎ. నిగినాకూడా |
| 136 | 5 | తత్ ను, | తత్‌ను. |
| 137 | 1 | వ్యక్తులతో | వ్యక్తులతో. |
| 137 | 9 | చేసేపనిని | చేసేపని |
| 139 | 22 | ఉండును | ఉండదు. |
| 147 | 8 | కాదు | కాని |
| 147 | 20 | కలగజాలదు | కలుగజాలదో |
| 150 | 21 | "నేను" కూక్షేత్రునికీ | "నేను" కూ క్షేత్రానికి |
| 154 | 8 | బుద్ధి | బుద్ధ |
| 158 | 12 | దనుకొంటూ క | దనుకొంటూకర్త |
| 158 | 16 | మొదటివాడి | మొదటివాడిది |
| 173 | 4 | సాత్వితులు అయు | సాత్త్వికులు ఆయు |
| 178 | 15 | మోక్షం | ఇహం మోక్షం |